శ్రీమతే నారాయణాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీవిష్ణుసూక్త వ్యాఖ్యానమ్

ద్రావిడ వ్యాఖ్యానం: 'శ్రీవైష్ణవసింహ' శ్రీ కృష్ణస్వామి అయ్యంగార్

అనువాదం: 'పండితరత్న' డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అఴగ శింగరాచార్యులు




సమర్పణ: వేదాచార్య విద్యా వేదిక, భద్రాచలం

**శ్రీవిష్ణుసూక్త వ్యాఖ్యానమ్**

(‘శ్రీవైష్ణవసింహ’ శ్రీకృష్ణస్వామి అయ్యంగార్ అనే మహనీయులు అనుగ్రహించిన ద్రావిడ వ్యాఖ్యానానికి అనువాదం)

ఆంధ్రానువాదం : 'పండితరత్న' డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అమ్మగ శింగరాచార్యస్వామివారు

ప్రకాశకులు : వేదాచార్య విద్యా వేదిక, భద్రాచలం

ప్రతులు : 300

ప్రథమ ముద్రణం : 2023

ఆవిష్కరణం : శోభకృత్ నామ సంవత్సర భాద్రపద బహుళ పంచమి (3-10-2023)

ముఖచిత్రం : శ్రీ సీతారామచంద్ర మహాప్రభువులు, భద్రాచలదివ్యక్షేత్రం.

**శ్రీ శ్రీ శ్రీ త్రిదండి అహోబిల రామానుజ జీయ్యరు స్వామివారి కరకమలాల ద్వారా అవిష్కరింపబడినది.**




**వేదాచార్య విద్యా వేదిక, భద్రాచలం వారి సమర్పణ**

*ప్రిన్టింగ్ : కర్షక్ ప్రిన్టర్స్, హైదరాబాదు*

**శ్రీ రామాయ నమః**

**శ్రీమతే రామానుజాయ నమః**

# ధన్యా వయమ్

మేము ధన్యులము, సకలశ్రుతిసమన్వితము, సర్వజనహితము అయిన సిద్ధాంత శ్రీసంప్రదాయములను ప్రవర్తింపచేసిన భగవద్రామానుజుల శ్రీచరణ సంబంధమును కల వంశాలలో జన్మించడం వలన–

ఆ యతిరాజులచే "ఆనందాణ్ పిళ్ళై" అని అనుగ్రహించబడిన తిరుమల అనంతాచార్యులవారి పావనవంశ పాదపంలోని శాఖాశతానికి చెంది ఉండడం వలన–

ఆ ఉడైయవరుల దివ్యాజ్ఞాబద్ధులై, తెలుగు నాట శ్రీసంప్రదాయ ప్రచారం గావించిన ఆచార్య పురుషుల కుటుంబాలలో జన్మలను పొందినందువలన–

ఆ భగవద్రామానుజుల పునరవతారమూర్తులైన శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ పెద్ద జీయర్ స్వామివారికి సన్నిహితులై, వారిచే "నడిచే గ్రంథాలయము" అని శ్లాఘించబడిన వేదాచార్యులవారి సంతానం కావడంవలన– నిజంగా ధన్యులమే కదా!

గెద్దనాపల్లి స్వామివారుగా ప్రసిద్ధులైన శ్రీ ఉ. వే. ప్ర. శ్రీమాన్ గుదిమెళ్ళ వేంకట నరసింహాచార్య స్వామివారు మా తండ్రిగారు. శ్రీ పెద్ద జీయర్ స్వామివారిచే 'వేదాచార్య 'పురస్కృతులు. వారి తండ్రిగారివద్దనే సంస్కృత గ్రంథాలను, సంప్రదాయ గ్రంథాలను అధ్యయనం చేసిన ఉభయ వేదాంత పండితులు. బ్రహ్మశ్రీ తొయ్యేటి వీరావధానులుగారి వద్ద సలక్షణంగా కృష్ణ యజుర్వేదం (తైత్తిరీయశాఖ) క్రమాంతము అధికరించి, వేద విద్వత్సభలలో "వర్ణ క్రమం" చెప్పగలిగిన వేదవిద్యా విశారదులు, "సలక్షణవేదవిద్వాన్" బిరుదాంకితులు.

శ్రీభద్రాచల దివ్య క్షేత్రంలో స్థానాచార్యులుగా వేంచేసి ఉండి, ఆ క్షేత్ర ఆగమ సంప్రదాయాలను, సమయాచారాలను క్రమబద్ధీకరించి, ఆర్చకులను సుశిక్షితులను గావించి, ఆ క్షేత్రప్రతిష్ఠను ఇనుమడింప చేసినవారు.

శ్రీపెద్దజీయర్ స్వామివారి ఆజ్ఞకు బద్ధులై, శ్రీవాసుదాసాశ్రమం నడిగడ్డ పాలెంలోని శ్రీమన్నారాయణ వేదవేదాంగ విద్యాలయమున వేదాధ్యాపకులై, ఎంతోమంది వేదవిద్యార్థులను తీర్చిదిద్దిన వేదాచార్యులు...వారు.

ఆ సమయంలోనే శ్రీ శ్రీ శ్రీ చిన్నజీయర్ స్వామివారు (పూర్వాశ్రమంలో) వీరి వద్ద కొన్ని ఉపనిషద్భాగాలను అధికరించారు. 2008వ సంవత్సరములో భద్రాద్రిలో జరిగిన వేదాచార్యశతజయంతి ఉత్సవములకు వేంచేసిన శ్రీచిన్నజీయర్ స్వామివారు "మా గురువుగారి వైదుష్యం, వారి అధ్యాపన కౌశలం అనితర సాధ్యములు " అని వీరిని కీర్తించారు.

అలాంటి వేదమూర్తికి సహధర్మచారిణిగా, జీవితభాగస్వామినిగా మా తల్లిగారు ధన్యాతిధన్యురాలు.

ఆ మాతృమూర్తియొక్క ఋణం తీర్చుకోలేనిది.

**యన్మాతా పితరౌ వృత్తం తనయే కురుత స్సదా|**

**న సుప్రతికరం తత్తు మాత్రా పిత్రా చ యత్కృతమ్||**

"తల్లిదండ్రులు మనకు చేసే ఉపకారము సాటి లేనిది. వారి ఋణం తీర్చుకోలేనిది" అని శ్రీరాముడు చెప్పినట్లు, ఆ మాతృమూర్తికి మేము ఆచరిస్తున్న ఈ మాతృయజ్ఞం మా పుత్రధర్మాన్ని సాఫల్యం చేసుకోవడానికే తప్ప, వారి పట్ల 'న సుప్రతికరమే'.

కృష్ణానదీ తీరప్రాంతాలలోని శ్రీరంగపురం గ్రామంలో జన్మించిన మా తల్లిగారికి కృష్ణానదీ తీరంలోని వేదాద్రి పంచనారసింహక్షేత్రం అంటే చాలా ప్రీతి. ఆ ప్రీతితోనే తమ తొలిచూలు సంతానాలైన స్త్రీపుం శిశువులిద్దరికి వేదవల్లీ తాయారు అని, వేదాద్రి నరసింహాచార్యులు అనే నామకరణం చేసారు. మనస్సులో దర్శనేచ్ఛ కలిగితే చాలు, తాను ఎక్కడ ఉన్నా, ఎలాంటి ప్రయాణపు అసౌకర్యాలను పట్టించుకోకుండా, ఒంటరిగానైనా సరే, వేదాద్రి క్షేత్రానికి వెళ్లి వస్తూండేది. ఐచ్ఛికమో తెలియము,,

యాదృచ్ఛికమో ఎరుగము, కానీ, ఆమె కడచూపు కూడా ఆ క్షేత్రంలోనే కావడం నృసింహేచ్ఛ కావచ్చును.

శుభకృత్ భాద్రపదబహుళ పంచమి గురువారం నాటి ఉదయం ఆ వేదాద్రిలోనే స్వాచార్య తిరువడికి చేరినారు. వారి ప్రీత్యతిశయాన్ని పురస్కరించుకుని, ఆ వేదాద్రి క్షేత్రంలోనే ఉత్తర క్రియలన్నీ జరుప సంకల్పించుకున్నాము. ది. 15–9–2022 నుండి, ది. 26–9–2022 వరకు నిత్యకర్మగా మాతృయజ్ఞాన్ని నిర్వహించుకున్నాము.

ది. 27 –9 –22 నుండి భద్రాద్రి క్షేత్రంలో దినైకశతకంగా తిరువాయ్ మొழி దివ్యప్రబంధ సేవాకాలాన్ని పది రోజుల పాటు నిర్వహించుకుని, ది. 7–10–2022 నాడు శ్రీవైకుంఠోత్సవాన్ని జరుపుకున్నాము. ఆ కార్యక్రమానికి అభినవ రామానుజులు అయిన శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ స్వామివారి ప్రతినిధిత్వేన శ్రీ శ్రీ శ్రీ అహోబిల రామానుజ స్వామివారు వేంచేసి, భద్రగిరి ప్రదక్షిణ పూర్వకంగా ఇయల్ గోష్ఠి కార్యక్రమాన్ని సంప్రదాయ సంశోభితంగా ఆచరింప చేసారు. అనుగ్రహభాషణమూ చేసారు.

శ్రీవేదాద్రి నరసింహుని సన్నిధిలో శ్రీవైకుంఠయానం, వైదికంగా జరిగిన ఉత్తరక్రతువు.

శ్రీ భద్రాద్రి రాముని సన్నిధిలో శ్రీవైకుంఠోత్సవం, దశదిన ప్రబంధాధ్యయన పురస్కృతంగా పరమ వైదికంగా సాగిన ఉత్తారక క్రతువు.

మముగన్నతల్లి కి జరిగిన ఈ సంప్రదాయ సంవిధానమంతా పెరుమాళ్ళ కృప, ఆచార్యుల అనుగ్రహం, అస్మదాసుల భాగ్యం.

మా ఇలవేల్పు నృసింహుడైతే, "మనత్తుక్కినియానై" అని ఆండాళ్ తల్లి చెప్పినట్లు, మా ఎదవేల్పు శ్రీరాముడు. అందుకే ఈసంవత్సరంమా మాతృయజ్ఞం అంతా ఈ ఇరువురి సన్నిధానాలలోనే చెయ్యాలని సంకల్పించుకున్నాము. ప్రథమ

మాసికాన్ని (ది.4–10–2022) శ్రీరామ జన్మభూమి అయోధ్యా క్షేత్రంలో ఆచరించుకున్నాము. చివరిదైన ఊనాబ్దికాన్ని (ది. 9–9–2023) శ్రీనరసింహ ఆవిర్భావ భూమి అయిన శ్రీ అహోబిల క్షేత్రంలో ఆచరించుకోగలిగాము. ద్వితీయ మాసికం నుండి సింహాచలం, యాదాద్రి, మంగళగిరి, కోరుకొండ, ధర్మపురి, మేల్కోట ఇత్యాదిగా నవ నరసింహ క్షేత్రాలలో ఆచరించుకొని,

నవనారసింహ క్షేత్రం– అహోబిలంలో ఊనాబ్దికంతో ముగించుకున్నాము. మధ్యలో ఓ రెండు మాసికాలను మా మాతాపితరుల జన్మస్థానములలో నిర్వహించుకున్నాము. శ్రీరామ జన్మభూమి అయిన అయోధ్యలో మొదలైన ఈ మాసయజ్ఞాలు శ్రీనరసింహ దివ్యానుగ్రహం రూపంగా శ్రీరాముని అర్చావతార భూమి అయిన శ్రీ భద్రాచల పుణ్యక్షేత్రంలో 2023 అక్టోబర్ 2, 3 తేదీలలో సమాపనం చేసుకోగలుగుతున్నాము. ఇదంతా భగవద్భాగవతాచార్య కృపాబలముచేతనే సాధ్యమైంది.

ఈ తొలి తిరువధ్యయన కార్యక్రమంలో శ్రీ శ్రీ శ్రీ చిన్న జీయర్ స్వామివారి పనుపున అవ్యాజ కృపతో శ్రీ అహోబిల రామానుజ జీయర్ స్వామివారు వేంచేసి నిర్వహింపచేయడం మా అందరి పురావృత సుకృత ఫలం. ఇటువంటి భాగ్య విశేషాన్ని కలిగించిన శ్రీ శ్రీ శ్రీ స్వామివార్ల శ్రీ చరణ కమల సన్నిధిలో సర్వదా, సర్వధా కృతజ్ఞులం.

ఈ కార్యక్రమంలో మరొక విశేషం. వేదాచార్యులైన మా తండ్రిగారికి మిక్కిలి ప్రీతినిధానమైన "శ్రీవిష్ణుసూక్తవ్యాఖ్యానమ్" గ్రంథమును ఆవిష్కరించుకోగలగడం. మాకు ఆ భాగ్యాన్ని కలిగించిన మహనీయులు మా హితైషులు శ్రీ ఉ. వే. ప్ర శ్రీమాన్ ఈయుణ్ణి అళహ శింగరాచార్యస్వామివారు. వారు అనువాద సార్వభౌములుగా, అభినవ పెరియ వాచ్చాన్ పిళ్ళైవారుగా , విద్వల్లోకంలో సుప్రసిద్ధులైన విద్వత్తల్లజులు. ఆ మహనీయులు "శ్రీ వైష్ణవ సింహము"గా ప్రసిద్ధులగు శ్రీకృష్ణస్వామి అయ్యంగార్ ద్రావిడ భాషలో అనుగ్రహించిన శ్రీవిష్ణుసూక్త వ్యాఖ్యానానికి అద్భుతమైన రీతిలో

ఆంధ్రానువాదాన్ని ప్రసాదించారు. ఈ అనువాద వ్యాఖ్యానాన్ని లోకావిష్కృతం గావించే మహాభాగ్యాన్ని మాకు ప్రసాదించారు. వారి కృపకు కృతజ్ఞులమై, వారి శ్రీపాద సన్నిధిలో నమోవాకాలను అర్పిస్తున్నాము. మా మాతృయజ్ఞ సమాపనోత్సవంలో శ్రీ శ్రీ శ్రీ అహోబిల జీయర్ స్వామివారి కరకమలాల ద్వారా ఆవిష్కృతమవుతున్న శ్రీ విష్ణుసూక్త వ్యాఖ్యానం గ్రంథాన్ని మహోపాయనంగా యజ్ఞ ప్రసాదంగా బంధువులందరికీ అందించగలగడం మా సుకృత విశేషంగా భావిస్తున్నాము.

ఈ గ్రంథానికి డిటిపిని చేసి, సహకరించిన శ్రీ వంగల కేశవ అయ్యంగారికి, ముద్రణ విషయంలో ఉపకరించిన శ్రీలక్ష్మణ స్వామి అయ్యంగారికి కృతజ్ఞతాంజలిని ఘటిస్తున్నాము.

ధన్యావయమ్

వేదాద్రిలక్ష్మీనరసింహాచార్యులు

వెంకట రాఘవాచార్యులు

మురళీకృష్ణమాచార్యులు

శ్రీమతే రామానుజాయ నమః

# విజ్ఞాపనమ్

గడచిన శతాబ్దిలో వైదిక ధర్మాన్ని, భగవద్రామానుజ సంప్రదాయాన్ని ఆసేతు హిమాచలం ప్రచారం చేసిన మహనీయులు ఉత్తర భారతంలో, దక్షిణ భారతంలో ఎంతోమంది ఉన్నారు. దక్షిణ భారత ప్రాంతంలో, విశేషించి ద్రావిడ దేశంలో, శ్రీ రామానుజ సిద్ధాంత సంప్రదాయ ప్రచారాన్ని అసాధారణమైన రీతిలో చేసిన మహామహిమోపాధ్యాయ, జగదాచార్యసింహాసనాధిపతి, కాంచీ మహావిద్వాన్, ఉ. వే. శ్రీమాన్ అణ్ణంగరాచార్యస్వామివారు త్రిసంధ్యం స్మరణీయులు. వారికి తరువాత, ఇంచుమించుగా వారితో సమానంగా ప్రచారం చేసిన మహనీయులు "శ్రీవైష్ణవ సింహ" బిరుదాంకితులు, ఉ.వే శ్రీమాన్ ఎస్ కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు. వీరు "శ్రీవైష్ణవ సుదర్శనం" అనే తమిళ మాసపత్రికను 65 సంవత్సరాలకు పైగా నిరంతరంగా నిర్వహించి, ఎన్నో సంస్కృత ద్రావిడ సంప్రదాయగ్రంథాలను, వాటికి ద్రావిడ భాషలో అనువాదాలను ప్రచురించి, శ్రీరామానుజ సిద్ధాంత, సంప్రదాయాలకు సాటి లేని సేవను చేశారు. వారి ఋణం నిజంగా తీర్చుకోలేనిది.

వారు ప్రచురించిన శతాధిక గ్రంథాలలో, "శ్రీవిష్ణుచిత్త విజయమ్" అనే పేరుతో ప్రచురించిన నాలుగు సంపుటాల గ్రంథం అనర్ఘమైనది. వేద వేదాంత స్మృతీతిహాసపురాణాది ఆర్ష వాఙ్మయమంతా శ్రీమన్నారాయణ పరత్వాన్ని నిర్ద్వంద్వంగా, ఏకగ్రీవంగా ప్రతిపాదిస్తున్నాయి అనే సత్యాన్ని సప్రమాణంగా నిరూపించారు. ఆ విధంగా వారు ప్రచురించిన 'శ్రీవిష్ణుచిత్తవిజయమ్' గ్రంథం, రెండవ భాగంలో శ్రీ విష్ణు సూక్తానికి ద్రావిడ భాషలో అందమైన వ్యాఖ్యానాన్ని అందించారు. ఈ విధంగానే, వీరు పురుష సూక్తం, శ్రీ సూక్తం, భూ సూక్తం, నీలా సూక్తాలకుకూడా వ్యాఖ్యానాలను ప్రచురించారు. ఉపనిషత్తులు, స్మృతులు, శ్రీరామాయణం మొదలైనవి అన్నీ కూడా శ్రీమన్నారాయణ పరత్వ ప్రతిపాదకాలే అని తిరుగులేని రీతిలో సప్రమాణంగా నిరూపించి, చూపించారు.

ప్రస్తుతం ప్రకాశింప జేయబడుతున్న "శ్రీవిష్ణుసూక్త వ్యాఖ్యానమ్" వారి ద్రావిడ గ్రంథానికి అనువాద రూపమే. తమ గ్రంథాలను అన్నిటిని ఆంధ్ర భాషలో అనువదించడానికి ఉదారంగా అనుమతిని ఇచ్చిన ఆ మహనీయులకు దాసుడు సవినయంగా కృతజ్ఞతాంజలిని ఘటిస్తున్నాడు.

సుమారు మూడు సంవత్సరాల క్రితం, సహృదయులు, వేద విద్వాంసులు అయిన శ్రీమాన్ గుదిమెళ్ళ మురళీ కృష్ణమాచార్య స్వామివారితో మాట్లాడే సందర్భంలో, శ్రీవిష్ణుసూక్తవ్యాఖ్యానం ఆంధ్రానువాద గ్రంథ ప్రస్తావన వచ్చినప్పుడు, తాము ఆ గ్రంథాన్ని ముద్రిస్తామని వారు అన్నారు. ఆ ముద్రణ, ఇపుడు వారి మాతృమూర్తి అయిన లక్ష్మీనరసమ్మగారి ప్రథమాబ్దిక కైంకర్యాల సందర్భంగా, వారి పవిత్ర చిహ్నికగా ముద్రింపబడడం శ్రీ భద్రాద్రి రామచంద్రస్వామివారి సంకల్పానుగ్రహ విశేషంగా దాసుడు భావిస్తున్నాడు. ఈ సందర్భంగా శ్రీమాన్ మురళీకృష్ణమాచార్య స్వామివారికి, వారి సోదరులకు ఇద్దరికి కృతజ్ఞతాపూర్వకంగా నమస్సుమాంజలులను దాసుడు సమర్పించుకుంటున్నాడు. ఈ గ్రంథం రూపుదిద్దుకోవడంలో అన్ని విధాల సహకరించిన సహృదయులు, నాకంటే వయస్సులో చిన్నవారైనా, పెద్ద మనస్సు కలిగినవారు అయిన శ్రీమాన్ కేశవ అయ్యంగార్ స్వామివారికి, మిత్రులు శ్రీమాన్ లక్ష్మణస్వామివారికి మంగళాశాసన పూర్వకంగా కృతజ్ఞతావిష్కరణను చేసుకుంటున్నాను. గ్రంథాన్ని అందంగా ముద్రణను చేసిన కర్షక్ ప్రింటర్స్ (హైదరాబాద్) వారికి కృతజ్ఞతలు. దాసుని అనువాదంలోని లోటుపాట్లను పెద్దలు మన్నిస్తారని భావిస్తాను. స్వస్తి.

**భాగవత విధేయుడు,**

**ఈ.ఏ. శింగరాచార్యులు**

శ్రీ వేదవేద్యాయనమః

# శ్రీవిష్ణుసూక్త వ్యాఖ్యానమ్

శ్రీభూమినీళాసహితం నత్వా విష్ణుం సనాతనమ్।
వ్యాఖ్యానం విష్ణుసూక్తానాం సురమ్యం కరవాణ్యహమ్॥
(శ్రీభూమినీళాదేవులతో కూడి ఉండేవాడు, సనాతనుడైన విష్ణువును నమస్కరించి, మిక్కిలి అందమైన విష్ణుసూక్తవ్యాఖ్యను రచిస్తాను)
వ్యాఖ్యానం విష్ణుసూక్తానాం ద్రావిడ్యా లిఖితం గిరా|
శ్రీకృష్ణస్వామినాఽఽర్యేణ సవిశేషం మనోహరమ్॥
తదత్ర శింగరార్యేణ దాసేనాంధ్ర్యా మనూద్యతే॥
నిర్మత్సరాణాం విదుషాం తోషాయ గుణవేదినామ్॥

శ్రీ భూమినీళాదేవులద్వారా సంపదను, ఆహారపదార్థాలను, ఆనందాన్ని ఇచ్చి సర్వేశ్వరుడు జీవులను రక్షించే రీతిని శ్రీసూక్తం, భూసూక్తం, నీళాసూక్తం అనే సూక్తాలు వ్యాఖ్యానిస్తున్నాయి. ఇక, సర్వేశ్వరుడు స్వయంగా పలు రీతులలో చేసే రక్షణాలను గూర్చి పలికే విష్ణుసూక్తాలను వివరించడం ద్వారా శ్రీమన్నారాయణుని సర్వరక్షకుడనే అర్థం నిరూపింపబడుతున్నది.

విష్ణోర్నుకం వీర్యాణి అని ఆరంభమయే కొన్ని మంత్రాలు విష్ణుసూక్తమని వ్యవహరింపబడుతున్నవి. అయితే, విష్ణు సూక్తమంత్రాలు ఇంతమాత్రమే కాదు. ఇంకా చాలా మంత్రాలు ఋగ్యజుర్వేదాలలో ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి కొన్ని మాత్రం ఇందులో వివరింపబడుతున్నవి. విష్ణుసూక్తాలు ప్రధానంగా, భగవానుడైన విష్ణువు పలు రీతులలో అవతరించి చేసే అతిమానుషకృత్యాలను తెల్పుతున్నాయి. ముఖ్యంగా, వేదం, భగవానుడు త్రివిక్రముడై అవతరించి, లోకాన్ని అంతటిని తన శ్రీచరణన్యాసంతో కొలిచిన వృత్తాంతాన్ని పల్కి ఆశ్చర్యపడుతున్నది. ఈ విష్ణుసూక్తాలలో– ఈ లోకంలో ఉండే చేతనులను భగవంతుడు అవతరించి రక్షించడం, పరమపదంలో నిత్యముక్తులకు తన అనుభవాన్ని అనుగ్రహించి రక్షించడం –అనే రెండు విధాలైన రక్షణాలు

వివరింపబడుతున్నాయి. అందువల్ల, నారాయణుడే సర్వరక్షకుడని ఈ సూక్తం సుప్రతిష్ఠితం చేస్తున్నది.

ఋగ్వేదం ప్రథమాష్టకం ద్వితీయాధ్యాయం సప్తమవర్గంలో (ప్రథమమండలం- అయిదవ అధ్యాయం- ఇరవై రెండవ సూక్తంలో) పదహారవ మంత్రంనుండి ఇరవై ఒకటవ మంత్రం వరకు విష్ణువు యొక్క గొప్పతనం చెప్పబడింది. అవి ముందు వివరింపబడుతున్నాయి.

1) అతో దేవా అవంతు నో యతో విష్ణుర్విచక్రమే |
పృథివ్యాః సప్త ధామభిః ॥

యతః పృథివ్యాః = ఏ పృథివినుండి, విష్ణుః = విష్ణువు, సప్తధామభిః = ఏడు ఛందస్సులను సాధనంగా గ్రహించి, విచక్రమే కొలిచాడో, అతః = ఆ భూమినుండి, దేవాః = నిత్యసూరులు, నః= మనలను, అవంతు = కాపాడుగాక.

సంసార మండలం నుండి ముక్తిని పొందడానికి నిత్యసూరులను పురుషకారంగా వేదపురుషుడు ఈ మంత్రంలో ఆశ్రయిస్తున్నాడు.

(యతో విష్ణుర్విచక్రమే పృథివ్యాః) - ఏ భూమినుండి పరమపురుషుడైన విష్ణువు పాదన్యాసాలను పెట్టాడో,

(యతః)- ఏ భూమినుండి- అని అర్థం. లేక, ఏ కారణంవల్ల- అని కూడా ఈ సర్వనామానికి అర్థం. తనకు, చేతనులకు మధ్య ఉండే స్వస్వామి భావసంబంధమనే ఏ కారణంచేత, భగవానుడు బిడ్డను దగ్గరకు చేర్చుకొనే తల్లివలె, లోకాన్ని అంతటిని తన శ్రీచరణాలతో స్పృశించాడో-అని భావం.

(సప్త ధామభిః)- ఏడు ఛందస్సులను ఉపకరణంగా గ్రహించి- అని అర్థం. విష్ణుముఖా వై దేవాః ఛందోభిరిమాన్ లోకా ననపజయ్య మభ్యజయత్ (తైత్తి-సంహి-5-21-1) (విష్ణువును నాయకునిగా గల దేవతలు ఛందస్సులను ఉపకరణంగా చేసికొని,

జయించలేని ఈ లోకాలను మహాబలిదగ్గరనుండి జయించారు) అని తైత్తిరీయ సంహితలో కూడా భగవంతుడు మహాబలినుండి దేవతలకు లోకాలను తిరిగి గ్రహించి సంపాదించి ఇవ్వడం కోసం కొలిచినపుడు ఛందస్సులు ఉపకరణమైనవి–అని చెప్పబడింది. వేదాన్ని అధ్యయనం చేసే బ్రహ్మచారియై, మహాబలి దగ్గరకు వెళ్ళి, అతనిని వంచించి, లోకాలను జయించినందున ఛందస్సులను ఉపకరణాలుగా చేసికొని జయించాడని చెప్పబడింది. ఇతని నోటినుండి వెలువడే ఛందస్సులను చూచి మోహించి కదా, మహాబలి నీకు మూడడుగులు ఇస్తున్నాను అని అన్నాడు.

లేక, ధామ అనే పదానికి స్థానమనే అర్థాన్ని గ్రహించినా, అథోలోకాలు ఏడింటితో కూడిన భూమిలో నుండి ఆరంభించి, పై లోకాలను కొలిచాడు– అని కూడా చెప్పవచ్చు. సప్త ధామభి స్సహితాయాః పృథివ్యాః విచక్రమే అని అన్వయం.

ఒణ్మిదియిఱ్పునలురువి ఒరుకాల్ నిఱ్ప,
ఒరు కాలుమ్ కామరుశీరవుణనుళ్ళత్తు,
ఎణ్మదియుమ్ కడన్దణ్డమీదు పోకి,
ఇరువిశుమ్బి నూడుపోయ్ ఎழுన్దు, మేలే
త్తణ్ మదియుమ్ కదిరవనుమ్ తవిరవోడి
తారకైయిన్ పుఱన్దడవి అప్పాల్ మిక్కు,
మణ్ ముழுదు మకప్పడుత్తు నిన్దఎన్దై
మలర్ పురైయుమ్ తిరువడి ఎన్ తలైమేలవే (తిరు నెడుందాండగమ్–5)

(అందంగా చాచిన ఒక పాదంపైన గంగాజలం ప్రవహించగా, ఇంకొక పాదం ఆశించదగిన సంపదను కలిగిన బలి మనసులోని ఆలోచనను కూడా దాటిపోయి, అండం పైకి చేరి వ్యాపించి, విశాలమైన ఆకాశంలో మధ్యగా వెళ్లి పెరిగి, పైనున్న చల్లని చంద్రుని, సూర్యుని దాటి వెళ్లి, నక్షత్రముల పైన స్పృశించి, ఆ పైన పైన ఉండే లోకాలను అన్నిటిని వ్యాపించిన నా స్వామి అయిన త్రివిక్రముని పూలవంటి పాదాలను నమస్కరించాను)

అని భూమిపై నిలచి ఉండి, ఒక పాదంతో భూమితో కూడిన అథోలోకాలను, ఇంకొక పాదంతో పైలోకాలను త్రివిక్రముడు కొలిచాడు కదా.

(అతో దేవా అవంతు నః)- ఏ భూప్రదేశంలోనుండి పరమ పురుషుడు లోకాలను కొలిచాడో, ఆ భూ ప్రదేశంనుండి మనలను దేవతలు రక్షించాలి— అని అర్థం. భూ ప్రదేశంనుండి రక్షించడం అంటే— –దానినుండి విడివడి, ఇతడు మోక్షాన్ని పొందేటట్లు పురుషకారం చేయడం. రాబోయే మంత్రాలలో పఠింపబడే నిత్యసూరులు ఇక్కడ దేవతలనబడుతున్నారు. భూప్రదేశంనుండి రక్షణమంటే- భూలోకంలో ఉండేవారి పాపాన్ని పోగొట్టడం అని సాయణభాష్యం.

(అతో దేవా అవంతు నః)- ఏ సంబంధాన్ని చూచి భగవంతుడు లోకాలను కొలిచాడో, ఆ సంబంధాన్నే చూచి, నిత్యసూరులు కూడా మమ్ములను కాపాడాలి- అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు. ఈ విధంగా ఈ మంత్రం ద్వారా నిత్యసూరులను పురుషకారంగా వరించడం జరిగింది.

2. ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్,
సమూఢ మస్య పాంసురే ॥

విష్ణుః= త్రివిక్రముడు, ఇదమ్ = (కనబడే ఈ) లోకం అంతటిలో, విశేషంగా, విచక్రమే = పాదన్యాసాలను పెట్టాడు. (అపుడు), త్రేధా = మూడు విధాలుగా, పదం = శ్రీచరణాన్ని, నిదధే = పెట్టాడు, అస్య = ఈ భగవంతుని, పాంసురే = ధూళితో కూడిన పాదస్థానంలో, సమూఢం – (లోకం అంతా) చక్కగా ఆవరింపబడింది.

భగవంతుని శ్రీచరణం కింద లోకం అంతా అంతర్భవించిన గొప్పతనాన్ని ఈ మంత్రం తెల్పుతున్నది.

(ఇదం విష్ణుర్విచక్రమే)- కనబడే అన్ని లోకాలను విష్ణువు విశేషంగా కొలిచాడు. (విక్రమించాడు)

(విచక్రమే)– విశేషంగా పాదాన్ని పెట్టాడు– అని అర్థం. స్వామి కనుక, ఆ సంబంధంతో కొలిచాడు. నిద్రించే శిశువును తానుగా ప్రేమతో కౌగలించుకొనే తల్లివలె, వారు కోరకపోయినప్పటికీ, సొత్తుదారుడు సొత్తును విడువలేని అపేక్షతో, అడిచ్చియోమ్ తలైమిశై నీ యణియాయ్ (దాసురాంద్రమైన మా శిరస్సులపై నీ పాదాలను అలంకారంగా అలంకరించు) అని దాసులు ఆశపడే శ్రీచరణాలను ప్రేమతో పెట్టాడు–అని కూడా భావం.

(విష్ణుర్విచక్రమే)– సర్వస్వామి కనుక, ఇతడు జగత్తును అంతటిని కొలువడంలో ఆశ్చర్యం లేదు– అని భావం.

(ఇదం విచక్రమే) – సొత్తును సొత్తుదారుడు కొలిచాడు. ఏ విధంగా కొలిచాడు? అంటే,

(త్రేధా నిదధే పదమ్)– మూడు విధాలుగా తన శ్రీచరణాలను పెట్టడం ద్వారా కొలిచాడు.

(అస్య పాంసురే ఇదమ్ సమూఢమ్) – ఇతని పాదధూళితో కూడిన పాదస్థానంలో ఈ లోకం అంతా చక్కగా అణగి ఉన్నది. మొదటి భాగంలో ఉండే ఇదమ్ అనే పదాన్ని ఇక్కడ అధ్యాహరించుకోవాలి.

(అస్య పాంసురే ఇదమ్ సమూఢమ్) – అతని పాదధూళి పడని చోటు అనేది లేదు. దైవాలుగా కీర్తింపబడే బ్రహ్మ,రుద్రుడు మొదలైనవారు కూడా అతని శ్రీచరణాల కింద అంతర్భవించినవారే –అని భావం.

3) త్రీణి పదా విచక్రమే విష్ణుర్గోపా అదాభ్యః
అతో ధర్మాణి ధారయన్ ||

గోపాః = సర్వరక్షకుడు, అదాభ్యః = ఎవరికి హింసించడానికి సాధ్యం కానివాడైన, విష్ణుః = విష్ణువు, త్రీణి = మూడు, పదా = పాదాలను, విచక్రమే =

విశేషంగా పెట్టాడు, అతః = ఆ విధంగా చేసినందున, ధర్మాణి = ధర్మాలను, ధారయన్ = పోషిస్తూ (పాదాలను పెట్టాడు)

వ్యాఖ్య : లోకాలను కొలిచిన ఈ వృత్తాంతంతో ఇతడే సంరక్షకుడు– అని ఈ మంత్రంలో నిర్ణయింపబడుతున్నది.

(త్రీణి పదా విచక్రమే)– మూడు శ్రీచరణాలను విశేషంగా పెట్టాడు, ఆ విధంగా పెట్టినవాడెవడు? అంటే,

(విష్ణుః)– సర్వవ్యాపి అయినవాడే పెట్టాడు. వ్యాపించి రక్షించడంతో తృప్తి చెందకుండా, సాక్షాత్తుగా ఆవిర్భవించి, శ్రీచరణాలతో స్పృశిస్తూ రక్షించాడు. ఇటువంటి అతిమానుషవ్యాపారాన్ని చేయడానికి ఏమి కారణం? అంటే,

(గోపా:) – సర్వరక్షకుడైనందున చేశాడని భావం. గోపాః– సర్వస్య జగతః రక్షకః (గోపాః– అంటే– సమస్తజగత్తుకు రక్షకుడని అర్థం) అని సాయణభాష్యం. ఇతడీ లీలను చేసేటపుడు మహాబలిష్ఠులైన మహాబలి, నముచి మొదలైవారు అడ్డగిస్తే ఏంచేయాలి? అంటే,

(అదాభ్యః)– ఎవరికీ హింసించడానికి – అడ్డుపెట్టడానికి సాధ్యం కానివాడు – అని అర్థం. తనను అడ్డగించిన నముచిని ఆకాశంలోకి విసరివేశాడు కదా! దీనిని మన్ను నముచియై వానిల్ శుழற்றிய (నముచిని ఆకాశంలోకి తిప్పి విసరిన) అని పెరియాళ్వారులు ఈ వృత్తాంతాన్ని తెలిపారు. ఈ విధంగా లోకాలను కొలువడం ఎందుకోసం? అంటే,

(అతో ధర్మాణి ధారయన్)– ఈ విధంగా చేయడం ద్వారా ధర్మాలను సుస్థాపిస్తూ, కొలిచాడు. ఇంద్రుడు మొదలైనవారి నివాసాలను అపహరించడం ద్వారా ధర్మానికి విరుద్ధంగా మహాబలి వర్తించాడు, లోకాలను కొలిచి, వాటిని తిరిగి ఇవ్వడం వల్ల స్వామి ధర్మాన్ని సుస్థాపించాడు. తరువాత వారికి కూడా ధర్మానికి విరుద్ధంగా వర్తించరాదని ఈ లీలద్వారా తెలుపుతూ ధర్మాన్ని సుస్థాపించాడు. పరిత్రాణాయ

సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే (మంచివారిని రక్షించడంకోసం, దుష్టులను శిక్షించడం కోసం, ధర్మాన్ని చక్కగా నిలబెట్టడం కోసం ప్రతియుగంలో అవతరిస్తాను) అని తానే ధర్మసంస్థాపనాన్ని అవతారప్రయోజనంగా పలికాడుకదా!

4. **విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే |**
**ఇంద్రస్య యుజ్యః సఖా ||**

యతః = ఏ కార్యం ద్వారా, వ్రతాని = అగ్నిహోత్రాది కర్మలను, పస్పశే = యజమానుడు అనుష్ఠిస్తున్నాడో, విష్ణోః = విష్ణువుయొక్క, కర్మాణి = ఆ కార్యాలను, పశ్యత = చూడండి, ఇంద్రస్య = ఇంద్రుని , యుజ్యః అనుకూలుడైన, సఖా = స్నేహితుడితడు.

వ్యాఖ్య : విష్ణువుయొక్క లీలలను చూడండి! అని లోకంలోనివారిని వేదపురుషుడు ఆహ్వానిస్తున్నాడు, ఈ మంత్రంలో.

(**విష్ణోః కర్మాణి పశ్యత**) – విష్ణువుయొక్క లీలలను దర్శించండి.

(**కర్మాణి**) – అతిమానుషవ్యాపారాలు– అని అర్థం. జన్మ కర్మ చ మే దివ్యమ్ (నా జన్మలు, కర్మలు దివ్యమువైనవి) అని అతనిచేతనే పొగడబడిన వ్యాపారాలు–అని భావం.

(**పశ్యత**) – కన్నులున్నందున ప్రయోజనాన్ని పొందాలని యత్నించండి.

**అద్య మే సఫలం జన్మ సుప్రభాతా చ మే నిశా|**
**యదున్నిద్రాబ్జపత్రాక్షం విష్ణోర్ద్రక్ష్యామ్యహం ముఖమ్||**
(ఈ నాడే నా జన్మ సఫలమైనది. నా రాత్రి తెల్లవారింది. వికసించిన తామరపూవుల వంటి నేత్రాలను కల భగవంతుని ముఖాన్ని ఈ నాడు దర్శించబోతున్నాను) అని

అక్రూరుడన్నాడు కదా! పశ్యత కర్మాణి (కర్మలను చూడండి)అని అనడం జన్మాదులను కూడా తెల్పుతుంది.

**కాణాదార్ కణ్ణెన్రుమ్ కణ్ణల్ల కణ్డోమే**
(భగవంతుని దర్శించనివారి కన్నులు ఏనాడూ కళ్ళు కాదని గమనించాము) (పెరియ తిరు-11-7-1) అని,

**బర్హాయితే తే నయనే నరాణాం విష్ణోర్నలింగాని నిరీక్షతోయే** (భాగవతమ్-2-3-2)

(విష్ణువుయొక్క చిహ్నాలను ఎవరి కన్నులు దర్శించడం లేదో, ఆ కళ్ళు నెమలికళ్ళువంటివే) అని నేత్రాలకు అవద్యం కల్గకుండా ఉండడంకోసమైనా, లోకాలను కొలువడం మొదలైన భగవంతుని లీలలను దర్శించండి.

(యతో వ్రతాని పస్పశే) -ఏ లీలను దర్శించినందున వైదికుడు అగ్నిహోత్రాది వ్రతాలను అనుష్ఠిస్తున్నాడో -అని అర్థం. అతో ధర్మాణి ధారయన్ అని గడచిన మంత్రంలోని భాగం ఈ విధంగా వివరింపబడింది.

భగవంతుని జన్మ కర్మలను చూడగానే, దుష్టనిగ్రహాన్ని, శిష్టపరిపాలనాన్ని, ధర్మసంస్థాపనను చేయడానికి వచ్చిన ఇతడు భగవంతుడే- అనే నమ్మిక ఏర్పడుతున్నందున, భగవంతునకు ఆరాధనమైన యజ్ఞం మొదలైనవానిని మానవుడు అనుష్ఠిస్తున్నాడు- అని భావం. ఈ విష్ణువు లోకాలను కొలువడం మొదలైన అతిమానుషవ్యాపారాలను చేయడానికి ఏమి కారణం? అంటే,

(ఇంద్రస్య యుజ్యః సఖా)- ఇంద్రునకు అనుకూలుడైన స్నేహితుడై ఉన్నాడు- అని భావం. ఇంద్రునకు అనుజుడుగా- అందువల్లనే, స్నేహితునిగా ఉన్నందున, ఈ అద్భుతకృత్యాలను అతనికోసం చేశాడని భావం.

5. తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః |
దివీవ చక్షురాతతమ్ ||

దివి = ఆకాశంలో, ఆతతమ్ = అంతటా వ్యాపించి ఉండే, చక్షుః ఇవ = లోకచక్షుస్సు అయిన సూర్యుని వలె ఉండే, విష్ణోః = విష్ణువు యొక్క , తత్ పరమం పదమ్ = ఆ పరమపదాన్ని, సూరయః = నిత్యసూరులు, సదా పశ్యంతి = ఎల్లప్పుడు దర్శిస్తున్నారు.

పూర్వమంత్రాలలో భగవంతుడు ఈ లోకంలో ఉండేవారిని అవతారాలను ఎత్తి రక్షించడం తెలుపబడింది. ఇక, రెండు మంత్రాలలో పరమపదంలో ఉండేవారికి తన అనుభవాన్ని ఇచ్చి రక్షించడం తెలుపబడుతున్నది.

**దివీవ చక్షు రాతతం వితతం యన్మహాత్మనామ్,**
**వివేకజ్ఞానదృష్టం చ తద్విష్ణోః పరమం పదమ్** (విష్ణు.పు– 2–8–103)

(ఆకాశంలో ఉండే లోకనేత్రమైన సూర్యునివలె చాలా వ్యాపించి ఉండేది, మహాత్ములచే వివేకజ్ఞానంతో దర్శింపబడేది, విష్ణువుయొక్క ఆ పరమపదం) అనే శ్లోకంలో శ్రీపరాశరభగవానుడు ఈ మంత్రాన్ని వివరించారు.

(**తద్విష్ణోః పరమం పదమ్**) – విష్ణువుయొక్క ఆ పరమపదాన్ని,

(**తత్**)– ప్రమాణాలలో సుప్రసిద్ధమైన– అని భావం.

(**పరమం పదమ్**)– గొప్ప స్థానాన్ని,

(**పరమమ్**)– పరో మా యస్మాత్ స పరమః– (దేనికంటే మించినది ఇంకొటి లేదో, అది పరమమనబడుతున్నది) అనే వ్యుత్పత్తివల్ల బ్రహ్మరుద్రేంద్రాదుల స్థానాల కంటే ఉన్నతమైనదని తెలుపబడుతున్నది.

**యన్న దేవా న మునయః న చాహం న చ శంకరః,**
**జానంతి పరమేశస్య తద్విష్ణోః పరమం పదమ్** (విష్ణుపురాణమ్)–

(దేనిని గూర్చి దేవతలు, మునులు, బ్రహ్మ అయిన నేను, శంకరుడు తెలియలేమో, అదే విష్ణువుయొక్క పరమపదం) అని బ్రహ్మవచనం.

(సదా పశ్యంతి సూరయః)– నిత్యసూరులు ఆ పరమపదాన్ని ఎల్లప్పుడు దర్శిస్తున్నారు. సదా పశ్యంతి (ఎల్లప్పుడు దర్శిస్తున్నారు) అని ఉన్నందున, కర్మసంబంధం లేనివారై, సదా భగవదనుభవం పొందేవారు కొందఱు ఉన్నారని, వారే ఇక్కడ సూరులు అని చెప్పబడ్డారని తెలుస్తున్నది. ఆ పరమపదం ఎటువంటిది? అంటే,

(దివీవ చక్షురాతతమ్) – ఆకాశంలో ఉండే, లోకచక్షుస్సు అయిన ఆ సూర్యునివలె మిక్కిలి వ్యాపించి ఉన్నది. సూర్యుడు ఏ విధంగా తన తేజస్సుతో మిక్కిలిగా వ్యాపించి ఉన్నాడో, ఆ రీతిలోనే ఈ పరమపదం మిక్కిలి వ్యాపించి ఉన్నది.

అత్యర్కానలదీప్తం తత్ స్థానం విష్ణోర్మహాత్మనః,
స్వయైవ ప్రభయా రాజన్ దుష్ప్రక్ష్యం దేవదానవైః (భారతమ్) –

(రాజా! మహాత్ముడైన విష్ణువుయొక్క ఆ స్థానం సూర్యుడు, అగ్నిమొదలైన వారికంటే చాలా గొప్ప కాంతిని కల్గినది) అని చెప్పబడ్డ ఈ పరమపదానికి సూర్యుడు సరి అయిన ఉపమానం కాకపోయినా, లోకంలో కన్పించే జ్యోతిస్సులలో అతడే మిక్కిలి జ్యోతిస్సును కలవాడై ఉన్నందున ఉపమానంగా చెప్పబడుతున్నాడు. ఈ అర్థాన్ని పూర్వం ప్రస్తావించిన.

దివీన చక్షురాతతం వితతం యన్మహాత్మనామ్,
వివేక జ్ఞానదృష్టం చ తద్విష్ణోః పరమం పదమ్

(విష్ణువుయొక్క ఆ పరమపదంఆకాశంలోని, లోకానికి నేత్రమైన సూర్యుని వలె మిక్కిలి వ్యాపించి ఉన్నది, మహాత్ములచే వివేకంతో దర్శింపబడుతున్నది) అనే విష్ణుపురాణ శ్లోకంలో(2–8–108) ఎజ్గళాళ్వా (విష్ణుచిత్తార్యులు)ఆదరించారు.

(దివీవ చక్షురాతతం సదా పశ్యంతి సూరయః) - ఆకాశంలో నేత్రం ఏ అంతరాయం లేకుండా చూచేటట్లే, విద్వాంసులు పరమపదాన్ని ఎల్లప్పుడు దర్శిస్తున్నారు అని సాయణభాష్యం. ఈ అర్థంలో సదా పశ్యంతి అనే దానికి ముఖ్యార్థం సిద్ధించదు.

6) తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే |
విష్ణోర్యత్ పరమం పదమ్ ||

విష్ణోః= విష్ణువుయొక్క, యత్ = ఏ, పరమపదం = పరమపదం ఉన్నదో, తత్= ఆ పరమపదాన్ని, విప్రాసః= మేధావులు, విపన్యవః= విశేషంగా స్తుతించేవారు, జాగృవాంసః= మిక్కిలి జాగ్రతతో కూడినవారైన ముక్తులు, సమింధతే = ప్రకాశిస్తున్నారు.

నిత్యసూరులు పరమపదంలో సదా అనుభవాన్ని పొందడం గత మంత్రంలో తెలుపబడింది. ముక్తులు అక్కడ భగవానునకు మంగళాశాసనం చేస్తూ ఉండడం ఈ మంత్రంలో ఉద్ఘోషింపబడుతున్నది.

పల్లాణ్డెన్ఱు పవిత్తిరనై ప్పరమేట్టియై శార్ ఙ్గమెన్నుమ్
విల్లాణ్డానన్నై విల్లిపుత్తూర్ విట్టుశిత్తన్ విరుమ్బియ శొల్,
నల్లాణ్డెన్ఱు నవిన్ఱురైప్పార్ నమో నారాయణాయ వెన్ఱు,
పల్లా పరమాత్మనై చ్చూళ్ంన్దిరున్దేత్తువర్ పల్లాణ్డే

(పవిత్రుడు, పరమపదంలో ఉండేవాడు, శార్ ఙ్గమనే వింటిని పాలించేవాడు అయిన పరమాత్మను శ్రీవిల్లిపుత్తూర్ లోని విష్ణుచిత్తులు ఆశపడి పాడిన మంగళాశాసనాన్ని ఆదరించి అనుసంధించేవారు పరమపదంలో పరమాత్మకు ప్రదక్షిణం చేస్తూ మంగళం పాడగలరు) అని పెరియాళ్వార్లు ఈ మంత్రార్థాన్ని వివరించారు.

(విష్ణోర్యత్ పరమం పదమ్) – విష్ణువుయొక్క సకల వేదప్రసిద్ధమైన ఏ పరమపదం ఉన్నదో,

(తత్) – ఆ పరమపదాన్ని,

(విప్రాసః) – మేధావులు– అని అర్థం. ప్రా–పూరణే అనే ధాతువునుండి పుట్టిన ఈ పదానికి విశేషంగా పూరణం చేసేవారు అని అర్థం చెప్పవచ్చు. భగవానుని ఆనందాన్ని విశేషంగా పూరణం చేసేవారని– తాత్పర్యం. చేతనలాభం భగవంతునకు ఆనందహేతువనే శాస్త్రార్థం ఇక్కడ తెలుపబడింది. నిత్యసూరులతో నిత్యానుభవం కల్గుతున్నా, అచిత్తుతో సమానంగా సంసారంలో పడి ఉండే జీవులను చూచి, భుజించిన ఆహారం ఒంటబట్టని రీతిలో సుఖంగా ఉండలేక, స ఏకాకీ న రమతే (ఆ భగవంతుడు, సంసారులను చూచి, ఒంటరివానివలె, ఆనందించడం లేదు)అని ఆనందం పొందనివాడవుతున్నాడు కదా! అందువల్ల ముక్తులు విప్రాసః అని అనబడ్డారు.

(విపస్యవః) – పను–స్తుతౌ అనే ధాతువునుండి పుట్టిన ఈ పదానికి విశేషంగా స్తుతించేవారని అర్థం. విశేషంగా స్తుతించడం అంటే – ప్రేమాతిశయంచేత పల్లాండు పాడి స్తుతించడం. ఏత్తువర్ పల్లాణ్డే (పల్లాండు పాడుతారు) అని అంటూ ఈ పదాన్ని పెరియాళ్వార్లు వివరించారు. భ్రమవిప్రలంభాది రహితమైన జ్ఞానాన్ని కలవారైనందున ప్రేమాధిక్యంతో అచ్యుతుని అందాన్ని చూచి, పారవశ్యం పొంది, జ్ఞానంలో కలతను పొంది, ఈ అందం ఏ నాటికీ మాఱకుండా ఉండాలి అని, మంగళాశాసనం చేస్తారు కదా, నిత్యసూరులు.

(జాగృవాంసః)– ప్రేమాధిక్యంచేత అస్థానే భయశంక కల్గి, మిక్కిలి జాగరూకతతో ఉండేవారు– అని భావం. ఆజ్గారవార మదుకేట్టు అழలుమిழుమ్ పూజారరవు (నాన్ముకన్ తిరు–10) (అక్కడ పరమపదంలో నిత్యసూరులు చేసే ఆ మంగళాశాసన సంరంభాన్ని విని ఆదిశేషుడు అస్థానే భయశంకతో విషాన్ని

చిమ్ముతాడు) అని పరమపదంలో నిత్యముక్తులు సామగానాన్ని చేసే ధ్వనిని విని, అసురులు హాహాకారాలను చేస్తున్నారు,- అని అస్థానే భయ శంకను పొంది, నోటి నుండి నిప్పును ఆదిశేషుడు వెలువరిస్తున్నాడు– అని అన్నారుకదా, తిరుమళిశై యాళ్వార్లు.

ఉఱకల్! ఉఱకల్! ఉఱకల్! ఒణ్ శుడరాళియే! శజ్గే!
అఱవెఱి నాన్దక వాళే! అళకియ శార్జ మే! తణ్డే!
ఇఱువు పడామలిరున్ద ఎణ్మరులోకపాలీరా !
పఱవై యఱైయా! ఉఱకల్ పళ్ళియఱై కుఱిక్కొణ్మిన్

(పెరియాళ్వార్ తిరు-2-9) అని పెరియాళ్వార్లు కూడా శంఖచక్రాది నిత్యసూరులను నిద్రపోకుండా ఉండండి అని వేడారుకదా! ఈ అరుదైన మహార్థాన్నే జాగృవాంసః (జాగరూకతతో ఉండేవారు) అని వేదం తెల్పింది.

(సమింధతే) – ఆ పరమపదాన్ని చాలా ప్రకాశించేటట్లు చేస్తారు.

తీయిఱ్పొలికిన్ఱ శెఞ్జుడరాళి తికళుం తిరుచ్చక్కరమ్ (తేజస్సును కలిగిన పదార్థాలైన సూర్యుడు, అగ్ని మొదలైనవారి తేజస్సు కంటే మిక్కిలిగా ప్రకాశించే, ఎర్రని కాంతిని కల్గిన, గుండ్రని ఆకారాన్ని గల ప్రకాశించే శ్రీ సుదర్శనం) అని, వడివార్ శోది వలత్తుఱైయుమ్ శుడరాళి (భగవానుని దివ్య మంగళ రూపాన్ని ప్రకాశింప చేసే తేజస్సును కలిగిన, కుడివైపు వేంచేసి ఉండే ప్రకాశించే సుదర్శనం) అనేవిధంగా జ్యోతిస్సులన్నిటిలోను మిక్కిలి జ్యోతిస్సును కల భగవంతుని దివ్యమంగళవిగ్రహానికి ప్రకాశాన్ని పొందించే వీరు పరమపదాన్ని మిక్కిలిగా ప్రకాశింపజేస్తున్నారు– అని అనడం అతిశయోక్తి కాదుకదా! సమింధతే– సమ్యక్ దీపయంతి అని సాయణభాష్యం.

(తత్ సమింధతే) –ఆ పరమపదాన్ని గొప్పగా ప్రకాశింపజేస్తున్నారు అనే అర్థం పూర్వం తెలుపబడింది. ఆ పరమపదంలో చాలా ప్రకాశిస్తున్నారు– అనే అర్థాన్ని కూడా దీనికి చెప్పవచ్చు.

ఈ విధంగా ఈ రెండు మంత్రాలద్వారా పరమపదంలో పరమపురుషుడు నిత్యులకు, ముక్తులకు తన అనుభవాన్ని అనుగ్రహించి, రక్షించే రీతిని వేదం తెల్పింది.

ఇక, ఋగ్వేదం –ద్వితీయాష్టకం– ద్వితీయధ్యాయం– ఇరవై నాల్గవ వర్గంనుండి (ప్రథమమండలం– ఇరవై ఒకటవ అధ్యాయం– 154వ మంత్రంనుండి) ఉండే మంత్రాలు వివరింపబడుతున్నాయి.

1. **విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాంసి**
**యో అస్కభాయదుత్తరం సధస్థం విచక్రమాణ స్త్రేధోరుగాయః॥**

(ఓ మానవులారా! )– విష్ణోః = సర్వవ్యాపియైన పరమపురుషుని యొక్క, వీర్యాణి = వీరచరిత్రలను, నుకమ్ = మిక్కిలి సంగ్రహంగా, ప్రవోచమ్ = పల్కుతాను. (ఆ వీరచరిత్రలు ఏవి? అంటే), యః= ఏ విష్ణువు, పార్థివాని = పృథివికి సంబంధించినదానికి కింద ఉండే), రజాంసి = ఏడు లోకాలను, విమమే = సృష్టించాడో, యః = ఏ విష్ణువు, సధస్థం = పుణ్యాత్ములుండే చోటైన, ఉత్తరం = పై (ఏడు) లోకాలను, అస్కభాయత్ = సృష్టించాడో, ఉరుగాయః= మిక్కిలి కీర్తింపబడే పరమపురుషుడు, త్రేధా = మూడు విధాలుగా, విచక్రమాణః= ఈ లోకాలను కొలిచాడు (విక్రమించాడు).

వ్యాఖ్య : సర్వరక్షకుడైన విష్ణువు లోకరక్షణ కోసం చేసే వీరచరిత్రలను కొన్నింటిని ఈ మంత్రం తెల్పుతున్నది.

(విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచమ్) – సర్వవ్యాపి అయిన విష్ణువు వీర చరిత్రలను సంగ్రహంగా పల్కుతున్నాను.

(విష్ణోః) – సర్వవ్యాపి అయినందున ఇతడు వీరకృత్యాలు చేయడం ఆశ్చర్యకరం కాదు.

(నుకమ్) - మిక్కిలి సంగ్రహంగా– అని భావం. సావధానంగా ఉన్నవానిని అన్నిటిని పల్కడం సాధ్యం కాదు. కనుక, సంగ్రహించి పల్కుతున్నాము.

(వీర్యాణి) - ఒక్కొక్క వీరకృత్యం యొక్క మహిమ అంతు లేదు– అనేది మాత్రమే కాదు, ఈ కృత్యాలకు కూడా సంఖ్యలో అంతు లేదు.

(ప్రవోచమ్)– పల్కుతున్నాను.

(నుకమ్ ప్రవోచమ్)– అన్నిటిని పల్కడం వీలు కాదు. కొన్నిటిని చటుక్కున పల్కుతాను.

ఇకపై కొన్ని చరిత్రలు తెలుపబడుతున్నాయి.

(యః పార్థివాని విమమే రజాంసి) - ఆ భగవంతుడు భూమితో చేరిన అధోలోకాలు ఏడింటిని పలు విధాలుగా సృష్టించాడు.

(పార్థివాని)– భూమితో సంబంధించినవానిని– అని అర్థం. భగవంతుడు లోకాలను కొలిచినపుడు భూమిపై నిలిపిన శ్రీచరణంతో అధోలోకాలను ఏడింటిని కొలిచాడు కదా! ఆ శ్రీచరణసంబంధాన్ని పొందిన లోకాలు, పృథివీ సంబంధాన్ని కల్గిన లోకాలు (పార్థివాని) అని పార్థివాని రజాంసి అనే ప్రయోగం ద్వారా చెప్పబడుతున్నాయి.

(రజాంసి) - లోకాలు లోకా రజాంస్యుచ్యంతే అని యాస్క మహర్షి నిర్వచించాడు. (లోకాలు రజాంసి అని చెప్పబడుతున్నాయి– అని దీని భావం)

(విమమే)– పలు విధాలుగా సృష్టించాడు. చేతనులను పాపఫలాలను అనుభవింపజేసి, సంస్కరించి, రక్షించడంకోసం అధోలోకాలను పలు పలు విధాలుగా భగవంతుడు సృష్టించాడు.

(యో అస్కభా యదుత్తరం సధస్థమ్) – పుణ్యాత్ములు కూడి ఉండే చోటైన భూమితో పాటు ఉండే ఊర్ధ్వలోకాలను అన్నింటిని సృష్టించాడు. చేతనుల పుణ్యపాపాలను తీర్చి, వారికి మోక్షాన్ని కల్గించడంకోసం పై లోకాలను సృష్టించాడు.

(సధస్థమ్)– సహస్థానం– అని అర్థం. పుణ్యాత్ములు కూడి ఉండే చోటు. (ఉత్తరమ్)– పైన ఉండేవి.

(అస్కభాయత్) – స్థిరంగా నిలిపాడు. సృష్టించాడు– అని భావం. పార్థివాని విమమే రజాంసి అని భూమితో చేరిన మూడు లోకాలను, యో అస్కభా యదుత్తరం సధస్థంమ్ అనేదానికి –మిక్కిలి విస్తృతమైనది, ముల్లోకాలకు స్థానమైన అంతరిక్షాన్ని కూడా సృష్టించాడు– అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు. ఈ విధంగా సృష్టించిన తరువాత సృష్టింపబడిన లోకాలను దుష్టులు ఆక్రమిస్తే, వ్యర్థమై పోతుంది కదా! అంటే, (విచక్రమాణ స్త్రేథోరుగాయః)– అపుడు మూడు విధాలుగా విక్రమించి కొలిచి, స్వామి తన సొత్తును రక్షించుకొన్నాడు– అని భావం.

(ఉరుగాయః)– ఈ విధంగా అన్ని రీతులలో రక్షించినందున మహాత్ములచే గొప్పగా స్తుతింపబడ్డాడు.

(విచక్రమాణః ఉరుగాయః) లోకాలను కొలిచినపుడు, జాంబవంతుడు మొదలైనవారిచేత, ఇంకా పలువురిచేత స్తుతింపబడ్డాడు.

(ఉరుగాయః) – పెద్దలచే స్తుతింపబడ్డాడు. గొప్పగా స్తుతింపబడ్డాడు– అని అర్థం.

మఱ్ఱై కొణ్డ మన్దిరత్తాల్ వాழ்త్తి (అన్ని వేదాలలో అంతర్గతమైన పురుషసూక్తంతో మంగళాశాసనం చేసి) అని,

సంస్తైః స్సురాణాం భూతలస్తైః తదా మరుద్భిః గగనే చ ఖేచరైః, |
స్తుతః క్రమాన్ యః ప్రచకాశ సర్వదా మమాస్తు మాంగల్యవివృద్ధయే హరిః ||
(విష్ణుధర్మమ్)

(దేవలోకంలో దేవతాసంఘాలచేత, ఈ భూమిపై ఉండేవారిచేత, ఆకాశంలోని మరుత్తులనే దేవతలచేత, ఆకాశ సంచారుల లగుచారణానుల చేత స్తుతింపబడినవాడైన, ఏ స్వామి తన శ్రీచరణాలను పెట్టాడో, ఆ భగవానుడు నాకు మంగళాన్ని వృద్ధిచేయాలి) అనే బ్రహ్మాదిగా పలువురిచే త్రివిక్రముడు స్తుతింపబడ్డాడు కదా!

వేఱొక రీతిలో కూడా దీనికి అర్థాన్ని చెప్పవచ్చు.

(యః పార్థివాని విమమే రజాంసి) – భగవానుడు భూమి మొదలైన లోకాలను కర్మఫలానుభవంకోసం సృష్టించాడు.

(యో అస్కభాయదుత్తరం సధస్థమ్)– ఆ కర్మము తీరిపోగానే, తనను పొంది ఉజ్జీవించడం కోసం, వీటి అన్నిటికంటే గొప్పది, నిత్యులు, ముక్తులు కూడి ఉండేది. అయిన పరమపదాన్ని నిలిపాడు– అని అర్థం.

(ఉత్తరమ్) అన్నిటికంటే గొప్పది. అప్రాకృతమైనది అయినందున, పునరావృత్తి లేనందున పరమపదం గొప్పది. అపునరావృత్తే స్తస్య ఉత్కృష్టత్వమ్ (పునరావృత్తి లేనందున ఆలోకం గొప్పది) అని సాయణభాష్యం.

(సధస్థమ్)– అడియార్కళ్ కుழாజ్గళై ఉడన్ కూడువదు ఎన్నుకొలో! (తిరువాయ్) (భగవద్భక్తుల సంఘాలతో కలసి ఉండడం ఎపుడో కదా! ) అనేవిధంగా సదాదర్శనం చేసే నిత్యసూరులు, గుంపులుగా చేరి ప్రదక్షిణం చేసి స్తుతించే, ముక్తులు కలసి స్తుతించే కూడి ఉండే చోటు.

(అస్కభాయత్)– దృఢంగా స్థిరంగా నిలిపాడు. నాశం లేని రీతిలో చేశాడు. ఆద్యంతాలు లేని రీతిలో చేశాడు– అని భావం.

ఈ మంత్రానికి కొంత సృష్టిపరంగా, కొంత త్రివిక్రమావతార పరంగా అర్థం చెప్పబడింది. ఈ రీతిలోనే కాకుండా, మొత్తం త్రివిక్రమావతారపరంగా కూడా అర్థాన్ని చెప్పవచ్చు.

(ఉరుగాయః ఉత్తరం సధస్థం త్రేధా విచక్రమాణః యః అస్కభా యత్)- మహాత్ములనే మిక్కిలి స్తుతింపబడే ఏ భగవానుడు, ఉత్తరవేదినుండి ఆరంభించి మూడు విధాలుగా పాదన్యాసాలను చేస్తూ, (తమ తమ అధికారాలను కోల్పోయిన దేవతలను) సుస్థిరంగా నిలిపాడో,

(అస్కభాయత్)- వీరిని సుస్థిరంగా నిలిపాడు అని విశేషించి పలుకకుండా సామాన్యంగా పల్కినందున, దేవతలకు అధికారాన్ని సంక్రమింపచేసి, వారిని స్థిరంగా నిలిపి ఉంచడం, లోకాలను, ధర్మాన్ని సంస్థాపించడం మొదలైనవి తెలుపబడ్డాయి.

(ఉత్తరమ్ సధస్థమ్)- మహాబలి యాగం చేసిన చోటు, వారు కూడి ఉండే చోటు.

(ఉత్తరమ్ సధస్థమ్)- వామనుడు వచ్చినందున ఆ వేది ఉత్తరవేది (గొప్పవేది) అయినది.

చత్తిరమేన్ది త్తని యొరు మాణియాయ్
ఉత్తరవేదియిల్ నిన్ఱ ఒరువనై
క్కత్తిరియాల్ కాణక్కాణి ముற்றుమ్ కొణ్డ
పత్తిరాకారన్ పారళన్దాన్ (పెరియాழ்వార్ తిరు-1-9-5)

అని మహాబలి యాగం చేసినచోటు ఉత్తరవేది అని కదా పెరియాళ్వార్ పలికారు.

(ఉత్తరం సధస్థం విచక్రమాణ:)- ఉత్తరవేదిలో నిలచి, మూడు పాదాలనేలను దానమియ్యి అని బలిని యాచించి, పొంది, మూడు పాద న్యాసాలను అక్కడ పెట్టడానికి ఉపక్రమించినవాడై- అని అర్థం కొలువడానికి ఆరంభించినది, ఆ ఉత్తరవేదిలోనే. ఆవిధంగా కొలిచినది దేనిని? అంటే,

(యః పార్థివాని విమమే రజాంసి) – భూమితో పాటు, కింద, పైన సంబంధించి ఉండే లోకాలను అన్నిటిని దేనినీ విడువకుండా ఏ భగవానుడు కొలిచాడో– అని భావం.

(విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచమ్)– ఆ భగవానుని వీరచరిత్రలను సంగ్రహంగా వేగంగా పల్కుతాను.

1) ప్రతద్విష్ణుః స్తవతే వీర్యేణ మృగో న భీమః కుచరో గిరిష్ఠాః |
యస్యోరుషు త్రిషు విక్రమణేషు అధిక్షియంతి భువనాని విశ్వా ॥ .

యస్య = ఏ భగవానునియొక్క, ఉరుషు త్రిషు విక్రమణేషు = చాలా గొప్పవైన మూడు పాదన్యాసాలలో, విశ్వా భువనాని = అన్ని లోకాలు, అధిక్షియంతి = అంతర్భవించి ఉన్నాయో, తత్ విష్ణుః = ఆ విష్ణువు, భీమః= భయంకరమైనది, కుచరః= భూమిలో సంచరించేదై, గిరిష్ఠాః= పర్వతంలో ఉండేది అయిన, మృగో న = సింహంవలె ఉండేవాడై, వీర్యేణ = వీరి కృత్యాలతో, స్తవతే= స్తుతింపబడుతున్నాడు.

వ్యాఖ్య : త్రివిక్రమావతార కృత్యంతో భగవానుడు లోకంలోని అందరిచే స్తుతింపబడుతున్నాడు– అని ఈ మంత్రం తెల్పుతున్నది.

(ప్రతత్ విష్ణుః స్తవతే వీర్యేణ)– విష్ణువు తన వీరకృత్యాలతో గొప్పగా స్తుతింపబడుతున్నాడు. ఇతడు చేసిన కృత్యానికి ప్రయోజనమున్నదా? అంటే,

(మృగో న భీమః కుచరో గిరిష్ఠాః)– భూమిలో సంచరిచేదై, భయంకరమైనదైన సింహం పర్వతంలో విక్రమించి సంచరించే రీతిలోని కృత్యాన్ని చేసినవాడు,

(మృగః)– తన విరోధులను వెదకి వేటాడటం ద్వారా మృగమ్ అని సింహం పిలువబడుతున్నది.

(భీమః)– సింహం అతిభయంకరంగా ఉంటుంది. భీమో భీమపరాక్రమః అనబడే పరమాత్మకూడా విరోధులకు అతిభయంకరంగా ఉంటాడు. భీషాస్మాద్వాతః

పవతే (ఎవని వద్ద భయంతో వాయువు సదా వీస్తున్నదో) అని శ్రుతులలో కీర్తింపబడేవాడు ఇతడు.

(కుచరః గిరిష్ఠాః)– సింహం భూమిపై సంచరిస్తూనే, పర్వతాన్ని కూడా అధిరోహిస్తుంది. ఇతడు కూడా భూమిపై సంచరిస్తూనే, ఉన్నతంగా ఉండే లోకాలకు వ్యాపించాడు.

(కుచరః)– కుత్సితమైన ప్రాణుల విషయంలో హింసాదులను సింహం చేస్తుంది. ఇతడుకూడా హిరణ్యాదుల విషయంలో హింసాదులను చేశాడు.

(గిరిష్ఠాః) – పర్వతంవలె ఉన్నంతంగా ఉండే పరమపదంలో వేంచేసి ఉండేవాడు– అని అర్థం. లేక, గీః అనే పదం శబ్దాన్ని తెల్పుతుంది కనుక, గిరిష్ఠాః – అనేది వేదవాక్కులలో మఱుగుపడి రహస్యంగా గుప్తంగా ఉండేవాడు అనే అర్థాన్ని గ్రహించవచ్చు. వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః (అన్ని వేదాలచే తెలుపబడేవాడను నేనే) అని భగవంతుడే అన్నాడు. మఱైయాయ నాల్ వేదత్తుళ్ నిన్ఱ మలర్ చ్చుడరే (వేదమనే నాల్గు వేదాల లోపల ఉండే, వికసించే జ్యోతిస్స్వరూపా! ) అని అన్నారు, ఆళ్వార్లు.

(కుచర:) – రామకృష్ణాద్యవతారాలలో భూమిలో సంచరించేవాడు.

(గిరిష్ఠా:) –తిరుమల, తిరుమాలిరుమ్ శోలై, అహోబిలం, హస్తిగిరి, శ్వేతగిరిమొదలైన పర్వతాలలో అర్చారూపిగా వేంచేసి ఉండేవాడు.

(మృగో న భీమః కుచరో గిరిష్ఠాః)– నృసింహావతారపరంగా కూడా ఈ మంత్రానికి అర్థాన్ని చెప్పవచ్చు.

(మృగః)– సింహమై అవతరించినవాడు. సింహంవలె భయంకరమైనవాడా ? అని అంటే,

(న భీమః)– అతిమనోహరంగా ఉండేవాడు– నారసింహవపుః శ్రీమాన్ (నృసింహరూపుడు, సుందరుడు) అని వ్యాసమహర్షి, అழகియాన్ తానే అరియురువన్ తానే (అందమైనవాడు అతడే, నృసింహరూపుడతడే), నరమ్ కలన్ద

శిజ్గమాయ్ క్కోణ్ణ తిరువన్ (మానవరూపంతో కలసిన సింహమై అవతరించిన సుందరుడు) అని ఆళ్వార్లు కూడా ఈ నృసింహుని అందంలో అభినివేశాన్ని పొందారు.

(కుచరః)– హిరణ్యునితో యుద్ధం చేసేటపుడు భూమిలో అంతటా సంచరించినవాడు.

(గిరిష్ఠాః) – భూమిలోనే కాక, ఆకాశంలోనే కాక, ఉన్నతప్రదేశమైన గడపపై ఉండి హిరణ్యకశిపుని సంహరించినవాడు.

(తత్ విష్ణుః వీర్యేణ ప్రస్తవతే) – ఆ విష్ణువు ఇటువంటి వీరకృత్యంతో అందరిచే స్తుతింపబడుతున్నాడు.

ఈ మంత్రం నృసింహతాపిన్యుపనిషత్తులో నృసింహవిషయంగా ఉదాహరింపబడినందున ఈ విధంగా అర్థం గ్రహింపబడింది.

(యస్యోరుషు త్రిషు విక్రమణేషు)– ఎవని, చాలా గొప్ప మూడు పాదన్యాసాలలో,

(అధిక్షియంతి భువనాని విశ్వా)– లోకం అంతా అంతర్భవించి ఉజ్జీవిస్తున్నదో, అటువంటి విష్ణువు తన వీరకృత్యాలతో స్తుతింపబడుతున్నాడు– అని పూర్వార్ధంతో అన్వయించాలి.

ఈ విధంగా ఈ మంత్రంతో నృసింహ, త్రివిక్రమావతారాలనే రెండు వీరకృత్యాలు చెప్పబడ్డాయి.

3. ప్రవిష్ణవే శూష మేతు మన్మ గిరిక్షిత ఉరుగాయాయ వృష్ణే,
యః ఇదం దీర్ఘం ప్రయతం సదస్థ మేకో విమమే త్రిభిరిత్పదేభిః ॥

యః = ఓ భగవంతుడు, దీర్ఘం = దీర్ఘమైనది, ప్రయతం =విస్తరించినది అయిన, ఇదం సదస్థం = ఈలోకాన్ని అంతటిని, ఏకః ఇత్ = ఒక్కడుగానే, త్రిభిః పదేభిః= మూడు పదాలతో, విమమే కొలిచాడో, వృష్ణే = (కామాలను– కోరికలను) వర్షించేవాడు, ఉరుగాయాయ = గొప్పగా స్తుతింపబడేవాడు, గిరిక్షితే = గొప్ప స్థానమై

ఉండేవాడైన, విష్ణవే = ఆ విష్ణువుకై, శూషం = బలం, మన్మ = నా స్తుతి, ప్ర ఏతు = పోయి చేరాలి.

వ్యాఖ్య : గడచిన మంత్రంలో ప్రస్తావింపబడిన భగవానుని అతిమానుషలీలలను భావించి, వేదపురుషుడు ఈ మంత్రంలో మంగళాశాసనం చేస్తున్నాడు.

(ప్రవిష్ణవే శూషమేతు మన్మ) - నా మంగళాశాసనం, దానివల్ల కలిగే బలం విష్ణువుకు చెందాలి.

(మన్మ)- మననం- అని అర్థం. మనస్సుతో చేయబడే మంగళాశాసనమని తాత్పర్యం.

(శూషమ్) - దానివల్ల కలిగే బలం. ఎటువంటి విష్ణువుకు? అంటే,

(గిరిక్షితే) - మిక్కిలి ఉన్నతస్థానమైన పరమపదంలో ఉండేవానికి–అని అర్థం. గడచిన మంత్రంలో చెప్పబడిన మారిమలై ముழఙ్జి మన్ని క్కిడన్దుఱజ్గుమ్ శీరియ శిజ్గమ్ (వర్షాకాలంలో కొండగుహలో సుఖంగా నిద్రించే గొప్పసింహం) అయిన నృసింహునకు- అని కూడా భావం. అన్ది యమ్బోదిల్ అరియురువాకి అరియై యழித్తవనై, పన్దనై తీర ప్పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డెన్ఱు పాడుదుమే (సంధ్యాసమయంలో నృసింహరూపుడై శత్రువైన హిరణ్యుని నశింపజేసినవాని పల్లాండు,పల్లాండు అని పాడుదాము) అని నృసింహుడు చేసిన సాహసకృత్యానికి పెరియాళ్వార్లు మంగళాశాసనం చేశారు కదా!

(గిరిక్షితే)- పలు వేదవాక్కులలో పఠింపబడే త్రివిక్రమునకు–అని కూడా భావం. నడన్ద కాల్ కళ్ నొన్దవో (తిరుచ్చంద-61) (నడచిన నీ కాళ్ళు శ్రమపడినందువల్లనా?) తాళాలులకమళన్ద అశైవే కొల్! (నాన్ముకన్ తిరు-35) (శ్రీపాదాలతో భూమిని కొలిచిన శ్రమవల్లనా?), ఇప్పడి తాన్ నీణ తావియ అశైవో(ఈ

భూమిని కొలిచిన శ్రమవల్లనా?) (తిరువాయ్-8-3-5) అని ఆళ్వార్లు, కూడా ఈ లీలలను చూచి, అతిశంకను పొంది మంగళాశాసనం చేశారుకదా!

(ఉరుగాయాయ)- ఈ వీరకృత్యానికి ఆశ్చర్యపడినవారిచే మిక్కిలి స్తుతింపబడేవానికై,

(వృష్ణే) - మహాబలికై -అని అర్థం. ఇంద్రాదులకు గొప్ప ఫలాన్ని ఇచ్చి, లోకానికి అంతటికి తన స్పర్శను అనుగ్రహించిన మహోదారుడైన త్రివిక్రమునకు- అని భావం. ప్రహ్లాదునకు వరాలను వర్షించి, దేవతలకు వారి అధికారాలను ఇచ్చిన నరసింహునకు- అని కూడా భావం.

(విష్ణవే) అంతటా వ్యాపించినవానికి- అని అర్థం. ఈ శబ్దం నృసింహ, త్రివిక్రమావతారాలనే రెండు అవతారాలకు పొసగతుంది.

(యః)- ఏ భగవానుడు,

(ఇదమ్)- మనం కట్టెదురుగా చూచే లోకాన్ని,

(దీర్ఘమ్) - లోకం పొడుగులో పరిమితిని కల్గి ఉన్నందున, కొలిచాడా? లోకం చాలా దీర్ఘమైనది కదా.

(ప్రయతమ్)- వైశాల్యంలో కొఱత ఉన్నందున కొలిచాడా!

(సధస్థమ్) -దానిపై జీవించేవారికి హాని కలిగేటట్లుగా కొలిచాడా! లేదుకదా.

(ఏక ఇత్)- సహాయకుని కలవాడై కొలిచాడా! లేదు కదా!

(త్రిభిః పదేభిః)- పది పదిహేను అడుగులు పెట్టి కొలిచాడా? లేదు కదా. పొడుగులో కొఱత లేదు. వైశాల్యంలో కొఱత లేదు. పాదాలను పెట్టినందున అక్కడ జీవించేవారికి ఏ హాని కలుగలేదు. కొలిచేటపుడు సహాయం ఎవరూ లేరు. కేవలం మూడడుగులు పెట్టి కొలిచాడు. ఏమి ఈ ఆశ్చర్యకరమైన లీల!

(విమమే)- విశేషంగా కొలిచాడు. గొప్ప ప్రేమతో కొలిచాడు- అని అర్థం. లేక, భూర్భువస్సువః అనే పదాలతో ముల్లోకాలను విశేషంగా సృష్టించాడని కూడా చెప్పవచ్చు. పూర్వాన్వయలో అర్థస్వారస్యం అధికం.

ఈ విధంగా ఈ మంత్రంతో భగవానుని అతిమానుష లీలను అనుసంధించి, వేదపురుషుడు మంగళాశాసనం చేశారు.

4) **యస్య త్రీ పూర్ణా మధునా పదాని అక్షీయమాణా స్వధయా మదంతి।**
**య ఉ త్రిధాతు పృథివీ మృత ద్యామేకో దాధార భువనాని విశ్వా॥ .**

యస్య = ఏవిష్ణువుయొక్క, త్రీ పదాని = మూడు పాదన్యాసాలు, మధునా = అమృతంతో, పూర్ణా = నిండినవై, అక్షీయమాణా = నాశం లేనివై, స్వధయా మదంతి = (భక్తులను) అన్నంతో మదాన్ని- అతిశయాన్ని కల్గిస్తున్నవో, యః ఉ = ఆ భగవంతుడే, పృథివీమ్ = భూమిని, ఉత ద్యామ్ = ఇంకా, అంతరిక్షాన్ని , విశ్వా భువనాని = లోకాన్ని అంతటిని, భూమి, నీరు, అగ్ని- అనే మూడు ధాతువులను కల్గి త్రిధాతు = ఉండేటట్లు, ఏకః = ఒక్కడే, దాధార = ధరించాడు.

వ్యాఖ్య—లోకాన్ని అంతటిని సొత్తుగా కల్గి ఉన్నవాడైనందున, వీటిని ధరించడం మాత్రమే కాక, అందటినీ తన అమృతమయాలైన పాదాలతో స్పృశించి ఆనందింపజేశాడు- అని ఇందులో తెలుపబడుతున్నది.

(యస్య) - సుప్రసిద్ధుడైన ఏ విష్ణువు యొక్క,

(త్రీ పదాని)- త్రీణి పదాని- మూడు పాదన్యాసాలు.

(మధునా పూర్ణా)- మధునా పూర్ణాని –- తీయని దివ్యామృతంతో నిండినవై- అని అర్థం. దివ్యేన అమృతేన పూర్ణాని అని సాయణభాష్యం. తేనే మలరుమ్ తిరుప్పాదమ్ (తిరువాయ్-1-5-5) (తేనె స్రవించే శ్రీచరణం) అని నమ్మాళ్వార్లు. తవామృతస్యందిని పాదపంకజే (స్తోత్రరత్నమ్) (అమృతాన్ని స్రవించే నీపాదపద్మాలు రెండు) అని శ్రీయామునులు పల్కడానికి మూలం ఈమంత్రమే. విష్ణోః పదే పరమే

మధ్వ ఉత్స: (మధువును ద్రవించే విష్ణువు య్యొ్క గొప్ప పాదంలో) అనేది అనంతరమంత్రంలోని భాగంకూడా. లేక, ఇక్కడ మధు అంటే– శ్రీచరణాల భోగ్యత – అని కూడా అర్థం. లేక, శ్రీచరణాలనుండి వెలువడే కిరణసమూహం మధుప్రవాహంగా రూపింపబడిందని కూడా చెప్పవచ్చు.

**శ్రేయః కిరంతు కిరణా శ్చరణారవింద**
**నిష్యందమాన మకరంద రసౌఘదేశ్యాః,**
**తజ్ఞాః శ్రుతే ర్మధున ఉత్స ఇతి ప్రతీతాః**
**మాంగల్యరంగనిలయస్య పరస్య ధామ్నః**

(మంగళానికి స్థానమైన, శ్రీరంగంలో నివసించే పరమపురుషుని శ్రీచరణపద్మాలనుండి వెలువడేవి, శ్రీచరణ పద్మాలనుండి వెలువడే తేనె ప్రవాహం వంటివై, వేదంలో మధ్వ ఉత్స: అని చెప్పబడేవి అయిన శ్రీపాదాల కిరణాలు నాకు శ్రేయస్సును కల్గించాలి) అనే శ్రీకూరనాధుల అతిమానుషస్తవ శ్లోకం ఈ అర్థానికి ప్రమాణం.

(అక్షీయమాణా)– అక్షీయమాణాని– నశించనివి– అని అర్థం.

త్వదంఘ్రిముద్దిశ్య. సకృత్ కృతోఽ౦జలిః, న జాతు హీయతే (స్తోత్రరత్నమ్)– (నీ శ్రీచరణాలను ఉద్దేశించి ఒకసారి చేయబడిన అంజలి ఏనాటికీ నశించదు) అనే శ్రీయామునసూక్తి రీతిలో సాధనమైన అంజలియే ఏ నాటికీ నశించనిది అయినపుడు సాధ్యమైన శ్రీచరణం నశించనిదై ఉంటుందనే విషయం చెప్పవలసి ఉన్నదా?

(అక్షీయమాణా స్వధయా మదంతి)– నశించనిదై, అన్నాన్ని అనుగ్రహించి, మదాన్ని కల్గిస్తుంది. ఇక్కడ అన్నమంటే– తన విషయంలోని అనుభవం, అన్న మదంత మద్మి (తైత్తిరీయ) (అన్నమనే నన్ను భుజించే పరమాత్మను నేను భుజిస్తున్నాను) అని భగవదనుభవం అన్నంగా చెప్పబడింది కదా!

(అక్షీయమాణా మదంతి)– ఇతనికి (చేతనునకు) నిత్యానుభావ్యమై ఉండేవి భగవానుని శ్రీచరణాలేకదా!

(మదంతి)– మదయంతి– మదాన్ని కలుగజేస్తున్నాయి.

(మధునా పూర్ణా మదంతి) – మధువుచే నిండినవై, మదాన్ని కల్గిస్తాయని చెప్పాలా ?

అనంతరం, వీటిని అన్నిటిని సదా ధరించేవాడు అతడే – అని తెలుపబడుతున్నది.

(య ఉ) ఆ భగవానుడే– అని భావం. ఉకారం అవధారణార్థాన్ని తెల్పుతుంది. బ్రహ్మరుద్రాదులు ఈ కార్యాన్ని చేయలేరు– అని భావం.

(త్రిధాతు)– భూమి, నీరు, నిప్పు– అనే మూడు ధాతువులను కలిగి ఉండేటట్లు అని అర్థం. ఛాందోగ్యారణ్యకంలో తత్తేజోసృజత, తదపోసృజత, తా అన్న మసృజంత (అది తేజస్సును సృష్టించింది. తేజస్సు నీటిని సృష్టించింది. నీరు అన్నాన్ని సృష్టించింది.) అని ఈ మూడు భూతాల సృష్టిని తెల్పి, హంతాహ మిమా స్తిస్రో దేవతా స్తాసాం త్రివృతం త్రివృత మేకైకాం కరవాణి (ఛాందో–6–3–2,3) (నేను ఈ ధాతువుల రూపంలోని దేవతలను మూడు మూడుగా కలిపి, త్రివృత్కరణాన్ని చేస్తాను) అని త్రివృత్కరణం చెప్పబడింది కదా! ఆ విధంగా త్రివృత్ కృతమయేటట్లు ధరించాడు– అని పూర్వంతో అన్వయం. లేదా,

(త్రిధాతు) – ఈ పదం భూతభవిష్యద్వర్తమానకాలాలనే మూడు కాలాలను, సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాలను, ప్రకృతి, శుద్ధసత్త్వం, కాలమనే త్రివిధ అచేతనాలను, బుద్ధముక్తనిత్యులనే త్రివిధచేతనులను తెల్పుతుందని కూడా చెప్పవచ్చు.

(పృథివీమ్) – ప్రసిద్ధమైన భూమిని,

(ఉత ద్యామ్) – కాంతిని వీచే అంతరిక్షాన్ని,

(విశ్వా భువనాని) – ఇంకా మిగిలిన అన్ని లోకాలను– అని అర్థం. లేక, పృథివీ అనేది జహల్లక్షణద్వారా క్రింద ఏడు లోకాలను, ద్యామ్ అని భూమి మొదలైన పై ఏడు

లోకాలను తెల్పుతున్నదని, విశ్వా భువనాని అని ఈ లోకంలో ఉండే జీవరాశిని అంతటిని తెల్పుతున్నదని కూడా చెప్పవచ్చు.

(ఏకో దాధార) - ఒక్కడే ధరించి నిలిచాడు. మంత్రంలోని య ఉ అనే ప్రయోగంలోని ఉకారానికి దేవతాంతరాలు ఈ కార్యాన్ని చేయ లేదు- అని అర్థం. ఇక్కడ ఏకః అని అన్నందున సహాయాంతర నైరపేక్ష్యం సూచితము.

(ఏకో దాధార భువనాని విశ్వా) - యస్యాయుతాయుతాంశాంశే విశ్వశక్తి రియం స్థితా (విష్ణు.పు) (ఏ భగవానుని శక్తియొక్క పలు వేల భాగాలలోని ఒక భాగంలో ఈ లోకశక్తి నిలచి ఉన్నదో) అని పరాశరమహర్షిచే, మరియు

**విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్** (గీత)

(ఈ లోకాన్ని అంతా నా శక్తిలోని అతిస్వల్ప భాగంతో ధరించి ఉన్నాను)అని భగవంతునిచే ఈ అరుదైన వేదార్థం వివరింపబడింది.

5. **తదస్య ప్రియ మభిపాథో అశ్యాం నరో యత్ర దేవయవో మదంతి।**

**ఉరుక్రమస్య స హి బంధు రిత్థా విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః**

ఇత్థా = పూర్వమంత్రంతో చెప్పబడిన రీతిలో, విష్ణోః= విష్ణువుయొక్క, పరమే పదే =గొప్పదైన పదంలో, మధ్వః ఉత్సః= మధుప్రవాహం (ఉన్నదో), యత్ర = ఏ మధుప్రవాహంలో, దేవయవః నరః = పరమపురుషుని అభిలషించే మానవులు, మదంతి = ఆనందిస్తున్నారో, అస్య ఉరు క్రమస్య = ఈ త్రివిక్రమునియొక్క, ప్రియం = ప్రియమైన, తత్ పాథః = ఆ శ్రీచరణ మధుప్రవాహాన్ని, అశ్యామ్ = భుజించాలి, స హి బంధుః = ఆ పరమపురుషుడే కదా మనకు సర్వ విధబంధువు.

వ్యాఖ్య : సర్వవిధబంధువైన ఆ భగవంతుని శ్రీచరణాలనుండి స్రవించే మధుప్రవాహాన్ని పానం చేసి ఆనందించాలి- అని ఇందులో వేదపురుషుడు పల్కుతున్నాడు. ఈ మంత్రభాగాన్నే నమ్మాళ్వార్లు తేనే మలరుమ్ తిరుప్పాదమ్ (తేనెను

స్రవించే అందమైన పాదాలు) అని, తవామృతస్యందిని పాదపంకజే (స్తోత్రరత్నమ్) (అమృతాన్ని స్రవించే నీ పాదపద్మాలలో) అని శ్రీయామునులు, శ్రేయః కిరంతు కిరణా శ్చరణారవిందనిష్యందమాన మకరందరసౌఘదేశ్యాః, తజ్జాః శ్రుతే ర్మధున ఉత్స ఇతి ప్రతీతాః, మాంగల్యరంగనిలయస్య పరస్య ధామ్నః (మంగళాత్మకమైన శ్రీరంగాన్ని నిలయంగా కల, గొప్పతేజస్సును కల శ్రీరంగనాథుని శ్రీచరణారవిందాలనుండి ప్రవహించే తేనె ప్రవాహాన్ని పోలినది, మధ్వ ఉత్సః అని వేదంలో చెప్పబడినవి అయిన శ్రీచరణాల కిరణాలు) అని అభియుక్తులు అయిన కూరేశులు వివరించారు.

ఇక్కడ శ్రీచరణాలలోని మధుప్రవాహం అనేది శ్రీచరణాల భోగ్యతను తెల్పుతున్నదని ఒక అర్థాన్ని, శ్రీచరణాలనుండి త్రివిక్రమావతారంలో ప్రవహించే గంగను తెల్పుతున్నదని ఇంకొక అర్థాన్ని భట్టర్ శిష్యులైన నలమ్ తికழ் వారాయణచ్చీయర్ చే తెలుపబడినట్లు తిరువాయ్ మొழி (1-5-5) పాశురంలోని ఉన్ తేనే మలరుమ్ తిరుప్పాదమ్ అనే సూక్తి వ్యాఖ్యానం అయిన ఈడుకు గల అరుంబదవివరణంలో కన్పిస్తున్నది. ఈ రెండు అర్థాలకు అనుగుణంగా ఈ మంత్రం ఇపుడు వ్యాఖ్యానింపబడుతున్నది.

(అస్య ఉరుక్రమస్య ప్రియస్య ప్రియం తత్ పాథః అశ్యామ్) ఈ త్రివిక్రముని భోగ్యమైన ఆ శ్రీచరణాలనుండి ద్రవించే మధుప్రవాహాన్ని పానం చేస్తాము. కబంధముదకం పాథః అనే నిఘంటువును బట్టి పాథశ్శబ్దం నీటి ప్రవాహాన్ని తెల్పుతుంది. ఇక్కడ భగవానుని పాదాలనుండి ప్రవహించే అమృతజల ప్రవాహం చెప్పబడుతున్నది. శ్రీచరణాలనుండి ప్రవహించే మధుస్యందనమే శ్రీచరణాల భోగ్యత, శ్రేయః కిరంతు కిరణా శ్చరణావింద నిష్యందమానమకరందరసాఘదేశ్యాః (శ్రీచరణాలనుండి స్రవించే మధుప్రవాహంతో పోలిన కిరణాలు నాకు శ్రేయస్సును కల్గించాలి) అనే కూరేశుల శ్లోకంలో తెలుపబడినట్లే శ్రీచరణాలనుండి వెలువడే కాంతికిరణాలు కూడా కావచ్చు. పరమపురుషుని శ్రీచరణాల, చాలా గొప్ప భోగ్యతను,

లేక– కాంతికిరణాలను పానం చేస్తాము– అని అర్థం. తత్ అనే పదం ద్వారా గడచిన మంత్రంలోని పూర్ణా మధునా పదాని అని, ఈ మంత్రంలోని ఉత్తరార్ధంలో గల పదే పరమే మధ్వ ఉత్స: అని ప్రస్తావింపబడిన ప్రయోగంలో శ్రీచరణాల మధుప్రవాహం తెలుపబడింది. ఈ భోగ్యత లేక, కిరణాలు ఎటువంటివి? అంటే,

(నరో యత్ర దేవయవో మదంతి) – ఏ శ్రీచరణాల మాధుర్యంలో దేవుడనబడే పరమపురుషుని పొందగోరేవారు ఆనందిస్తున్నారో– అని భావం. చంటిబిడ్డకు తల్లిస్తన్యంవంటిది కదా, శేషభూతునకు భగవంతుని శ్రీచరణం. ఆ తల్లి స్తన్యం నుండి స్రవించే పాలవంటిది– శ్రీచరణమధు ప్రవాహమనబడే భోగ్యత,

(దేవయవః యత్ర మదంతి) – దేవుని పొందగోరేవారు మిగిలిన అవయవాలన్నీ ఉండగా, ఈ శ్రీచరణాలలోనే ఆనందిస్తున్నారు.

(దేవయవః)– దేవత్వాన్ని పొందగోరేవారు– అనే అర్థాన్ని గ్రహించేవారు కూడా ఉన్నారు. అంటే– మోక్షాన్ని పొందగోరేవారు ఈ శ్రీచరణభోగ్యతలో ఆనందిస్తున్నారు– అని భావం.

ఎంతో మంది దైవాలుండగా, విష్ణువు యొక్క శ్రీచరణాల భోగ్యతలోనే ముముక్షువులు ఆనందించడానికి ఏమి కారణం? అంటే,

(స హి బంధుః)– అతడే కదా సర్వవిధబంధువు.

**మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృద్గతిర్నారాయణ:** (సుబాల)

(తల్లి, తండ్రి, సోదరుడు, నివాసం, ఉపాయం, స్నేహితుడు, ఉపేయం అనేవి అన్నీ నారాయణుడే) అని వేదాలు,

**సర్వేషా మేవ లోకానాం పితా మాతా చ మాధవః** (భారతమ్) –

(లోకాలకు అన్నిటికి మాధవుడే తల్లి, తండ్రి, మిగిలిన బంధువులు కూడా)

**త్వమేవ మాతా చ పితా త్వమేవ**
**త్వమేవ బంధుశ్చ గురుస్త్వ మేవ,**

త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ,
త్వమేవ సర్వం మమ దేవదేవ!

(దేవదేవా! నీవే తల్లివి, నీవే తండ్రివి, నీవే బంధువువు, నీవే గురువు, నీవేవిద్య, నీవే ధనం, నీవే నాకు సర్వస్వం) అని ఋషులు,

**పెఱ్ఱ** తాయ్ నీయే పిఱప్పిత్త తన్దై నీ
**మఱ్ఱై** యారావారుమ్ నీ పేశిల్ (పెరియ తిరువన్దాది-5)

(కన్నతల్లి నీవే, పుట్టించిన తండ్రి నీవే, పరిశీలించి పల్కితే, ఇంకా మిగిలిన బంధువులందఱు నీవే),

**తఙ్గమాకియ తన్దై తాయొడు తానుమాయ్ అవై యల్లనాయ్** (తిరువాయ్-3-6-9)
(రక్షకులైన తండ్రితో పాటు తల్లియై, వారికంటే మిగిలిన బంధువులై) అని,
**తన్దైయుమ్ తాయుమావార్** (తిరుమాలై-37)
(తండ్రి, తల్లి అయినవారు) అని ఆళ్వార్లు ఈ అర్థాన్ని వివరించారు కదా!

(ఉరుక్రమస్య స హి బంధుః)- ఈ అమృతాన్ని స్రవింపజేసేవాడే త్రివిక్రమునకు బంధువు- అనే అర్థాన్ని చెప్పేవారుకూడా ఉన్నారు.

(ఇత్థా)- ఈ రీతిలో- అని అర్థం. పూర్వమంత్రంలో పల్కిన రీతిలో –అని, ఈ మంత్రంలోని పూర్వభాగంలో పల్కిన రీతిలో –అనికూడా అర్థం.

(విష్ణోః పదేపరమే మధ్వ ఉత్సః) - విష్ణువు యొక్క గొప్పదైన శ్రీచరణంలో మధుప్రవాహం స్రవిస్తున్నది.

(పదే పరమే)- గొప్ప సాధనంగా, సాధ్యంగా (ఉపాయం, ఉపేయంగా) ఉండే శ్రీచరణంలో,

(మధ్వ ఉత్సః) - మధుప్రవాహం.

(విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః) — "తేనే మలరుమ్ తిరుప్పాదమ్" (తిరువాయ్-1-5-5) (తేనె స్రవించే శ్రీచరణం) అని ఆళ్వార్లు, అమృతస్యందిని

పాదపంకజే (స్తోత్రరత్నమ్) (అమృతాన్ని చిందించే పాదపద్మంలో) అని శ్రీయామునులు,

**కిరణా శ్చరణారవింద నిష్యందమానమకరందరసౌఘదేశ్యాః,**
**తజ్జాః శ్రుతే ర్మధున ఉత్స ఇతి ప్రతీతాః**

(శ్రీచరణ పద్మాలనుండి స్రవించే మధుప్రవాహాన్ని పోలినది, మధ్వ ఉత్సః అని వేదంలో చెప్పబడినదైన శ్రీచరణకిరణాలు) అని అభియుక్తులు పలికారు.

ఇక, ఈ మంత్రం భగవానుని శ్రీపాదతీర్థమైన గంగను గూర్చి తెల్పుతున్నది– అనే రెండవ అర్థం వివరింపబడుతున్నది.

(**ఉరుక్రమస్య విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః**)– త్రివిక్రముడైన విష్ణువుయొక్క గొప్ప శ్రీచరణంలోని మధుప్రవాహంవంటి గంగ ప్రవహిస్తున్నది.

(**తదస్య ప్రియ మభిపాథో అశ్యామ్**)– పరమపురుషునకు ప్రియమైన ఆ శ్రీపాదతీర్థమనే గంగాజలాన్ని పానం చేస్తాము.

(**పాథః**)– తీర్థం– అని అర్థం. ఇక్కడ శ్రీపాదతీర్థమైన ఆ గంగ ఎటువంటిది? అంటే,

(**నరో యత్ర దేవయవో మదంతి**)– దేవత్వాన్ని అభిలషించే రుద్రుడు మొదలైనవారు దేనిలో తీర్థమాడుతున్నారో– అని అర్థం. పాపాలను చేసి, దేవత్వాన్ని కోల్పోయిన రుద్రుడు ఈ శ్రీపాదతీర్థంలో స్నానమాడి ఆనందించాడు కదా!

**ద్రవీభూత స్తదా ధర్మో హరిభక్త్యా మహామునే!**
**గృహీత్వా ధర్మపానీయం పదం నాథస్య తుష్టయే,**
**క్షాళితం పరయా భక్త్యా పాద్యార్ఘ్యాదిభిరర్చితమ్,**
**తదంబు పతితం దృష్ట్వా దధార శిరసా హరః.**
**పావనార్థం జటామధ్యే యోగ్యోస్మీత్యవధారణాత్,**
**వర్షాయుతాన్యథ బహూన్ న ముమోచ తదా హరః**

(ఓ ఋషిశ్రేష్ఠా! భగవానుడు లోకాలను కొలిచినపుడు హరిపట్ల గల భక్తితో ధర్మం ద్రవించింది– అంటే జలంగా మారింది. ధర్మమనే ఆ జలంతో జగన్నాథుని ప్రీతికోసం ఆ స్వామి శ్రీచరణం నాచే – భక్తితో అభిషేకించబడింది. పాద్యం, అర్ఘ్యం మొదలైనవానిచే ఆ శ్రీచరణం పూజింపబడింది. కిందకు పడే ఆ జలాన్ని రుద్రుడు చూచి, నేను కూడా పరిశుద్ధుడను కాగలను– అని తలచి, తన శిరస్సులోని జటల మధ్యలో ఆ జలాన్ని తనను పరిశుద్ధునిగా చేసికోవడం కోసం ధరించాడు. తరువాత పలు (పదివేల) సంవత్సరాల కాలం రుద్రుడు ఆ విధంగానే ఆ గంగాజలాన్ని విడువకుండా ధరించాడు) అని ఈశ్వరసంహితలో ఈ వృత్తాంతం తెలుపబడింది కదా.

(నరో యత్ర దేవయవో మదంతి) – ఏ గంగాజలంలో దేవుడైన పరమపురుషుని పొందగోరే మానవులు ఆనందిస్తున్నారో– అని కూడా అర్థం. ఇటువంటి అతని శ్రీపాదతీర్థంలో ప్రీతిని కల్గి ఉండడానికి ఏమి కారణం? అంటే,

(స హి బంధుః) – అతడే కదా సర్వవిధబంధువు.

(ఇత్థా)– ఈ రీతిలో– అని అర్థం.

(విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః) – విష్ణువుయొక్క గొప్ప శ్రీచరణంలో తేనెవంటి గంగా ప్రవాహమున్నది.

(పరమే)–

ఏకః ప్రాసీసరత్పాదం ఏకః ప్రాచిక్షళన్ ముదా,
అపరోఽభ్యధరన్మూర్ధ్నా కోధిక స్తేషు గణ్యతామ్

(ఒకడు తన శ్రీచరణాన్ని చాచాడు. ఇంకొకడు ఆ శ్రీచరణాన్ని అభిషేకించాడు. మఱి ఒకడు శిరస్సుతో ఆ జలాన్ని శిరస్సుతో ధరించాడు వీరిలో ఎవరు గొప్పవారో లెక్కించండి) అనే విధంగా ఈ గంగాప్రవాహమే ఇతని సర్వాధికత్వాన్ని సుస్థాపిస్తున్నది.

ఈ మంత్రానికి సాయణాచార్యులు ఈ క్రింది విధంగా వ్యాఖ్యానం చేశారు.

(అస్య) – ఈ మహావిష్ణువుకు,

(ప్రియమ్)– ప్రియమైనది,

(తత్)– అందఱిచే సేవించదగినదని ప్రసిద్ధమైన,

(పాథ:)– అంతరిక్షాన్ని– అని అర్థం. ప్రకృతంలో– నశించని బ్రహ్మలోకాన్ని,

(అశ్యామ్)– అశూ–వ్యాపనే అనే ధాతువునుండి పుట్టిన ఈ పదానికి వ్యాపిస్తాను– అని అర్థం. ప్రవేశిస్తానని తాత్పర్యం.

(యత్ర)– ఏ పరమపదంలో,

(దేవయవః)– దేవుడైన భగవంతుని పొందగోరేవారైన,

(నరః)– మానవులు,

(మదంతి)– తృప్తిని పొందుతున్నారో, ఆ పరమపదంలో ప్రవేశిస్తాను. ఆ పరమపదం, ఇంకా వివరింపబడుతున్నది.

(ఉరుక్రమస్య)– అన్ని లోకాలను కొలిచిన,

(విష్ణో:)– సర్వవ్యాపకుడైన విష్ణువు యొక్క,

(పరమే పదే)– చాలా గొప్పదైన స్థానంలో,

(మధ్వః) – మాధుర్యంయొక్క.

(ఉత్స:)– ప్రవాహమున్నది.

(తత్ అశ్యామ్)– దానిని భుజిస్తాను. (పొందుతాను)

(ఇత్థా)– ముందు పల్కిన రీతిలో,

(సలమృతకుల్యాదిభోగాః హి బంధు:)– ఆ విష్ణువే కదా అందఱికి హితాన్ని కలుగజేసే బంధువు. అతని పరమపదాన్ని పొందినవారు తిరిగి ఈ లోకానికి రారు కదా.

యత్ర క్షుత్తృష్ణా జరామరణ పునరావృత్త్యాదికం నాస్తి, సంకల్పమాత్రేణ ప్రాప్యంతే, తాదృశమిత్యర్థః. తతోఽధికం నాస్తీత్యాహ– తస్య పదం ప్రాప్తవతాం న పునరావృత్తేః, న చ పునరావర్తతే –ఇతి శ్రుతేః తస్య బంధుత్వమ్. హి శబ్దః సర్వశ్రుతిస్మృతి పురాణాది ప్రసిద్ధిద్యోతనార్థః(సాయణభాష్యం)

(ఏ పరమపదంలో ఆకలి, దాహం, ముసలితనం, మరణం, ఈ లోకానికి తిరిగి రావడం మొదలైనవి లేవో, సంకల్పమాత్రంతో అమృతనదీ మొదలైనవానిలో ఆనందాన్ని పొందవచ్చునో- అటువంటిది ఆ పరమపదం- అని అర్థం. దానికి మించినది లేదు- అని తెలుపబడుతున్నది, విష్ణువుయొక్క పదాన్ని పొందినవారు తిరిగి రావడంలేదని అనడం వల్ల, ముక్తులు ఈ లోకానికి తిరిగి రావడం లేదు అనే వేదవాక్యం ద్వారా ఇతడు బంధువు- అనేది తెలుస్తున్నది. హి అనే పదం అన్ని శ్రుతులలో, స్మృతులలో, పురాణాలు మొదలైనవానిలో ఈ మాట ప్రసిద్ధిని పొందినదని తెల్పుతున్నది) అనేవి సాయణభాష్యంలోని భగవత్పరత్వాన్ని ఉద్ఘోషించే వాక్యాలు.

ఈ విధంగా, ఈ మంత్రంద్వారా భగవంతుని నిరతిశయభోగ్యత్వం, సర్వవిధబంధుత్వం వివరింపబడింది.

6) తా వాం వాస్తూన్యశ్మసి గమధ్యై యత్ర గావో భూరిశృంగా అయాసః|
అత్రాహ తదురుగాయస్య వృష్ణః పరమం పదమవ భాతి భూరి||

వాం = మీకోసం, తా వాస్తూని = ఆ స్థానాలను, గమధ్యై= (మీరు )చేరడం కోసం, ఉశ్మసి = భగవానుని వద్ద ప్రార్థిస్తున్నాము, యత్ర = ఏ ఆ స్థానాలలో, భూరి శృంగాః= మిక్కిలి ఉన్నతమైనవి, అయాసః= మిక్కిలి విస్తృతమైనవి అయిన, గావః= కిరణాలు, (ఉన్నాయో), అత్ర అహ = ఆ లోకాలలో కదా, ఉరుగాయస్య = మిక్కిలి స్తుతింపబడేవాడు, వృష్ణః= (కోరికలను) వర్షించేవాడైన పరమపురుషుని, తత్ = మిక్కిలి ఉన్నతమైన, పరమం = చాలా గొప్పదైన, పదం = స్థానం, భూరి = మిక్కిలి పెద్దదిగా, అవభాతి = గొప్పతనాన్ని పొంది వెల్గుతున్నది

వ్యాఖ్య : ఇది, తనను ఆశ్రయించిన దంపతులకోసం పరమపురుషుని వద్ద పరమపదాన్ని ఆచార్యుడు ప్రార్థించే మంత్రం. పరమపదం యొక్క మహిమలు కూడా ఈ మంత్రంలో తెలుపబడ్డాయి.

(తా) (వామ్)- మీకోసం,

తా వాస్తూని = (తాని వాస్తూని - అని అర్థం.), అవి– చేరదగినవిగా శాస్త్రాలలో ప్రార్థింపబడినవి అయిన,

(వాస్తూని) = సుఖంగా నివసించదగిన స్థానాలను –మండపాలు, తోటలు, నగరాలు మొదలైన పలు విధాలైన నిర్మాణాలతో పరమపదం కూడి ఉన్నందున, తా వాస్తూని (ఆ స్థానాలు) అని బహువచనంగా పలుకబడింది. శ్రీరామాయణంలో కూడా గచ్ఛ లోకాననుత్తమాన్ (తమకు మించినవి ఏమీ లేని లోకాలను పొందు) అని బహువచనంలో ప్రయోగింపబడింది కదా.

(గమధ్యై ఉశ్మసి) – మీరు వెళ్ళడం కోసం, (ఆ స్థానాలను) కోరుతున్నాము– వాటికోసం పరమపురుషుని ప్రార్థిస్తున్నాము– అని భావం. మఱి, ఆ స్థానాలు ఎటువంటివి? అంటే,

(యత్ర గావః భూరి శృంగాః అయాసః)– ఏ స్థానంలో మిక్కిలి ఉన్నతమైనవి, మిక్కిలి వ్యాప్తమైనవి అయిన కిరణాలు ఉన్నాయో,

(గావః)– కిరణాలు– అని అర్థం.

(భూరి శృంగాః)– బహుశృంగాః భూరితి బహునో నామధేయమ్ (పలు శృంగాలను –శాఖలను కల్గినది అని అర్థం. భూరి అనే పదం బహువచనాన్ని తెల్పుతుంది) అనే యాస్కనిరుక్తవచనాన్నిబట్టి పలు శాఖలను కల కిరణాలు– అని అర్థం.

(భూరి శృంగాః) – పలువురిచే ఆశ్రయింపబడేవి– అని కూడా అర్థం.

(అయాసః)– అయాసః అయనాః అని యాస్కనిరుక్తం. అంటే–అంతటా వ్యాపించే కిరణాలు– అని అర్థం. లేక, యాసః అంటే గతించేవి, అంటే, త్వరగా . నశించేవి– అనే అర్థాన్ని గ్రహించి, అయాసః అనే దానికి నశించని గొప్ప కాంతిని కల్గినవి– అని కూడా చెప్పవచ్చు.

(యత్ర గావో భూరి శృంగా అయాసః)–

అత్యర్కానలదీప్తం తత్ స్థానం విష్ణోర్మహాత్మనః,
స్వయైవ ప్రభయా రాజన్! దుష్ప్రే ం దేవదానవైః

(ఓ రాజా! మహాత్ముడైన విష్ణువు యొక్క ఆ పరమపదం – సూర్యుడు, అగ్ని మొదలైన జ్యోతిస్సుల కాంతిని మించిన కాంతిని కల్గినది. తన కాంతితో దేవదానవులకు దర్శించడానికి సాధ్యం కానిది) అని మహాభారతంలో ఈ మంత్రం వివరింపబడింది.

(అత్రాహ) – ఈ లోకాల మధ్యలో కదా,

(ఉరు గాయస్య వృష్ణః తత్పరమం పదమ్)– గొప్పగా కీర్తింపబడేవాడు, మనోరథాలను వర్షించేవాడైన విష్ణువు యొక్క ఆ పరమపదం.

(ఉరు గాయస్య)– పలువురిచే కీర్తింపబడేవాడు, చాలా గొప్పగా కీర్తింపబడేవాడు– అని కూడా అర్థం. ఓదువార్ ఓత్తెల్లామ్ ఎవ్వులకెత్తైవ్వైయుమ్ శాదువాయ్ నిన్ పుకழின் తకైయల్లాల్ పిఱిదిల్లై (తిరువాయ్ మొழி)– (అభ్యసించే వారి వేదం అంతా, ఏ లోకంలో అయినా, ఏదయినా, అది నీ కీర్తిలో అంతర్భవిస్తుంది తప్ప వేఱుకాదు) అనే రీతిలో స్తుతి అనేది అంతా ఇతనికే ఆశ్రయించి ఉంటుంది. కనుక, ఎవరిని పొగడినా ఇతనినే పొగడినట్లు అవుతుంది కనుక, ఉరుగాయః (పలువురిచే మిక్కిలిగా స్తుతింపబడేవాడు) అని ఆశ్చర్యంగా పల్కుతున్నది, వేదం.

(వృష్ణః)– నాల్గు విధాలైన పురుషార్థాలను వర్షించేవాడు– అని అర్థం. వేణ్ణిற்றెறల్లామ్ తరుమ్ కోదిల్ ఎన్వళ్ళల్ (కోరిన దానిని అంతటినీ ఇచ్చే ఉదారుడు) కదా, భగవంతుడు. నాల్గు విధాలైన పురుషార్థాలను అనుగ్రహించగల్గినవాడనేది తెలుపడం కోసమే కదా ఇతడు నాల్గు చేతులను ధరించి ఉన్నాడు.

చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవ శ్చతుర్భుజః

(నాల్గు పురుషార్థాలను అనుగ్రహించేవాడు దేవుడైన చతుర్భుజుడు) అని ఈ విషయం ఆలంకారికగ్రంథ ప్రసిద్ధం.

మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్ (జనార్ధనుని వలన మోక్షాన్ని కోరాలి) అని మోక్షపురుషార్థాన్ని అనుగ్రహించగల్గినవాడు ఇతడే– అని శాస్త్రవచనం. మిగిలిన

పురుషారాలను ఆ యా దేవతలు ఇవ్వడంకూడా ఇతడు అనుగ్రహించడంవల్లనే- అనే విషయాన్ని మయైవ విహితాన్ (నాచేతనే ఇవ్వబడిన వానిని) అని గీతలో ఆ భగవానుడే స్వయంగా పలికాడు. అందుచేత ఇతనిని వృష్ణః– మనోరథాలను వర్షించేవాడు అని మాటిమాటికి ఆనందంతో పలవరిస్తున్నది వేదం.

**(తత్ పరమం పదమ్)**– శ్రుతిస్మృతులలో సుప్రసిద్ధమైన ఆ పరమపదం– అని అర్థం.

**(అత్రాహ తత్ పరమపదమ్)** – అత్ర అని త్రిపాద్విభూతి తెలుపబడుతున్నది. పరమం పదమ్ అని శ్రీవైకుంఠమ్ అని, అయోధ్య అని, అపరాజిత అని ప్రసిద్ధమైన దివ్యనగరం తెలుపబడింది.

**(పరమం పద మవభాతి భూరి)** – త్రిపాద్విభూతి ఒక ఎత్తు భాసిస్తున్నదంటే, దానిలో ఉండే పరమపదం భగవానుని పరరూప సాన్నిధ్యం వల్ల ఉన్నతోన్నతముగా ప్రకాశిస్తున్నది.

(అవభాతి)– తన మహిమతో వెలుగొందుతున్నది– అని సాయణభాష్యం.

7) **ప్రవః పాంత మంధసో ధియాయతే మహే శూరాయ విష్ణవే చార్చత।**
**యా సానుని పర్వతానా మదాభ్యా మహ స్తస్థతు రర్వతేవ సాధునా॥ .**

వః= మీ, పాంతమ్= రక్ష్యవస్తువులను, అంధసః= అన్నాన్ని, ప్ర అర్చత = అధికంగా సంపాదించండి, (ఎవరికోసం? అంటే), ధియాయతే= స్తుతులను కోరేవాడు, మహే = గొప్పవాడైన, శూరాయ = వీరుడైన ఇంద్రునకు, విష్ణవే = (సర్వవ్యాపి అయిన విష్ణువునకు (సమర్పించండి), (వారు ఎటువంటివారు? అంటే) , యా = ఏ ఇద్దఱు, అదాభ్యా = (ఇతరులచే), జయించడానికి సాధ్యం కానివారై, మహాః= (అందువల్ల) గొప్పవారై, సాధునా అర్వతా ఇవ = చక్కని గుఱ్ఱంపై ఎక్కి వెళ్ళేవారివలె, పర్వతానామ్ = ఉన్నతలోకాల, సానుని = శిఖరంలో, తస్థతుః= నిలచి ఉన్నారో, (వారికోసం సంపాదించండి – అని ముందు భాగంతో అన్వయం.)

ఈ మంత్రంనుండి ఆరంభించి మూడు మంత్రాలలో ఇంద్రానుజుడైన భగవంతునితో కూడ, అతనికి అన్న అనే గొప్పతనాన్ని పొందిన ఇంద్రుని కలిపి స్తుతించడం జరుగుతున్నది. పూలతో చేరిన నార కూడా సువాసనను కల్గి ఉండేటట్లు, భగవంతుని సహాయంగా కల్గిన ఇంద్రుడు కూడా గొప్పతనాన్ని పొందుతున్నాడు. మీ సొత్తును వారికి సమర్పించండి– అని ఈ మంత్రంలో తెలుపబడుతున్నది.

(వః పాంతమ్ అంధసః ప్ర అర్చత)– మీ సొత్తులను, అన్నాన్ని అధికంగా సంపాదించండి. ఎందుకోసం? అంటే, మీ ఉపయోగం కోసం కాదు. పరమపురుషునకు, అన్న అయిన ఇంద్రునకు సమర్పించడంకోసం–అని ఇకపై తెలుపబడుతున్నది.

(ధియాయతే)– స్తుతులను అభిలషించేవానికి– అని అర్థం. ఈ విశేషణాలు ఇంద్రునకు, విష్ణువునకు సాధారణాలు. స్తవప్రియః (స్తుతులను కోరేవాడు) అని కదా విష్ణుసహస్రనామ సూక్తి.

(మహే) – గొప్పవానికి –అని అర్థం. వయస్సులో పెద్దవాడు మహేంద్రుడు. గొప్పతనంలో పెద్దవాడు మహావిష్ణువు.

(శూరాయ)– ఇంద్రునకు– అని అర్థం. ఇది ఇంద్రుని నామం.

(విష్ణవే చ) – సర్వవ్యాపి అయినందున విష్ణువనబడే దేవునకు– అని అర్థం. వ్యాపనాయ ఏతన్నామకాయ దేవాయ చ అని ఇక్కడ సాయణభాష్యం. వారు ఎటువంటివారు? అంటే,

(యా పర్వతానామ్ సానుని తస్థతుః)– ఏ ఇద్దఱు పర్వతాలనబడే మిక్కిలి ఉన్నతమైన, మిక్కిలి భోగ్యమైన స్వర్గలోకంలోని, వైకుంఠంలోని ఉన్నత ప్రదేశాలలో ఉన్నారో,

(పర్వతానామ్) – పర్వవాన్ పర్వతః– పర్వం పునః పృణాతేః ప్రీణాతేర్వా అని పర్వతశబ్దానికి యాస్కనిరుక్తి. ప్రీణనమనబడే తృప్తిని కల్గిస్తున్నది. లేక, పూర్తి అనబడే

నిండుతనాన్ని కల్గిస్తున్నది –అని అర్థం. ఇక్కడ ఇంద్రుడు ఉండే స్వర్గం. పరమపురుషుడుండే వైకుంఠం– ఈ రెండు ప్రీతిని, పూర్తిని కల్గించే పర్వతాలుగా చెప్పబడుతున్నాయి. మిక్కిలి ఉన్నతాలైన లోకాలైనందున, వీటిని పర్వతాలని అనడం పొసగుతుంది.

(యా పర్వతానాం సానుని తస్థతు:)– ఏ ఇద్దఱు మిక్కిలి ఉన్నతమై, ఆనందాన్ని కల్గించి, పూర్తిని కల్గించేవైన లోకాలనే పర్వతాల ఉచ్చప్రదేశంలో ఉన్నారో– అని భావం. లేక, పర్వతమనేది మేఘాన్ని తెల్పుతున్నదని కూడా చెప్పవచ్చు. ఇంద్ర, ఉపేంద్రాదులు మేఘంపై ఉండి వర్షాన్ని కురిపిస్తున్నారు– అని కూడా అర్థాన్ని చెప్పవచ్చు. వారు ఇంకా ఎటువంటివారు? అంటే,

(అదాభ్యా) – ఎవరికీ జయించడానికి వీలు కానివారు. గాలితో కూడిన అగ్నివంటివారు.

(మహః)– ఆ కారణంచేత గొప్పవారు. మహేంద్రుడని, మహావిష్ణువు అని లోకం అంతటా ప్రసిద్ధిని పొందినవారు– అని అర్థం. లేక,

(మహః సానుని తస్థతుః)– తమ తేజస్సు అనే పర్వత శిఖరంలో ఉండేవారు– అని కూడా అర్థం.

(అర్వతేవ సానునా)– వెళ్ళదలచిన చోటుకు వేగంగా వెళ్ళే గుఱ్ఱంతో కూడినవారివలె, చాలా ఉన్నతమైన లోకాన్ని పొందినవారు. ఇటువంటి దేవతలకు సమర్పించడం కోసం వారిని గూర్చిన యాగానికి కావలసిన సొత్తులను (సంభారాలను) అన్నాన్ని సేకరించండి. మీ కడుపును, మనస్సులోని కోరికలను నిండించుకోవడం కోసంగా వీటిని అన్వేషించకండి– అని భావం.

దీనికి ఇంకొక రీతిలో కూడా అర్థాన్ని చెప్పవచ్చు.

(వః)– మీయొక్క,

(పాంతమ్)– రక్షింపబడవలసిన శరీరాన్ని– అని అర్థం. శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్ (కుమారసంభవమ్) (శరీరం అనేది మొదటి ధర్మసాధనం కదా) అని చెప్పబడినందున రక్షింపబడవలసిన వానిలో మొదటిది శరీరం. అది ఇక్కడ పాంతమ్ అనబడుతున్నది.

(అంధసః)– అన్నంచే పోషింపబడే ఇంద్రియాలను,

(ధియాయతే విష్ణవే చార్చత) – స్తుతిని కోరేవాడు, గొప్పవాడు, శూరుడైన విష్ణువునకే సమర్పించండి.

(ధియాయతే)– స్తుతింపదగినవాడైనందున, స్తుతిని అభిలషించేవాడైనందున, వాక్కు మొదలైన ఇంద్రియాలను అతనికే సమర్పించాలి (వశం చేయాలి).

(మహే) – మనోవాక్కాయాలతో ఎంతటి కైంకర్యాలను చేసినా, తగినట్లుగా ఉండే గొప్పతనాన్ని కలవాడు,

(శూరాయ) – వీరకృత్యాలను కలవాడు,

(విష్ణవే చ) – సర్వవ్యాపియైన అతనికి– అని అర్థం. చకారంద్వారా అతనిని తోడుగా కల్గిన ఇంద్రుడు సముచ్చీకరింపబడుతున్నాడు. కనుక, ఈ చకారం అనుక్తసముచ్చాయకం.

(అర్చత)– అర్చించండి. సమర్పించండి– అని భావం. ఉత్తరార్ధానికి పూర్వంవలె అర్థాన్ని గ్రహించాలి.

8) త్వేష మిత్థా సమరణం శిమీవతోః ఇంద్రావిష్ణూ సుతపా వా మురుష్యతి।
యా మర్త్యాయ ప్రతిధీయమాన మిత్కృశానో రస్తు రసనా మురుష్యథః॥

ఈ ఇంద్రావిష్ణూ = ఓఇంద్రవిష్ణువులారా! , శిమీవతోః= (కోరిన మనోరథాలను మొదలైన కర్మలను కల, వాం = మీకోసం, ఇత్థా = ఈ విధంగా, త్వేషం

= ప్రకాశమైన, సమరణం = యాగదేశాన్ని చేరే దారిని, సుతపాః= చక్కగా యాగం చేసే యజమాని, ఉరుష్యతి = రక్షిస్తున్నాడు, యా = ఏ మీరు, మర్త్యాయ =యాగం చేసే మానవునకు, ప్రతిధీయమానమ్ ఇత్ = ఇవ్వవలసిన ఫలాన్ని, అసనామ్ అస్తు= హవిస్సును (అగ్నిలో) హోమం చేసే ఆ మానవునకు, కృశానోః= అగ్నిమూలంగానే, ఉరుష్యథః= ఎడబాటు లేకుండా పొందిస్తున్నారో, (వారికోసం రక్షించండి).

వ్యాఖ్య: ఇంద్ర, విష్ణువులనుగూర్చి యాగం చేయండి– అని గడచిన మంత్రం తెల్పింది. ఇంద్రవిష్ణువులు తమను గూర్చి యాగం చేసేవానికి వెంటనే ప్రత్యక్షంగా ఫలాన్ని ఇవ్వగల్గినవారు– అని ఈ మంత్రంలో తెలుపబడుతున్నది.

(ఇంద్రావిష్ణూ)– ఓ ఇంద్రవిష్ణువులారా! –అని అర్థం. ఇంద్రుడు, ఉపేంద్రుడు– అనే దేవతాద్వయాన్ని ఈ ప్రయోగం తెల్పుతున్నది.

(శిమీవతోః వామ్)– ఇష్టాలను అనుగ్రహించడం, అనిష్టాలను తొలిగించడం మొదలైన కార్యాలను చేసే మీకోసం,

(త్వేషం సమరణమ్)– మఱింతగా ప్రజ్వరిల్లే అగ్నితో కూడిన యాగప్రదేశానికి చేరే దారిని,

(సుతపాః)– యాగాన్ని చక్కగా చేసే యజమాని,

(ఇత్థా ఉరుష్యతి)– ఈ విధమైన రీతిలో రక్షిస్తున్నాడు. మిమ్ములను యాగానికి ఆహ్వానించి పూజిస్తున్నాడు– అని భావం. లేక,

(శిమీవతో:)– వజ్రంతో, చక్రంతో కొట్టడం మొదలైన కర్మలను కల,

(వామ్)– మీయొక్క,

(త్వేషమ్)– ప్రకాశించే వీర్యంతో కూడిన,

(సమరణమ్)– వర్షం కురవడంకోసం మేఘాన్ని చక్కగా ఛేదించడమనే కృత్యాన్ని,

(సుతపా ఉరుష్యతి)- యజమాని స్తుతిస్తున్నాడు- అనే అర్థాన్ని కొందఱు తెల్పుతారు.

వారు ఇంకా ఎటువంటివారు? అంటే,

(యా)- ఏ ఇంద్రవిష్ణువులు,

(మర్త్యాయ ప్రతిధీయమానమిత్)- యాగం చేసే మానవునకు అనుగ్రహించవలసిన ఫలాన్ని,

(అసనామ్ అస్తు)- అగ్నిలో సమర్పించదగిన (వ్రేల్చదగిన) హవిస్సును, సమర్పించే (వ్రేల్చే) యజమానికి,

(కృశానోః ఉరుష్యథః) - ఆ అగ్ని మూలంగా వెంటనే, ఫలాన్ని ఇస్తున్నారు. అగ్నిలో హోమం చేయబడే హవిస్సును గ్రహించి, దానిమూలంగానే ఫలాన్ని అనుగ్రహిస్తున్నారు- అని భావం.

9) **తా ఈమ్ వర్ధంతి మహ్యస్య పౌంస్యం ని మాతరా నయతి రేతసే భుజే!**
**దధాతి పుత్రో ఽవరం పరం పితుర్నామ తృతీయ మధిరోచసే దివః॥**

తాః = ఆ ఆహుతులు, అస్య= ఈ యజమానికి, ఈమ్ =సంపదను, మహి = గొప్పతనాన్ని, పౌంస్యం = పురుషత్వాన్ని, వర్ధంతి = వృద్ధిచేస్తున్నవి, దివః= ప్రకాశించే సూర్యుని, అధిరోచసే= మిక్కిలి ప్రకాశించే మండలంలో (జీవుని చేర్చి), రేతసే= (ప్రాణులు) ప్రజలను ఉత్పత్తి చేయడంకోసం, భుజే = భోగాలకోసం, మాతరా = అంతరిక్షాన్ని, భూమిని, నినయతి = మిక్కిలి పొందిస్తున్నాడు (తండ్రి అయిన విష్ణువు), పితుః= (ఒకనికి) పుత్రుడై పుట్టే ఈ జీవుడు, పరం నామ = గొప్పదైన (పుత్రుడనే) నామాన్ని, అవరం నామ = (తరువాతివాడైన పౌత్రుడనే) పేరును, తృతీయం నామ = (ఆతరువాత) తండ్రి అనే పేరును, దధాతి= ధరిస్తున్నాడు.

వ్యాఖ్య : సంగ్రహంగా భగవానుడైన విష్ణువుచే చేయబడే ప్రజాసృష్టిని ఈ మంత్రం కీర్తిస్తున్నది.

(తా ఈమ్ వర్ధయతి)– ఇంద్ర విష్ణువులను ఉద్దేశించి చేయబడే ఆ ఆహుతులు సంపదను వృద్ధిచేస్తున్నాయి. ఎవరికి? అంటే,

(అస్య) – ఆ ఆహుతులను అగ్నిలో వ్రేల్చిన యజమానికి– అని భావం.

(మహి)– గొప్పతనాన్ని పెంపొందిస్తున్నాయి.

తండ్రిగా, ఇంద్రుడు, విష్ణువు లోకానికి చేసే సాధారణ హితాలను,

(పౌంస్యమ్)– ప్రజాసృష్టికి అనుగుణమైన పుంస్త్వాన్ని వర్ధిల్లజేస్తున్నాయి.

ప్రజాసృష్టి ప్రస్తుతమైనందున, పరమపురుషుడు చేసే ఆ కార్యాన్ని వేదపురుషుడు ఇకపై వివరిస్తున్నాడు.

(దివః రోచతే అధి)– ప్రకాశించే సూర్యమండలంలో ఉండేవాడై,

(రేతసే)– ప్రజలను ఉత్పత్తిచేయడం కోసం,

(భుజే) – కర్మఫలానుభవం కోసం, లేక రక్షణకోసం,

(మాతరా నినయతి)– వర్షం ద్వారా అంతరిక్షలోకాన్ని, భూమిని చక్కగా పరమపురుషుడు పొందిస్తున్నాడు. ఏకవచన ప్రయోగంద్వారా ఈ కార్యంలో ఇంద్రునకు అన్వయం లేదని సూచింపబడింది. పొందిన తరువాత ఏమవుతున్నది? అంటే,

(పుత్రః)– ఒకనికి పుత్రుడై పుట్టేవాడు.

(పితుః)– బాలకుడు, సర్వలోకపిత అయిన విష్ణువు యొక్క అనుగ్రహంచేత– అని అర్థం. పితు: బాలకాత్ విష్ణోరనుగ్రహాత్ అని ఇక్కడ సాయణభాష్యం. లేక,

(పితుః పుత్రః) –ఒక తండ్రి పుత్రుడై పుట్టేవాడు– అని అర్థం.

(పరం నామ)– గొప్ప పుత్రుడనే పేరును– అని అర్థం.

(అవరం నామ) తరువాతివాడైన పౌత్రుడు అనే పేరును –అని అర్థం.తండ్రికి పుత్రుడైనపుడే తాతకు పౌత్రుడవుతాడు కదా.

(తృతీయం నామ)– తరువాత కొంతకాలం గడచినపుడు తాను ఒక పుత్రుని పొందినపుడు పితా అనే మూడవ పేరును,

(దధాతి)– జీవుడు ధరిస్తున్నాడు.

10. **తత్తదిదస్య పౌంస్యం గృణీమసీనస్య త్రాతు రవృకస్య మీఢుషః |**
**యః పార్థివాని త్రిభిరిద్విగామభిరురు క్రమిష్టో రురుగాయాయ జీవసే॥**

యః= ఏ భగవానుడు, పార్థివాని = భూమిలో ఉండే రజస్సును, (ధూళికణాలను), త్రిభిః ఇద్విగామభిః= మూడే పాదన్యాసాలతో, ఉరుగాయాయ= మిక్కిలి కీర్తింపబడడం కోసం, జీవసే = (లోకాన్ని) రక్షించడం కోసం, ఉరుక్రమిష్ట = కొలిచాడో, ఇనస్య = సర్వస్వామియై, త్రాతుః= సర్వరక్షకుడై, ఆవృకస్య= పరమదయాళువై, మీఢుషః= నిత్యయౌవనాన్ని కలవాడైన, అస్య = ఈ విష్ణువుయొక్క, తత్ తత్ పౌంస్యమ్ = ఆ యా పురుష కృత్యాలను, గృణీమసి = స్తుతిస్తాము.

వ్యాఖ్య : ప్రకృతంలో సర్వేశ్వరుని సృష్టికృత్యం ప్రస్తుతమైనందున అతని మిగిలిన వీరకృత్యాలను వేదపురుషుడు వివరించి పల్కడం ఆరంభిస్తున్నాడు.

(తత్ తదిస్య పౌంస్యం గృణీమసి)– ఇతనికే చెందిన ఆ యా పురుషకృత్యాలను కీర్తిస్తాము.

(అస్య ఇత్ పౌంస్యమ్)– స్త్రీప్రాయ మితరత్ సర్వమ్ (భగవానుడు తప్ప మిగిలిన వారు అంతా స్త్రీ సమానులే) అనే రీతిలో పరమపురుషుడనే ఇతనికి ఒక్కనికే పుంస్త్వం ఉన్నందున, మిగిలినవారంతా స్త్రీత్వాన్ని కలవారైనందున ఇతనికే చెందిన పురుషత్వం (అస్య పౌంస్యమ్) అని చెప్పబడింది. ఇత్ అనేది ఏవకారార్థాన్ని (అవధారణార్థాన్ని) తెల్పుతుంది. ఇతడు ఎటువంటివాడు? అంటే,

(ఇనస్య)– ప్రభువై ఉండేవాడు. రాజాధిరాజ స్సర్వేషామ్ విష్ణుః (భారతమ్) (రాజులందరికి విష్ణువు గొప్ప రాజు) అని కీర్తింపబడేవాడు. సర్వస్వామి అయినవాడని తాత్పర్యం. స్వామియై ఉండడం మాత్రమేనా? రక్షించగల్గినవాడు కాడా! అని అంటే,

(త్రాతుః)– సర్వరక్షకుడై ఉండేవాడు– అని భావం. ఒక సమయంలో రక్షకుడై ఉన్నా, మరి ఒక సమయంలో హింసకుడై ఉండవచ్చు కదా! అంటే,

(అవృకస్య)– ఏ నాడూ హింసించనివాడు– అని అర్థం. నరకాది దండనలను ఇచ్చే ఇతడు హింసించేవాడు కాడా? అని అంటే, ఆ దండనలు కూడా ఈ జీవుని సంస్కరించి సన్మార్గంలో పెట్టడం కోసం కనుక, అవి రక్షణలో అంతర్భవిస్తా తప్ప, హింసలో చేరవు. తండ్రి తన తనయుని సంస్కరించడం కోసం దండిస్తే, దానిని చూచి ఆ తండ్రి హింసకుడని భావించలేము కదా! స్వామి అయినా, రక్షకుడైనా, హింసకుడు కాకపోయినా, దర్శించడానికి వీలు కాని వికృతరూపాన్ని కలవాడా? అంటే,

(మీఢుషః)– నిత్యయౌవనమైన, పరమమంగళకరమైన తిరుమేనిని కలవాడై ఉండేవాడు– అని భావం.

అయితే, ఇతడు చేసిన పుంస్యావహకృత్యాలలో ఏదో ఒక కృత్యాన్ని చెప్పవచ్చుకదా! – అంటే,

(యః)– ఏ పరమపురుషుడు,

(పార్థివాని) – భూమిలోని ధూళిరేణువులన్నిటిని– అని అర్థం. రజాంసి అని అధ్యాహారం చేసికోవాలి. ఒక కణం కూడా వదలకుండా కొలిచాడు.

(త్రిభిరిత్ విగామభిః)– మూడే మూడు పాదన్యాసాలతో,

(ఉరుక్రమిష్ట)– కొలిచాడు కదా! అటువంటి అతనిని స్తుతిస్తాము–అని పూర్వంతో అన్వయం. ఎందుకోసం ఈ విధంగా కొలిచాడు? అంటే,

(ఉరుగాయాయ)– మిక్కిలి కీర్తింపబడడంకోసం,

(జీవసే)– రక్షణ చేయడంకోసం, సొత్తుదారుడు తన సొత్తును విడచిపెట్టలేడు కనుక– అని భావం. లేక,

(ఉరుగాయాయ)– ఉరుగాయస్య అని అర్థం.

(ఉరుగాయాయ పౌంస్యం గృణీమసి)– మిక్కిలి కీర్తింపబడే విష్ణువు పురుషకృత్యాలను స్తుతిస్తాము. ఎందుకు అంటే?

(జీవసే)– మనం ఉజ్జీవించడంకోసం. అతనిని కీర్తించడమే మనకు ఉజ్జీవనమనిభావం.

11. ద్వే ఇదస్య క్రమణే స్వర్దృశోఽభిఖ్యాయ మర్త్యో భురణ్యతి।
తృతీయమస్య న కిరా దధర్షతి వయశ్చ న పతయంతః పతత్రిణః॥

అస్య = ఈ, స్వర్దృశః= స్వర్గాన్ని వీక్షించేవాడైన విష్ణువుయొక్క, ద్వే ఇత్ క్రమణే = రెండు పాదన్యాసాలను గూర్చియే, మర్త్యః = మానవుడు, అభిఖ్యాయ =చక్కగా తెలిసికొని, భురణ్యతి =పూజిస్తున్నాడు, అస్య = ఈ విష్ణువుయొక్క, తృతీయం క్రమణమ్= మూడవ పాదన్యాసాన్ని, న కి: ఆదధర్షతి = ఏనాడూ తెలియగల్గినవాడు కాడు, పతయంతః= (అంతటా) వీచే, వయశ్చ న = వాయువులు, పతత్రిణః= (ఎగిరే)పక్షులు (తెలియలేవు).

ఒణ్మిదియుఙ్బునలురువి ఒరుకాల్ నిఙ్వ, ఒరు కాలుమ్ కామరుశీరవుణనుళ్ళత్తు,
ఎణ్మాదియుమ్ కడన్దణ్డమీదు పోకి, ఇరువిశుమ్బి నూడుపోయ్ ఎழுన్దు, మేలే
త్తణ్ మదియుమ్ కదిరవనుమ్ తవిరవోడి తారకైయిన్ పుఱన్దడవి అప్పాల్ మిక్కు,
మణ్ ముழுదు మకప్పడుత్తు నిన్ఱఎన్దై మలర్ పురైయుమ్ తిరువడి ఎన్ తలైమేలవే
(తిరు నెడుందాండగమ్–5)

(అందంగా చాచిన ఒక పాదంపైన గంగాజలం ప్రవహించగా, ఇంకొక పాదం ఆశించదగిన సంపదను కలిగిన బలి మనసులోని ఆలోచనను కూడా దాటిపోయి, అండం పైన పోయి వ్యాపించి, విశాలమైన ఆకాశంలో మధ్యగా వెళ్లి పెరిగి, పైనున్న

చల్లని చంద్రుని, సూర్యుని దాటి వెళ్లి, నక్షత్రముల పైన స్పృశించి, ఆ పైన పైన ఉండే లోకాలను అన్నిటిని వ్యాపించిన నా స్వామి అయిన త్రివిక్రముని పూలవంటి పాదాలను నమస్కరించాను)

అనే విధంగా ఒక పాదంతో అధోలోకాలను, ఇంకొక పాదంతో పై లోకాలను కొలువడం లోకప్రసిద్ధమై ఉండగా, త్రిభిరిత్ విగామభి రురుక్రమిష్ట అని గడచిన మంత్రంలో పల్కిన రీతి ఏ విధంగా పొసగుతుంది? అనే సందేహం కలుగగా, దానికి సమాధానాన్ని ఈ మంత్రం పల్కుతున్నది.

(స్వర్దృశః అస్య) – స్వర్గాన్ని వీక్షించే ఈ పరమపురుషునియొక్క– అని అర్థం. ఇక్కడ స్వర్గం అంటే – అంతు లేని ఆనందాన్ని ఇచ్చే పరమపదం. ఈ లోకంలో ఉండేవారు పరమపదాన్ని చూడలేరు కనుక, ఇతడు స్వర్దృశః (స్వర్గాన్ని చూచేవాడు) అని చెప్పబడ్డాడు.

(ద్వే ఇత్ క్రమణే) – ఊర్ధ్వ, అధోలోకాలనే రెండు పాదన్యాసాలనే,

(మర్త్యః అభిఖ్యాయ భురణ్యతి)– మరణాన్ని సహజంగా కల్గిన మానవుడు చక్కగా తెలిసికొని పూజిస్తున్నాడు.

(తృతీయమస్య)– ఇతని మూడవ పాదన్యాసాన్ని,

(నకిరా దధర్షతి)– ఏ మానవుడూ తెలియలేడు. మానవుడు సంచరించని చోట కూడా సంచరించే వాయవులు, పక్షులు తెలియగలవు కదా! అంటే,

(వయశ్చ న పతయంతః పతత్రిణః)– అంతటా వీచే వాయువులు, పక్షులు కూడా తెలియలేవు.

నాచ్చియార్ తిరుమొழி ప్రబంధంలోని (4–9) వ పాశురాన్ని వ్యాఖ్యానిస్తూ పెరియవాచ్చాన్పిళ్ళై ప్రస్తావించిన ఈక్రింది ఐతిహ్యం ప్రస్తావనార్హం.

త్రీణి పదా విచక్రమే (మూడు పాదన్యాసాలతో కొలిచాడు) అని, మూన్డడి నిమిర్ త్తు అని చెప్పబడుతూ ఉండగా, ఇక్కడ ఈ పాశురంలో– రెండు అడుగులతో– అని పల్కడం ఏవిధంగా? అని నంజీయర్ భట్టర్ ను ప్రశ్నించారట.

**పరో మాత్రయా తనువా వృథాన న తే మహిత్వ మన్వశ్నువంతి**
**ఉభే తే విద్మ రజసీ పృథివ్యాః, విష్ణో! దేవ! త్వం పరమస్య విత్సే**

(ఓ విష్ణుదేవా! గొప్పవాడవైన నీవు చాలా గొప్ప రూపంతో వృద్ధిచెందావు. అపుడు నీ గొప్పతనాన్ని పరిచ్ఛేదించి తెలియగల్గినవారెవరూ లేరు. భూమిలో, ఆకాశంలో నీవు పెట్టిన రెండు అడుగులను గూర్చి మాత్రమే మేము తెలియగలం. ఈ రెండిటికి మించిన మూడవ అడుగును గూర్చి నీకే తెలుసు కాబోలు)

అని వేదపురుషుడే రెండు పాదాలతో నీవు లోకాలను కొలువడం అందటికీ తెలుసు. నీవు మూడవ పాదంతో కొలువడం నీకే తెలుసు, అంతే అని అంటూ చూడలేకపోయాడు కదా. మూడవ పాదంతో అతడు కొలువడం నిజం. అది అతనికే తెలుసు; అంతే అని భట్టర్ బదులిచ్చారట.

ఇక్కడ ఈ ప్రశ్నకు రెండు రీతులలో సమాధానాన్ని చెప్పవచ్చు. రెండు పాదాలతో లోకాలను కొలిచిన తరువాత, వామనుడు మహాబలితలపై కాలును పెట్టి, అతనిని పాతాళంలోకి అదిమి, అక్కడ అతనికి గొప్ప ఐశ్వర్యాన్ని ఏర్పరచి, తానే అతనికి ద్వారపాలకుడైన ప్రసిద్ధి ఉన్నది. ఉదారాః అని తన మనస్సుతో భక్తుడైన మహాబలి తలపై పెట్టిన పాదన్యాసాన్నే మూడవ అడుగుగా ఇక్కడ చెప్పబడుతున్నది. ఈ ఔదార్యగుణం ఇంకొకరికి ఎవరికీ సాధ్యం కాదు కనుక, దీనిని మానవులు, వాయువు, పక్షులు తెలియలేరు– అనేది ఒక నిర్వాహం.

ఈ విధంగా కాకుండా, తావి యన్నులక మెల్లామ్ తావి వైయమ్ కొణ్డ ఎన్దాయ్! (ఆనాడు లోకాన్ని అంతటిని స్పృశించి, భూమిని కొలిచిన నాతండ్రీ) (తిరుమాలై–85),

సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాద్,
స భూమిం విశ్వతో వృత్వా అధ్యతిష్ఠ హద్దశాంగులమ్

(పురుషుడనబడే నారాయణుడు లెక్కలేనన్ని శిరస్సులను, లెక్కలేనన్ని నేత్రాలను, అనంతమైన పాదాలను కలవాడు. అతడు భూమిని అన్ని వైపుల చుట్టి, దానికిపైన అనంత యోజనాలు వ్యాపించాడు)

అనే రీతిలో రక్షకుని అభినివేశం రక్ష్యవస్తువు పరిమితిని మించి ఉంటుంది కనుక, మహాబలిచే అపహరింపబడ్డ లోకాలను తిరిగి ఇవ్వడం ఆరంభించిన ఇతడు, ఈ విభూతి అంతటికి రెండే పాదాలను చాలినందున, మహాబలిచే అపహరింపబడడానికి ప్రసక్తి లేని నిత్యవిభూతిని కూడా మూడవ పాదంతో కొలిచాడు –అని ఇంకొక నిర్వాహం. ఈ నిర్వాహం తృతీయమస్య నకిరాదధర్షతి వయశ్చ న పతయంతః పతత్రిణః (ఇతని మూడవ పాదన్యాసాన్ని గూర్చి మానవులు, వాయువులు, పక్షులు కూడా చూడలేవు) అనే మంత్రభాగానికి మిక్కిలి పొసగినది. బ్రహ్మ రుద్రాదులనుండి ఎవరికీ దర్శించడానికి సాధ్యం కానిది కదా, పరమపదం.

12. చతుర్భి స్సాకం నవతిం చ నామభి శ్చక్రం న వృత్తం వ్యతీ నవీవిపత్।
బృహచ్ఛరీరో విమిమాన ఋక్వభి ర్యువా కుమారః ప్రత్యేత్యాహవమ్॥

(ఆ విష్ణువు), వ్యతీన్ వృత్తం చక్రం న = పలు వృత్తాలను కల (గుండ్రని రూపంలోని), చక్రాయుధంవలె, చతుర్భిః సాకం నవతిం చ =తొంభై నాల్గు అవయవాలను, కాలచక్రాన్ని, నామభిః = (తన) నియమనాలతో, ఆవీవిపత్ = తిప్పుతున్నారు, బృహచ్ఛరీరః= పెద్ద శరీరాన్ని కలవాడై, ఋక్వభిః= స్తుతించేవారిచే, విమిమానః= విశేషించి పరిచ్ఛేదింపబడేవాడై (స్తుతింపబడేవాడై), యువా = యౌవనాన్ని కలవాడై, అకుమారః= కొంచెం కౌమారాన్ని కలవాడై, ఆహవమ్= యుద్ధరంగాన్ని, ప్రత్యేతి = పొందుతున్నాడు (చేరుతున్నాడు).

వ్యాఖ్య : తత్ తదిదస్య పౌంస్యం గృణీమసి (ఈ భగవానుని ఆయా పురుషకృత్యాలను పల్కుతాం) అని ఆరంభించి, ముల్లోకాలను కొలిచిన లీలలను గూర్చి గడచిన మంత్రానికి ముందు మంత్రంలో వేదపురుషుడు ప్రస్తావించాడు. దానిని గూర్చి ఏర్పడిన ఒక ఆక్షేపాన్ని ముందు మంత్రం తీర్చింది. ఇక, ఈ ప్రకృతమంత్రం భగవానుని మఱి రెండు పురుషకృత్యాలను తెల్పుతున్నది. అవి ఏవి? అంటే, కాలాన్ని నియమించడం, దేవతలకోసం యుద్ధరంగంలో నిలచి యుద్ధం చేయడం–అనేవి, అవి.

(చతుర్భి స్సాకం నవతిం చ) – తొంభై నాల్గు అవయవాలను కల కాలాన్ని– అని అర్థం. అవి ఏవి ? అంటే, వర్షం (1), అయనాలు (2), ఋతువులు (5), మాసాలు (12), పక్షాలు (24), దినాలు (30), జాములు (8), లగ్నాలు (12), – ఈ విధంగా 94 అవయవాలను కాలం కల్గి ఉన్నది.

(వ్యతీన్ చతుర్భి స్సాకం నవతిమ్)– పలు విధాలైన స్వభావాలను కల 94 కాలావయవాలను,

(చక్రం న వృత్తం అవీవిపత్)– గుండ్రంగా ఉన్నది, పలు వృత్తాలను కల్గినది అయిన సుదర్శన చక్రాన్ని తిప్పడంవలె, కాలచక్రాన్ని కూడా తిప్పుతున్నాడు. సుదర్శన చక్రం పలు అరలను కల్గి ఉండేటట్లే, కాలం కూడా పలు అవయవాలను కల్గిఉన్నది. చక్రం తిరిగేటప్పుడు ఆ అరాలు తిరిగి తిరిగి వచ్చేటట్లు, కాలచక్రావయవాలైన సంవత్సర– అయన– మాసపక్షాదులు కూడా మాటిమాటికి తిరిగి వస్తాయి. అందువల్లే, కాలచక్రం అని లోకంలో వ్యవహరింపబడుతున్నది కదా!

(నామభిః)– నమనప్రకారాలతో – అని అర్థం. నియమన విశేషాలతో– అని తాత్పర్యం. శ్రీసుదర్శనుని శత్రుసంహారం పలు ప్రేరణాలతో పరిభ్రమింపజేసేటట్లుగా, కాలచక్రాన్ని కూడా తన నియమనంతో పరిభ్రమింపజేస్తున్నాడు – అని భావం.

కాలశక్కరత్తాయ్ అని ఆళ్వార్లు భగవానుని సంబోధించారు.

కాలమ్ స పచతే (భారత- మోక్ష-25-9) (కాలాన్ని అతడు పచనం చేస్తున్నాడు—పక్వం చేస్తున్నాడు- నియమిస్తున్నాడు) అని,

కాలస్స ఈయతే పరమోను దేవః అని అదర్వవేదోక్తి,

అహమేవాక్షయః కాలః (గీత-10-33) (అక్షయమైన కాలాన్ని నేనే) అని,

శెన్ఱు శెల్లాదన మున్నిలామ్ కాలమే (తిరువాయ్-3-8-8)

(భూతభవిష్యద్వర్తమాన కాలస్వరూపా! ) అని భగవంతుని కాలచక్ర నిర్వాహకత్వాన్ని ఋషులు, స్వయంగా భగవంతుడు, ఆళ్వార్లు వివరించారు.

ఇక, దేవతలకోసం యుద్ధరంగంలో తాను గాయపడి, వక్షస్సులో బాణప్రహారాలను సహించి, యుద్ధం చేసి, రక్షణం చేసే, భగవానుని పురుషకృత్యాన్ని గూర్చి తెలుపబడుతున్నది.

(బృహచ్ఛరీర:)- గొప్పతనాన్ని పొందిన శరీరాన్ని కల ఇతడు- అని అర్థం.

న భూతసంఘసంస్థానో దేహోస్య పరమాత్మనః

(భారతమ్—శాంతి- 206-60)

(ఈ పరమాత్మ యొక్క తిరుమేని పంచభూతాల సమ్మేళనం వల్ల ఏర్పడినది కాదు) అని,

న తస్య ప్రాకృతా మూర్తిర్మాం సమేదోస్థిసంభవా

(వరాహ-14-41)

(అతని రూపం మాంసం, కొవ్వు, ఎముకలతో ఏర్పడినది, ప్రకృతి సంబంధాన్ని కల్గినది కాదు) అని,

మాశూణా చ్చుడరుడమ్బాయ్

(దోషరహితమైన, గొప్పగా ప్రకాశించే తిరుమేనిని కలవాడై) (తిరువాయ్-3-1-1) అని పల్కిన రీతిలో గొప్పతనాన్ని కల శరీరాన్ని కలవాడితడు.

గొప్పతనాన్ని కల్గినవాడైతే తెలియడానికి సాధ్యం కానివాడై ఉంటాడా? అంటే,

(విమిమానః ఋక్వభిః)- భక్తితో మనస్సులో ఆనందించి, స్తుతించేవారిచే పరిచ్ఛేదింపబడతాడు. భక్తిక్రీతో జనార్దనః (విష్ణుధర్మమ్-3) (జనార్దనుడు భక్తితో వెలకట్టదగినవాడు) అనేటట్లు అపరిచ్ఛేద్యుడైన తనను కూడా పరిచ్ఛేదించి పలుకడానికి వీలయేటట్లుగా భక్తిక్రీతుడవుతున్నాడు. యద్యపి విభుః, తథాపి భక్త్యధీనత్వాత్ స్తుత్యా మీయతే (విభువై ఉన్నా, భక్తిపరతంత్రుడైనందున భక్తిచే స్తుతింపబడుతున్నాడు) అనేది ఇక్కడ సాయణభాష్యం.

(విమిమానః ఋక్వభిః ప్రత్యేతి) - అసురులు మొదలైనవారిచే బాధలను పొందిన దేవతలు, ఋషులు మొదలైనవారి స్తుతులచే కీర్తింపబడేవాడై, వెడుతున్నాడు. ఎక్కడికి వెడుతున్నాడు? అంటే,

(ఆహవమ్)- యుద్ధభూమికి వెడుతున్నాడు. ఎటువంటి తిరుమేనిని కలవాడుగా వెడుతున్నాడు? అంటే,

(యువా కుమారః)- యువా అకుమారః అని పదచ్ఛేదం చేయాలి.

(యువా)- నిత్యయౌవనాన్ని కల తిరుమేనితో వెడుతున్నాడు. యౌవనాన్ని కల తిరుమేని అయితే మొఱటు తిరుమేనిని కలవాడై ఉంటాడా? అంటే,

(అకుమారః)- ఈషత్ కుమారః కొంచెం కౌమారాన్ని కలవాడు-అని భావం. తత్సాదృశ్య మభావశ్చ తదన్యత్వం తదల్పతా, అప్రాశస్త్యం విరోధశ్చ నఞర్థాః షట్ ప్రకీర్తితాః (పోలిక, అభావం, దానికంటే వేరై ఉండడం, అల్పత్వం, తక్కువదనం-ప్రశస్తిని కల్గి ఉండకపోవడం, విరోధం- అనే ఈ ఆఱు నఞ్ అర్థాలు) అనే పలు అర్థాలలో ఇక్కడ నాల్గవది అయిన అల్పత్వమనే అర్థంలో నఞ్ ప్రయోగింపబడింది.

(యువా కుమారః)- యౌవనాన్ని కలవాడు, కొంచెం కౌమారాన్ని కలవాడు. అంటే- కౌమారం అప్పుడే పూర్తి అయి, యౌవనంలో అపుడే అడుగుపెట్టినవాడై, అనన్యాదృశమైన పురుషసౌందర్యాన్ని కలవాడై ఉంటాడని భావం. అరుమ్బినై అలరై (పెరియ తిరు- 7-10-1) (మొగ్గవలె కౌమారాన్ని కలవాడు, అపుడే వికసించే

పూవువలె యౌవన ప్రారంభదశను కలవాడు) అని తిరుమంగై ఆళ్వార్లు ఈ శ్రుతిని వివరించారు. బృహచ్ఛరీరః అనే దానిని మాశూణా చ్చుడరుడమ్బాయ్ అని వివరించిన నమ్మాళ్వార్లు యువా కుమారః అనే శ్రుతిని మలరాదు కువియాదు (పూర్తిగా వికసించని, ముకుళించని) అని వివరించారు. పూవు మొగ్గదశలో ఉండేటపుడు ముడుచుకొని ఉంటుంది కనుక, దాని అందం అంతా స్పష్టంగా చూడడానికి వీలులేదు. వికసించి, కొంచెం సేపయితే, ఆ పూవు వికాసం తరిగిపోతుంది. కనుక, పూర్ణమైన శోభతో అది కన్పించదు. పూర్తిగా వికసించకుండా, ముడుచుకోకుండా, మొగ్గ చివరి దశలోను, పూవు ప్రారంభదశలోను ఉంటే పూర్తిశోభతో పూవు ప్రకాశిస్తుంది. ఆ విధంగానే, భగవంతుడు కూడా కౌమారావస్థ చివరిదశలోను, యౌవనారంభదశలోను ఉండేవాడై, సాటి లేని పురుషసౌందర్యాన్ని కలవాడై ఉంటాడు.

పెరియతిరుమొழி ప్రబంధంలోని అరుమ్బినై యలరై అనే చోట వ్యాఖ్యానంతో ఇరణ్డు అవస్థైయుమ్ ఒరుకాలే శూழ்త్తు క్కొడుక్కలామ్బడి యిరుక్కిఱవనై - యువాకుమారః (యౌవన కౌమారదశలనే రెండిటిని ఒకే సమయంలో కల్గినవాడైనట్లు ఉండేవాడు) అని పెరియవాచ్చాన్పిళ్ళై అనుగ్రహించారు.

మలరాదు కువియాదు అనే తిరువాయ్ మొழி సూక్తి వ్యాఖ్యానంలో, అరుమ్బినై యలరై–ఎన్నుమాపోలే శెవ్వియాఱాద భోగ్యతైయై చ్చొల్లుదల్ (అరుమ్బినై అలరై అనేటట్లు వికాసం తరగని భోగ్యత చెప్పబడింది) అని అనుగ్రహించారు. అరుమ్బినై యలరై– ఎన్నుమ్బడియాయిరుక్కుమ్, యువాకుమారః ఎన్గిఱ పడియే ఏకకాలత్తిల్ ఇరణ్డు అవస్థైయుమ్ శొల్లలాయిరుక్కై (అరుమ్బినై అలరై అనేవిధంగా ఉంటుంది. యువాకుమారః అనే విధంగా ఒకే కాలంలో రెండు దశలను కల్గి ఉన్నదని చెప్పేటట్లు ఉంటుంది) అని నమ్పిళ్ళై ఈడు వ్యాఖ్యానము.

ఈ విధంగా రెండు అవస్థలను కల్గినవాడైతే, యువాకుమారఃఅని ప్రయోగించవలసి ఉండగా, యువా అకుమారః ప్రయోగించడం ద్వారా, యౌవనావస్థ

అధికంగాను, కౌమారావస్థ అల్పంగాను పల్కడంలో ఉద్దేశ్యం ఏమి? అంటే, ప్రతికోటిగా, స్త్రీత్వపూర్ణత కల్గిన లక్ష్మీదేవికి కౌమారావస్థయే అధికంగా ఉంటుంది, యౌవనావస్థ కొంచెం తల చూపినట్లు ఉంటుంది. దీనిని యువతి శ్చ కుమారిణీ (ఈమె కుమారియే కొంచెం యౌవనాన్ని కల్గినది) అనే ప్రమాణం తెల్పుతున్నది. యువతిశ్చ అనేచోట చకారం అప్రాధాన్యాన్ని తెల్పుతున్నది.

తిరుప్పల్లాణ్డులోని –వలమార్బినిల్ వాళ్గిన్ఱ మంగై అనేచోట వ్యాఖ్యానంలోపరమకారుణికులైన పెరియవాచ్చాన్పిళ్ళై– యువతిశ్చ కుమారిణీ అనే పరువాన్ని తెలుపుతున్నది. యువా కుమారః అని ఈ రెండు అవస్థలు ఉన్నాయి కదా, స్వామికి. ఈమెకు కౌమారవస్థ వల్ల మౌగ్ధ్యమే ఉన్నది. యువతి కాబోతున్నది. ఏవిధంగా? అంటే, భోగప్రోతస్సును గూర్చి ప్రస్తావిస్తే ఈమె అలసటకు అతడు సహాయపడవలసిన మౌగ్ధ్య ఈమె కలిగి ఉన్నది అనే విషయాన్ని ఈ మంగై అనే పదం తెల్పుతున్నది– అని ఈ అర్థాన్ని తెలిపారు.

(ఆహవం ప్రత్యేతి) – యుద్ధరంగానికి తానే వెడుతున్నాడు.

అభియాతా ప్రహర్తా చ (రామా–అయో–1–29)

(వెళ్ళి శత్రువులతో యుద్ధం చేసేవాడు –శ్రీరాముడు) అని,

శెన్ఱు కొన్ఱు వెన్ఱి కొణ్డ వీరనే! (తిరుచ్చంద–56)

(వెళ్ళి, శత్రువును వధించి జయించిన వీరుడా! ) అని చెప్పబడేవాడు కదా, ఇతడు. శత్రువులు దండెత్తి వచ్చేవరకు వేచి, ఆలస్యం చేసే వీరుడు కాడు. వారుండే చోటుకు పోయి, పోరు సల్పి, జయించే ఉత్తమవీరుడు– అని ఇది తెల్పుతున్నది.

ఈ విధంగా ఈ మంత్రంలో కాలచక్రనియంతృత్వం, దేవతలకోసం సుకుమారమైన తిరుమేనిలో బాణప్రహారాలను భరించి పోరు సలిపే పురుషోచితకృత్యాలు ప్రస్తావింపబడ్డాయి.

13. భవామిత్రో న శేవ్యో ఘృతాసుతి ర్విభూతద్యుమ్న ఏవయా ఉ సప్రథాః

**అధా తే విష్ణో విదుషా చిదర్ధ్యః స్తోమో యజ్ఞశ్చ రాధ్యో హవిష్మతా ॥**

విష్ణో! = ఓ విష్ణూ! , మిత్రః న = మిత్రునివలె, శేవ్యః= సుఖాన్ని ఇచ్చేవాడవై, ఘృతాసుతిః= (కరుణ) జలాన్ని ప్రవహింపజేసేవాడవై, విభూతద్యుమ్నః= గొప్ప పొగడ్తను కీర్తిని కలవాడవై, ఏవయాః= రక్షణను పొందించేవాడవై, సుప్రథాః= అన్ని విధాలుగాను గొప్పతనాన్ని కలవాడవై, భవ = (మాపట్ల) నీవు కావాలి, అధా= ఆ కారణంచేత, తే స్తోమః= విదుషా (నీ మహిమను) తెలిసే చేతనునిచే, అర్ధః = పలుమార్లు చేయవలసిన, హవిష్మతా = హోమాన్ని చేసే యజమానిచే, తే యజ్ఞః చ = నీ విషయంలోని యజ్ఞంకూడా, రాధ్యః = చేయబడాలి.

వ్యాఖ్య : ఈ మంత్రంలో భగవత్కటాక్షం ప్రార్థింపబడుతున్నది.

(భవా మిత్రో న శేవ్యః)– నీవు మిత్రునివలె సుఖాన్ని కల్గించేవాడవు కావాలి. (మిత్రః)– మితాత్ త్రాయతే ఇతి మిత్రః (మితమనబడే దుఃఖంనుండి రక్షించేవాడు మిత్రుడు అనబడుతున్నాడు.) అనే వ్యుత్పత్తిద్వారా మిత్రశబ్దం స్నేహితుని తెల్పుతుంది. లేక, ఇది సూర్యుని తెల్పుతుందని కూడా చెప్పవచ్చు. చీకటిని తీర్చి, వెల్గును, ఆనందాన్ని కల్గించే సూర్యునివలె, అజ్ఞానాంధకారాన్ని పోగొట్టి, యథార్థజ్ఞానమనే వెలుగును ఇవ్వాలి– అని భావం.

(ఘృతాసుతిః)– ఘృతమ్ ఆసూయతే యేన– కరుణావృష్టిని కురిపించేవాడు– అని అర్థం. ఘృతమనే పదం నీటిని కూడా తెల్పుతుంది. ఇక్కడ కరుణాజల ప్రవాహాన్ని తెల్పుతుంది. లేక, ఘృతమ్ అనే పదం నేతిని తెల్పుతున్నదని, ఘృత మాసూయతే యస్మై అనే వ్యుత్పత్తిద్వారా యాగంలో అగ్నిలో సమర్పించే నేతిని భుజించేవాడు– అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

(విభూతద్యుమ్నః)- గొప్ప కీర్తిని కలవాడు. నికరిల్ పుకழாయ్ (తిరువాయ్-6-10-10) (సాటిలేని కీర్తిని కలవాడు) అని పొగడబడేవాడు కదా ఇతడు. అధికమైన అన్నాన్ని యాగంలో పూజించేవాడు- అనికూడా అర్థం.
(ఏవయాః)- రక్షణస్య మిశ్రయితా ప్రాపయితా - రక్షించేవాడని భావం.

న హి పాలన సామర్థ్యమృతే సర్వేశ్వరం హరిమ్,
స్థితౌ స్థితం మహాభాగ! భవదన్యస్య కస్యచిత్ (విష్ణుపు-1-22-24)

(మహాత్మా! రక్షణను నిలకడగా చేసే సర్వేశ్వరుడైన హరిని తప్ప వేరొకనికి రక్షణలో సామర్థ్యం లేదు) అని పరాశరమహర్షి అన్నారు. యజ్ఞసంరక్షకుడని అర్థం.

సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభుః (గీత-9-24) (నేనే అన్ని యజ్ఞాలకు భోక్తను, ప్రభువును కూడా) అని,

యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః,
యజ్ఞభృత్ యజ్ఞకృత్ యజ్ఞీ యజ్ఞభుక్ యజ్ఞసాధనః,
యజ్ఞాంతకృత్ యజ్ఞ గుహ్య మన్న మన్నాద ఏవ చ (విష్ణుసహస్రనామ స్తోత్రమ్-971-984)

(యజ్ఞమై, యజ్ఞపతియై, యాగం చేసేవాడై, యాగాన్ని అంగంగా కలవాడై, యజ్ఞాన్ని వహించేవాడై, యజ్ఞాన్ని పోషించేవాడై, యజ్ఞాన్ని సృష్టించేవాడై, యజ్ఞశేషియై, యజ్ఞభోక్తమై, తనను పొందడానికి యజ్ఞాన్ని సాధనంగా కలవాడై, యజ్ఞఫలమైన జ్ఞానాన్ని ఇచ్చేవాడై, యాగరహస్యమై, అన్నమై, అన్నాన్ని భుజించేవాడై ఉండేవాడితడే) అని,

సర్వే వేదాః సర్వవేద్యాః సశాస్త్రాః సర్వే యజ్ఞాః సర్వ ఇజ్యాశ్చ కృష్ణః|
విదుః కృష్ణం బ్రాహ్మణా స్తత్త్వతో యే తేషాం రాజన్! సర్వ యజ్ఞాస్సమాసప్తాః||

(రాజా! అన్ని వేదాలు, తెలిపే శాస్త్రాలతో కూడిన, తెలియబడే అన్ని అర్థాలు, అన్ని యజ్ఞాలతో కూడ యజ్ఞాలలో ఆరాధింపబడే అందఱు దేవతలు - శ్రీకృష్ణుడే. శ్రీకృష్ణుని యథాతథంగా తెలిసిన బ్రాహ్మణులకు అన్ని యజ్ఞాలు చేసి పూర్తి అయినట్లే) అని,

జ్యోతీంషి శుక్లాని చ యాని లోకే త్రయో లోకా లోకపాలా స్త్రయీ చ|
త్రయోగ్నయశ్చ చాహుతయశ్చ పంచ సర్వే దేవా దేవకీపుత్ర ఏవ||

(లోకంలో కన్పించే తెల్లని జ్యోతిస్సులు, ముల్లోకాలు, లోకపాలకులు, వేదం, మూడు అగ్నులు, అయిదు ఆహుతులు, అందఱు దేవతలు - దేవకీపుత్రుడే) అనే విధంగా యజ్ఞాన్ని పలు రీతులలో రక్షించేవాడితడే.

(సప్రథాః)-సర్వతః పృథుః- అన్ని విధాలుగా గొప్పవాడై ఉండేవాడు- అని అర్థం. స్వరూపంలో ఇతడు ఒక్కడే విభువై ఉన్నందున స్వరూపంతో గొప్పవాడితడే. అస్త్రభూషణాధ్యాయంలో(విష్ణుపురాణం) తెల్పిన రీతిలో లోకాన్ని అంతటిని ధరించేదై, సర్వమంగళాకార అయిన లక్ష్మికి వాసస్థానమై, పర-వ్యూహ- విభవ -అంతర్యామి - అర్చా అనే అయిదు విభాగాలను కల్గినదై, న తస్య ప్రాకృతా మూర్తి (అతని రూపం ప్రాకృతమైనది కాదు), న భూత సంఘసంస్థానో దేహోస్య పరమాత్మనః (ఈ పరమాత్మ యొక్క దేహం పృథివ్యాది భూతాల కలయికతో ఏర్పడినది కాదు) అనే రీతిలో అప్రాకృతమై, ఆదిత్యవర్ణమ్ (సూర్యుని వంటి వర్ణాన్ని కల్గినది), విద్యుతః పురుషాత్ (విద్యుద్వర్ణుడైన పురుషునివల్ల) అని, నీలతోయదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్కరా (నీలమేఘాన్ని గ్రసించిన విద్యుల్లతవలె కాంతిని కల్గినది) అని,

"తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి"

(ప్రకాశించే, పరమాత్మను అనుసరించియే అన్ని జ్యోతిస్సులు ప్రకాశిస్తున్నాయి) ,

**నారాయణః పరో జ్యోతి:** (నారాయణుడు గొప్ప జ్యోతిస్సు),

**పరం జ్యోతి రుపసంపద్య** (గొప్ప జ్యోతిస్స్వరూపుడైన పరమాత్మను చేరి) అని చెప్పబడే రీతిలో నిత్యముక్తుల రూపాన్ని సూర్యుని ముందు మిణుగురు పురుగుతో సాటిగా చేసే గొప్ప ప్రకాశాన్ని కల్గినదై ఉన్నందున, రూపంలో గొప్పవాడితడే.

ధాతూనామివ శైలేంద్రో గుణానామాకరో మహాన్ (రామాయణమ్)

(బంగారం, వెండి మొదలైన ధాతువులకు పర్వతం గొప్ప ఆకరమైనట్లు, గుణాలకు గొప్పదైన ఆకరమై ఉండేవాడు) అని,

**యథా రత్నాని జలధే రసంఖ్యేయాని పుత్రక,**
**తథా గుణా హ్యనంతస్య అసంఖ్యేయో మహాత్మనః**

(నాయనా! సముద్రంలోని రత్నాలు లెక్కలేనివిగా ఉన్నట్లే, మహాత్ముడైన అనంతుని గుణాలు అంతు లేనివి),

**సమస్తకల్యాణగుణాత్మకోసౌ** (విష్ణుపురాణమ్)

(అన్ని కల్యాణగుణాలను సహజంగా కల్గినవాడితడు) అని పలికే రీతిలో గుణాలతో గొప్పవాడితడే. అందుచేత ఈ విధంగా లక్ష్మినుండి ఆరంభించి, బ్రహ్మారుద్రాదుల మధ్యగా, గడ్డిపోచ పర్యంతంగా ఉండే సమస్తచేతనుల కంటే అన్ని విధాలుగా గొప్పవాడైనందున సప్రథాః అని ఇతడు కీర్తింపబడుతున్నాడు.

(**మిత్రో న శేవ్యో ఘృతాసుతి ర్విభూతద్యుమ్న ఏవ యా ఉ సుప్రథాః భవ**) – స్నేహితునివలె ఆనందాన్ని కల్గించేవాడవై, కరుణావృష్టిని కురిసేవాడవై, గొప్ప కీర్తిమంతుడవై, సర్వరక్షకుడవై, సర్వాధికుడవై మాకు నీవు కావాలి. ఇటువంటివాడవై మాకు సాక్షాత్కరించాలి.

(అథో తే విష్ణో విదుషా చిదర్ధ్యః స్తోమః) – ఇటువంటి గొప్పతనాన్ని కల్గి ఉండే కారణంచేత నీ మహిమను తెలిసే చేతనునిచే నీ విషయంగా స్తుతి పలుమార్లు చేయబడాలి. ఒకసారి స్తుతిస్తే, నీ గొప్పతనానికి అది చాలదు. పలుమార్లు స్తుతించాలి. (యజ్ఞశ్చ రాధ్యో హవిష్మతా)– హోమం చేసే యజమానిచేత నీ విషయంలో యజ్ఞం కూడా పలుమార్లు అనుష్ఠింపబడాలి.

14. యః పూర్వ్యాయ వేధసే నవీయసే సుమజ్జానయే విష్ణవే దదాశతి ।
యో జాతమస్య మహతో మహి బ్రవత్ సేదుశ్రవోభి ర్యుజ్యం చిదభ్యసత్ ॥

యః= ఏ మానవుడు, పూర్వ్యాయ =మొదటివాడు, వేధసే= పలు విధాలైన లోకాలను సృష్టించేవాడు, నవీయసే =(ఎల్లప్పుడు) నవీనుడు, సుమజ్జానయే = లక్ష్మీనాథుడై ఉండేవాడైన, విష్ణవే = విష్ణువునకు, దదాశతి = తనను సమర్పించుకొంటున్నాడో, (అతడు), మహతః= మహానుభావుడైన, అస్య = ఈ పరమాత్మయొక్క, మహి = పూజింపదగిన, జాతం= జన్మను, బ్రవత్ =(ఎవడు) సంకీర్తిస్తున్నాడో, సేదు= అతడు, శ్రవోభిః= గొప్ప కీర్తిని కలవాడై, యుజ్యంచిత్ (అందఱు) పొందదగిన ఈ పరమాత్మయొక్క పరమపదానికి, అభి అసత్ =అభిముఖంగా వెడుతున్నాడు.

వ్యాఖ్య : ఈ పరమాత్మను పొందడానికి కొన్ని సాధనాలను తెలుపడానికి ఆరంభించిన వేదపురుషుడు, శరణాగతి, అవతారరహస్యజ్ఞానం అనే రెండు సాధనాలను ఈ మంత్రంలో దర్శింపజేస్తున్నాడు.

(యః)– ఏ చేతనుడు,

(పూర్వ్యాయ) – పూర్వకాలానికి చెందినవానికి– అని అర్థం. యో బ్రహ్మాణం విదధాతి పూర్వమ్ (ఎవడు బ్రహ్మను ముందు సృష్ట్యారంభంలో సృష్టించాడో) అనేవిధంగా బ్రహ్మకు ముందు ఉన్నవానిని,నిత్యుడై ఉండేవానిని– అని భావం.

(పూర్వ్యాయ)– పూర్వో యో దేవేభ్యో జాతః (ఎవడు అనాది సిద్ధుడై ఉన్నా, దేవతలకోసం అవతరించినవాడయ్యాడో) అని పురుషసూక్తంలో చెప్పబడిన రీతిలో ఆదికాలంలో అవతరించినవానికి–అని కూడా భావం. ఇందువల్ల, శరణ్యునకు ఉండవలసిన సౌలభ్య– సౌశీల్య– వాత్సల్యాలను కలవానికి–– అని తెలుపబడింది.

(వేధసే)– పలు విధాలుగా జగత్తును సృష్టించినవానికి– అని అర్థం. ఇందువల్ల స్వామిత్వం తెలుపబడింది.

(నవీయసే)– ఎల్లప్పుడు నవీనుడై ఉండేవాడు.

(పూర్వ్యాయ సవీయసే)– ప్రాచీనుడైనా, సూతనుడై ఉండేవాడు. ఎప్పొழుదుమ్ నాలళ్ తిఙ్గళ్ ఆణ్డాழி ఊழிతొఱుమ్, అప్పొழుదైక్కప్పొழுదు ఎన్నరావముదమే (తిరువాయ్–2–5–4) (ఎల్లప్పుడు దినాలు, మాసాలు, సంవత్సరాలు, యుగాలు, యుగాలుగా ఎప్పటికప్పుడు నాకు తృప్తిని కల్గించని అమృతమై ఉండేవాడు) అని దీనిని వేదమ్ తమిழ் శెయ్ ద మాఱన్(శఠకోపమునులు) వివరించారు.

(నవీయసే)– స్వరూపరూపగుణాలలో నిత్యనూతనుడై ఉండేవానికి– అని అర్థం. ఇందువల్ల విలక్షణవిగ్రహయోగం, భోగ్యత చెప్పబడింది.

(సుమజ్జానయే) –సుతరాం మాదయతీతి సుమత్. తాదృశీ జాయా యస్య స తథోక్తః, తస్మై సకలజగన్మాదనశీల శ్రీపతయే (మిక్కిలిగా వ్యామోహాన్ని కల్గించేవి కనుక లక్ష్మీదేవి సుమత్ అనబడుతున్నది. ఆమెను పత్నిగా కలవాడు సుమజ్జానిః అవుతున్నాడు. లోకాన్ని అంతటిని వ్యామోహపరచే లక్ష్మీదేవికి పతి అయినవానికి) అనేది సాయణాచార్యులు చూపిన వ్యుత్పత్తి. తన విభూతి అయిన సంపదతో లోకాన్ని

మోహింపజేసినందున సుమత్ అనే పేరు లక్ష్మీదేవికి పొసగేటట్లు చేశాడు, పరమాత్మ. తన స్వరూపరూపగుణాలతో భగవంతుని వ్యామోహింపజేస్తుంది కనుక, లక్ష్మీదేవి సుమత్ అని అనబడుతున్నది. అనేది మిక్కిలి సరసమైనది. ఈమె స్వరూపం– పరమాత్మను న జీవేయం క్షణమపి వినా తామ్ (రామా–యుద్ధ–66–10) (ఆ సీతాదేవిని విడచి నేను ఒక్క క్షణం కూడా జీవించలేను) అనేటట్లు చేస్తుంది. రూపగుణాలను చూస్తే అసితేక్షణామ్ వినా న జీవేయం క్షణమపి (నల్లని కన్నులను కల ఆమెను విడచి ఒక్కక్షణమైనా నేను జీవించలేను),

పురేవ మే చారుదతీ మనిందితాం దిశంతి సీతాం యది నాద్య మైథిలీమ్,
సదేవగంధర్వ మనుష్యపన్నగం జగత్ సమస్తం పరివర్తయామ్యహమ్
(రామా– ఆరణ్య)

(పూర్వంవలె, అందమైన చిఱునవ్వును కల్గినది, దోషరహితమైనది, మిథిలా రాజకుమారి అయిన సీతను చూపించనట్లయితే, దేవతలు, గంధర్వులు, మానవులు, సర్పాలుమొదలైనవానితో పాటుగా పర్వతాలతో కూడిన లోకాన్ని తలకిందులుగా చేస్తాను) అని ఈమె తన విశ్లేషంతో తనను విభూతిని నశింపజేయడంలో కూడా పురికొల్పుతుంది. అందువల్ల, ఈమె స్వరూపరూప గుణాలలో వ్యామోహాన్ని పొంది భగవంతుడుంటాడు– అనేది మిక్కిలి పొసగుతుంది.

అల్లిమలర్మకళ్ పోకమయక్కుక్కళాకియుమ్ (తిరువాయ్ -3-108) (పద్మంలో ఉండే కన్య అయిన లక్ష్మీదేవి భోగంలో వ్యామోహాన్ని పొందుతాడు) అని ఆళ్వార్లు అన్నారు. శరణాగతిని గూర్చి పలికే ఈ ప్రకరణంలో లక్ష్మీసంబంధాన్ని పల్కినందున పురుషకారస్వరూపిణి అయిన ఈమెను పురస్కరించుకొనే శరణు పొందాలనే అర్థం ఇక్కడ తెలుపబడుతున్నది. అందులోను, పిరాట్టిని సుమత్ (స్వరూపరూప గుణాలతో భగవంతుని మిక్కిలి వ్యామోహపరచేది) అని అన్నందున,

భగవంతుని వద్ద ఈమె చేసే పురుషకారం ఏ నాటికీ వ్యర్థం కాదు-అని తెలుపబడుతున్నది.

(విష్ణవే) - అర్చావతార పర్యంతమైన అవతారాలలో అంతటా వ్యాపించి ఉండేవానికి –అని అర్థం. తతో విష్వఙ్ వ్యక్రామత్ సాశనానశనే అభి (ఆ పిమ్మట చేతనులకోసం అంతట అవతరించడం ద్వారా లోకంలో వ్యాపిస్తున్నాడు )అని పురుషసూక్తంలో చెప్పిన అవతారవ్యాప్తియే ఇక్కడ చెప్పబడుతున్నది. ఇందువల్ల, శరణు పొందాలని తలచినవానికి ఇతనిని అన్వేషించి చాలా దూరం వెళ్ళనక్కరలే కుండా కుటీకుంజాలన్నిటిలో వేంచేసి ఉండేవాడు- అని తెలుపబడుతున్నది.

(యః దదాశతి)- ఎవడు తనను అనుగ్రహిస్తున్నాడో- అని అర్థం. ఎవడు ఆత్మసమర్పణం చేస్తున్నాడో- అని తాత్పర్యం.

పితరం మాతరం దారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్,
రత్నాని ధనధన్యాని క్షేత్రాణి చ గృహాణి చ,
సర్వధర్మాంశ్చ సంత్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్,
లోకవిక్రాంతచరణౌ శరణం తే వ్రజం విభో

(స్వామీ! తండ్రి, తల్లి, భార్యలు, పుత్రులు, బంధువులు, స్నేహితులు, గురువులు, రత్నాలు, ధనధాన్యాలు, క్షేత్రాలు, గృహాలు, ఇంకా అన్ని ఉపాయాలు కైవల్యంతో కూడిన అన్ని ఫలాలు- అనే వీనిని అన్నిటిని విడచి, లోకాలను కొలిచిన నీ శ్రీచరణాలను శరణు పొందాను) అని,

అహ మస్మ్యపరాధానా మాలయోఽకించనోఽగతిః,
త్వమేవోపాయభూతో మే భవ

(నేను దోషాలన్నిటికి ఆకరమై ఉండేవాడను, ఏ ఉపాయం లేనివాడను, అకించనుడను, నీవే నాకు ఉపాయంగా కావాలి అని పలికే రీతిలో ఎవడు సర్వేశ్వరుని వద్ద తన ఆత్మను సమర్పించి శరణు పొందుతున్నాడో) అని భావం.

ఈ విధంగా ఇంతవరకు

**తస్మాన్న్యాస మేషాం తపసా మతిరిక్త మాహుః**

(అందువల్ల, ఈ సాధనాలన్నిటిలో శరణాగతినే గొప్ప సాధనంగా పల్కుతారు) అని చాలా గొప్ప సాధనంగా నారాయణవల్లిలో శరణాగతి అనే సాధనం చెప్పబడింది.

ఈ శరణాగతిలో కూడా మహావిశ్వాస పూర్వకం తదేకోపాయతాయాచ్ఞా ప్రపత్తిః శరణాగతిః (మహావిశ్వాసాన్ని పురస్కరించుకొని ఆ భగవానుడు ఒక్కడే ఉపాయమై ప్రార్థించడం ప్రపత్తి అని, శరణాగతి అని చెప్పబడుతున్నది) అనేవిధంగా మహావిశ్వాసం ఆవశ్యకమైనందున, అది పలువురికి కల్గడం దుర్లభం కనుక, ఇంకా కొన్ని సుకరోపాయాలను తెలుపాలని ఆరంభించి, అందులో మునుముందుగా అవతారరహస్య జ్ఞానమనే ఉపాయాన్ని వేదపురుషుడు పల్కుతున్నాడు.

(**యో జాత మస్య మహతో మహి బ్రవత్**)– మిక్కిలి గొప్పవాడైన ఇతని చాలా గొప్ప జన్మను గూర్చి ఎవడు పల్కుతున్నాడో– అని అర్థం.

**జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః,**
**త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోర్జున!** (గీత–4–9)

(అర్జునా! నా అప్రాకృతమైన జన్మను, కర్మలను ఈ విధంగా ఎవడు యథాతథంగా తెలిసికొంటున్నాడో, అతడు ఈ దేహాన్ని వీడి, మఱు జన్మను పొందడం లేదు) అని ఈ వాక్యభాగం గీతలో శ్రీకృష్ణునిచే వివరింపబడింది.

(**మహతః అస్య జాతమ్**)– చాలా గొప్పదైన ఇతని జన్మను గూర్చి–అని అర్థం.

**పితా పుత్రేణ పితృమాన్ యోనియోనౌ నావేదవిన్మనుతే తం బృహంతమ్**

(లోకం అంతటికి తండ్రి అయినవాడు తన కుమారుని ఒకనిని తనకు తండ్రిగా చేసికొని జన్మిస్తున్నాడు. వేదాన్ని తెలియనివాడు అతనిని గొప్పవాడని

తెలియలేడు) అని వేదంలో చెప్పబడినట్లుగా చాలా గొప్పవాడైన అతని జన్మ- అని భావం.

జన్మ మే దివ్యమ్ (నా జన్మ అప్రాకృతమైనది) అని అతనిచేతనే పొగడబడిన అప్రాకృతమైన జన్మ. కర్మమూలకంగా ఏర్పడే, మిగిలిన వారి జన్మల వలె కాకుండా,

**అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్,**
**ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా**

(జన్మ లేనివాడనై, నాశం లేనివాడనై, భూతాలకు ఈశ్వరుడనై ఉంటూనే, నా స్వభావాన్ని ఆశ్రయించి ఉంటూనే, నా సంకల్పంతో గొప్పగా జన్మిస్తున్నాను) అనే విధంగా ఇచ్ఛతో ఏర్పడే జన్మ.

(మహి జాతమ్)- స్వార్థంగా కాకుండా, పరార్థమైనందున గొప్ప జన్మ.

**యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత!**
**అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్,**
**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే** (గీత4-7-8)

(భారతా! ఎపుడెపుడు ధర్మానికి గ్లాని కల్గుతుందో, అధర్మానికి వృద్ధి కల్గుతుందో, అపుడపుడు నన్ను నేనే అవతరింపజేసికొంటాను. సత్పురుషులను రక్షించడం కోసం, దుర్మార్గులను నశింపజేయడం కోసం, ధర్మాన్ని సుస్థాపించడం కోసం ప్రతియుగంలోను నేను సంభవిస్తాను. గొప్పతనాన్ని అప్రాకృతమహిమను- కలవాడనై జన్మిస్తాను) అనేవిధంగా ఇతని జన్మ పరార్థమై ఉంటుందికదా!

(యః అస్య జాతం బ్రవత్) - ఎవడు ఈ పరమపురుషుని జన్మను గూర్చి పల్కుతున్నాడో- అని అర్థం. మనః పూర్వో వాగుత్తరః (మొదట మనస్సు, తరువాత వాక్కు ప్రవర్తిస్తున్నాయి) అని వేదం పల్కుతున్నందున, అవతారరహస్యజ్ఞానాన్ని తాను మొదట గ్రహించి, పిఅన్ద వాఅమ్ (అవతరించిన క్రమం) అని ఎత్తిఅమ్ (ఎంత

ఆశ్చర్యకరమైనది! ) అని ఆళ్వార్లు పల్కినట్లుగా, అందులో అభినివేశాన్ని పొంది, ఇతరులకు దానినిగూర్చి ఎవడు ఉపదేశిస్తాడో– అని అర్థం. ఇక్కడ అర్థసిద్ధమైన జ్ఞానాన్ని ఏవం యో వేత్తి (ఎవడు ఈవిధంగా తెలిసికొంటున్నాడో) అని గీతాచార్యుడు వ్యక్తం చేశాడు.

ఈ విధంగా ఇంతవరకు శరణాగతి, అవతారరహస్యజ్ఞానం– అనే రెండు ఉపాయాలు తెలుపబడ్డాయి. యః పూర్వ్యాయ, యో జాతమస్య అనే ప్రయోగాలలోని రెండు యచ్ఛబ్దాలు ప్రయోగింపబడినందున, ఈ రెండు ప్రత్యేకోపాయాలు. వానిని అనుష్ఠించేవారు వేర్వేరు –అని తెలుపబడింది.

ఇక, ఈ రెండు ఉపాయాలకు సాధారణ (సమానమైన) ఫలం తెలుపబడుతున్నది.

(సేదు)– సోఽపి– అతడు కూడ –అని అర్థం. ఉ' అనే శబ్దం అపి శబ్ద పర్యాయం. ఇద్దరిని సముచ్చీకరిస్తుంది. ఆత్మసమర్పణం చేసేవాడు, అవతార రహస్యజ్ఞానం కలవాడు –అనే ఇద్దరు,

(శ్రవోభిః) కీర్తితో కూడినవారై– అని అర్థం. ఈలోకంలో ఉండేటపుడు గొప్ప కీర్తిని కలవాడై, వాழ్వర్ వాழ்వెయ్ దు కాలమ్ పుకழ్వే (తిరువాయ్–3–3–11) (లోకం కీర్తించేటట్లుగా గొప్ప ఉజ్జీవనాన్ని పొంది) అనే ఫలాన్ని ఇహలోకంలో పొంది,

(యుజ్యం చిత్)– అందఱు చేరదగిన పరమపదాన్ని– అని అర్థం. వైకున్దమ్ పుకువదు మణ్ణవర్ విదియే (తిరువాయ్–10–9–9) (వైకుంఠాన్ని చేరడం మానవులకు విధికదా! ఆహా! ) అనబడే పరమపదాన్ని,

(అభ్యసత్)– అభిలషించి, చేరుతున్నాడు.

15. తము స్తోతారః పూర్వ్యం యథా విద ఋతస్య గర్భం జనుషా పిపర్తన।
ఆస్య జానంతో నామ చిద్వివక్తన మహస్తే విష్ణో సుమతిం భజామహే॥

స్తోతారః =స్తుతించేవారలారా, పూర్వ్యం= అనాదికాలంగా, ఋతస్య గర్భం =జలానికి ఉత్పాదకుడైన, తమ్ ఉ =ఆ విష్ణువునే, యథా విద= తెలిసిన రీతిలో, జనుషా= నిరుపాధికంగా, పిపర్తన = (స్తుతితో), సంతోషింపజేయండి, అస్య = = ఈ విష్ణువు యొక్క, నామ = : తిరునామాన్ని, జానంతః= తెలిసినవారలారా! , ఆ= అంతటా, వివక్తన = (ఆ నామాన్ని) సంకీర్తనం చేయండి, విష్ణో= ఓ విష్ణూ! , మహః తే గొప్పవాడవైన నీయొక్క, సుమతిం = మంచి జ్ఞానమనే భక్తిని, భజామహే= పొందుతాము.

వ్యాఖ్య : భగవానుని పొందడానికి సాధనమై ఉండే స్తుతి, తిరునామసంకీర్తనం, భక్తి- అనే ఉపాయాలు ఈ మంత్రంలో ఉపదేశింపబడుతున్నాయి.

(స్తోతారః)- స్తుతించడం తెలిసిన విద్వాంసులారా! ,

(తమ్ ఉ పిపర్తన) మీరు స్తుతులతో అతనినే సంతోషింపజేయండి. మిగిలిన వారిని స్తుతిస్తే ఉపయోగం లేదు.

ఉళనాకవే ఎణ్ణి తన్నై యొన్రాక త్తన్ శెల్వత్తై
వళనా మదిక్కుమ్ ఇమ్మానిడత్తై క్కవిపాడి ఎన్?

(అసత్కల్పమైన తన సంపదను చాలా గొప్పగా భావించి, తమ అభిమానించే ఈ మానవాధములను స్తుతిస్తే ఏమి ప్రయోజనం?)

ఒ**ళి**వొన్రిల్లాద పల్లూ**ళి** తోరూ**ళి** నిలావ ప్పోయ్
వ**ళి**యై త్తరుమ్ నీజ్గళ్ వానవరీశనై నిఱ్క ప్పోయ్,
క**ళి**య మిక నల్ల వాన్ కవికొణ్డు పులవీర్ కాళ్!
ఇ**ళి**యక్కరుది ఓర్ మానిడమ్ పాడలెన్నావదే! ,

(తీరిక అనేది కొంచెం కూడా లేకుండా కాలతత్వం ఉన్నంతవరకు స్థిరంగా అనుభవించేటట్లుగా కొనసాగే కైంకర్యాన్నిమనకు ప్రసాదించే దేవాధిదేవుడు ఉండగా, ఆయనను కాదని, మిక్కిలి మధురమైన దివ్యమైన కవిత్వంతో, ఓ పండితులారా

అధోగతి పొందాలని తలచుకొని, ఒక మానవాధముని కీర్తిస్తే మీకు ఏమి ప్రయోజనం కలుగుతుంది?)

ఎన్నావదెత్తనై నాళైక్కు పోవ్దుమ్ పులవీర్ కాళ్!
మన్నా మనిశరై ప్పాడి పడైక్కుమ్ పెరుమ్ పొరుళ్!
మిన్నార్ మణిముడి విణ్ణవర్ తాదైయై ప్పాడినాల్
తన్నాకవే కొణ్డు శన్మమ్ శెయ్యామైయుమ్ కొళ్ళుమే,

(ఓ కవులారా! అల్పాయుష్కులైన మానవులను స్తుతించి, దానివల్ల మీరు సంపాదించే సంపద వల్ల ఏమి లాభం? అది ఎన్నాళ్లు నిలిచి ఉంటుంది? కాంతి ప్రకాశించే రత్నకిరీటాన్ని దాల్చినవాడు, దేవాధి దేవుడైన స్వామిని కీర్తిస్తే, ఆయన మిమ్ములను తన వారినిగా గ్రహించి, మీకు జన్మ అనేది లేకుండా చేస్తాడు, మిమ్ములను అంగీకరిస్తాడు.)

కొళ్ళుమ్ పయనిల్లై కుప్పై కిళర్ త్తన్న శెల్వత్తై
వళ్ళల్ పుకున్దు నుమ్ వాయ్ మై యిழக్కుమ్ పులవీర్ కాళ్!
కొళ్ళ క్కుఱైవిలన్ వేణ్డిற్றెల్లామ్ తరుమ్ కోదిల్
ఎన్ వళ్ళల్ మణివణ్ణన్ తన్నై క్కవిశొల్ల నమ్మినో,

(మీరు పొందే ప్రయోజనం అనేది ఏ కొంచెం లేకుండా ఉండేటట్లుగా, పెంట కుప్పను కలియబెట్టిన విధంగా, దోషాలనే నిండుగా కల ఒక క్షుద్రుడైన ధనికుడి ఉద్దేశించి, ఓ ఉదారుడా! అని కీర్తించి, మీరు మీ సత్యమైన వాక్కును పోగొట్టుకునే పండితులారా! మీరు పలికే పొగడ్తలకు తగిన గుణపూర్తిని కలవాడు, మీరు కోరినదానిని అంతటిని ఇచ్చేవాడు, ఏ దోషం లేనివాడు, నాకు గొప్ప ఉపకారకుడు, ఇంద్రనీలమణి వర్ణంవంటి వర్ణాన్ని కలిగినవాడైన స్వామిని కీర్తించండి)

ఇమ్మణ్ణులకిల్ శెల్వరిపోవ్దిల్లై నోక్కినోమ్,

**నుమ్ మిన్ కవికొణ్డు నుమ్ నుమిట్టా దెయ్ వ మేత్తినాల్,**

**శెమ్మిన్ శుడర్ ముడి ఎన్ తిరుమాలుక్కు చ్చేరుమే –**

(ఓ పండితులారా! రండి. మీరు శ్రమ శరీరాన్ని శ్రమ పెట్టుకుని పాట్లు పడి అయినా జీవించండి. తప్పులేదు. ప్రవాహ రూపమైన, నిత్యమైన ఈ లోకంలో మీకు చాలినంత ధనాన్ని ఇవ్వగలిగిన శ్రీమంతులు ఎవరూ లేరు. ఇప్పుడు అంతా అన్వేషించి చూశాము. మీరు మీ మధురమైన పాటలతో మీకు ఇష్టమైన దేవతను స్తుతించినప్పటికీ, ఆ స్తుతి వాక్యాలలో మీరు చెప్పే గుణాలు వారిలో లేవు, అవి, విలక్షణమైన కాంతితో కలిగే కిరీటాన్ని కలిగిన నా స్వామి అయిన లక్ష్మీనాథునికే అన్వయిస్తాయి.)

అని నమ్మాళ్వార్లు పల్కిన రీతిలో భగవంతుడినే స్తుతించదగినట్లుగా అతనికి ఉండే గొప్పతనం ఏమి? అంటే,

(పూర్వ్యమ్) – అనాదిసిద్ధుడైనవాడని అర్థం.

(ఋతస్య గర్భమ్) – మొదట జలాన్ని సృష్టించినవానిని– అని, అప ఏవ ససర్జాథౌ (మొదట జలాన్ని సృష్టించాడు) అని,

**తానోర్ పెరునీర్ తన్నుళ్ళే తోఱ్ఱి అదనుళ్ కణ్వాళరుమ్ వానోర్ పెరుమాన్**

(గొప్పదైన సాటిలేని ప్రళయజలంలో ఆవిర్భవించి, అందులో శయనించి ఉండే నిత్యసూరినాథుడు) అనే రీతిలో ఇక్కడ జలాన్ని గూర్చి పల్కడం మిగిలిన అన్ని వస్తువులకు ఉపలక్షణం. సర్వస్రష్ట అయినందున ఇతడే స్తుతింపదగినవాడని భావం.

(ఋతస్య గర్భమ్)– సత్యమైన ఈ లోకానికి అంతటికి కారణమైనవానికి– అని కూడా అర్థం. ఈ విధంగా సర్వాధికుడైతే, అతనిని తెలిసికొని స్తుతించడం సాధ్యమా? అంటే,

(యథా విద పిపర్తన)– ఏ విధంగా తెలిసికొంటున్నారో, ఆ విధంగానే స్తుతించండి. అతనిని యథాతథంగా తెలిసికొనిన తరువాత స్తుతించడం అనేది ఎవరికీ సాధ్యం కాదు. మీరు తెలిసిన రీతిలోనే స్తుతిస్తే, ఆ విధంగానే అతడు కాగలడు.

**యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్**

(నన్ను ఎవరు ఏ విధంగా శరణు పొందుతున్నారో, వారిని నేను ఆ విధంగానే చేరుతున్నాను– అని శ్రీకృష్ణుడు గీతలో,

**తమరుకన్దదెవ్వురువమ్ అవ్వురువమ్ తానే**
**తమరుకన్దెప్పేర్ ముప్పేర్, తమరుకన్దు**
**ఎవ్వణ్ణమ్ శిన్దిత్తు ఇమైయాదిరుప్పరే,**
**అవ్వణ్ణమ్ ఆழியానామ్** (ముదల్ తిరు–44)

(భక్తులు మెచ్చినది ఏ,రూపమో, ఆ రూపాన్నే భగవానుడు పొందుతాడు, ఏ పేరు మెచ్చుతారో, ఆ పేరును కల్గి ఉంటాడు. భక్తులు ఏ రీతిలో తనను భావిస్తూ నిరంతరం కొలుస్తారో, ఆ రీతిలో రూపొందుతాడు) అని పొయ్ గై ఆళ్వార్లు కూడా పలికారు.

(జనుషా పివర్తన)– జనుషా జన్మనా– స్వత ఏవ – న కేనచిత్ వరలాభాదినా అనేది ఇక్కడ సాయణభాష్యం. స్తుతించి ఒడిని పట్టకుండా (వరలాభాదులను ఆశించి స్తుతించకుండా) స్తుతించడం అనేది స్వరూపప్రాప్తంగా తలచి స్తుతించండి– అని అర్థం.

**సోఽహం తే దేవదేవేశ! నార్చనాదౌ స్తుతౌ న చ,**

**సామర్థ్యవాన్ కృపామాత్రమనోవృత్తిః ప్రసీద మే** (విష్ణుపురాణమ్)

(దేవదేవా! నిన్ను స్తుతించడంలో, అర్చన మొదలైనవానిలో నేను సామర్థ్యాన్ని కలవాడను కాను. కృపతోనే నిండిన మనస్సు కలవాడనై నన్ను అనుగ్రహించాలి) అనే రీతిలో ముందు పల్కిన స్తుతిరూపమైన ఉపాయం, వాక్సామర్థ్యం కల కొందటికే అనుష్ఠించడం సాధ్యం కనుక, సర్వసులభమైన తిరునామ సంకీర్తనం అనంతరం విధింపబడుతున్నది.

(అస్య నామ జానంతః ఆ వివక్తన)- ఇతని నామాన్ని తెలిసిన వారలారా! ఆ నామాన్ని అంతటా పల్కండి.

(నామ)- చెవికి సోకినంతమాత్రంలో అందరిచే నమస్కరింపదగినదై ఉన్నందున, నామమ్ అని అనబడుతున్నది. మంత్రమ్ అని అనకపోవడానికి కారణం- కాలనియమం, అధికారినియమం, మొదలైనవి లేకుండా ఉండడం కోసం. బాధపడేవాడు అమ్మా! అని అనాలంటే ఏవిధమైన క్రియాకలాపం (ఆ విధంగా పల్కడానికి) చేయనక్కరలేదు కదా!

(అస్య నామ) - ఈ నామాన్ని పల్కండి అని విశేషించి ఏ నామాన్ని నిర్దేశించనందున, పేరుమ్ ఓరాయిరమ్ పిఱ పల ఉడైయ ఎమ్బెరుమాన్ (పేర్లను సహస్రసంఖ్యలో కల్గిన స్వామి) అయిన ఆ స్వామి పేర్లలో దేనినైనా ఉచ్చరిస్తే చాలు, దానివల్ల సంసారమనే వ్యాధి తీరిపోతుంది. ఉచ్చరించేది అతని నామమై ఉండాలి- అనే నియమమే ఉన్నది. ఈ అర్థాన్ని శ్రుతులు, స్మృతులు ఆళ్వార్లు, పూర్వాచార్యులు వివరంగా పలికారు. ఏ విధంగా? అంటే,

అచ్యుతానంతగోవింద నామోచ్చారణ భేషజాత్,
నశ్యంతి సకలా రోగాః సత్యం సత్యం వదామ్యహమ్

(అచ్యుతుడు, అనంతుడు, గోవిందుడు- అనే తిరునామాలను ఉచ్చరించడమనే మందుతో అన్ని వ్యాధులు తీరిపోతాయి. ఇది నిజం, నిజం, నిజం అని ముమ్మారు నేను ప్రమాణం చేస్తున్నాను) అని అచ్యుతుడు, అనంతుడు, గోవిందుడు అనే తిరునామాల గొప్పతనం విష్ణుధర్మంలో చెప్పబడింది.

ఆర్తా విషణ్ణాః శిథిలాశ్చ భీతాః ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః,
సంకీర్త్య నారాయణశబ్దమాత్రం విముక్తదుఃఖాః సుఖినో భవంతి

(ఆధ్యాత్మికం, ఆధిభౌతికం, ఆధిదైవికం అనే తాపాలతో తపింపబడేవాడు, భయపడినవారు, ఘోరమైన వ్యాధులతో దుఃఖాన్ని పొందినవారు, నారాయణుడనే

శబ్దాన్ని మాత్రం కీర్తించడం వల్లనే అన్ని దుఃఖాలు తొలగినవారై, మోక్షసుఖాన్ని పొందుతున్నారు అని భారతంలో నారాయణనామవైభవం తెలుపబడింది.

అవశేనాపి యన్నామ్ని కీర్తితే సర్వపాతకైః,
పుమాన్ విముచ్యతే సద్యః సింహత్రస్తై మృగా ఇవ,
యన్నామకీర్తనం భక్త్యా విలాయన మనుత్తమమ్,
మైత్రేయాశేషపాపానాం ధాతూనా మివ పావకః

(ఆ భగవానుని తిరునామం, యాదృచ్ఛికంగా, అనుకోకుండా –ప్రయత్న పూర్వకంగా కాకుండా, ఉచ్చరింపబడినదైనా, ఉచ్చరించినవాని పాపాలు, సింహంవల్ల భయాన్ని పొందిన మృగాలవలె, దూరంగా తొలగిపోతాయి. మైత్రేయా! సువర్ణం మొదలైన ధాతువుల మలినాలను అగ్ని పోగొట్టేటట్లుగానే, భక్తితో భగవంతుని తిరునామసంకీర్తనం చేయడం అన్ని పాపాలను నశింపజేసే సాటి లేని సాధనం) అని,

ధ్యాయన్ కృతే, యజన్ యజ్ఞైః త్రేతాయాం, ద్వాపరేఽర్చయన్,
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్

(భగవంతుని ధ్యానించడంవల్ల, కృతయుగంలోను, యజ్ఞాలతో ఆరాధించడం వల్ల త్రేతాయుగంలోను, అర్చన చేయడంవల్ల ద్వాపరయుగంలోను ఏ ఫలాన్ని పొందుతున్నారో, దానిని కలియుగంలో కేశవుని కీర్తించడం ద్వారా పొందవచ్చు) అని,

కిం చిత్రం తదఘం ప్రయాతి విలయం తత్రాచ్యుతే కీర్తితే

(అచ్యుతుని నామం కీర్తింపబడగానే, అక్కడే పాపాలు నాశాన్ని పొందుతున్నాయి. అనే విషయంలో ఆశ్చర్యం ఏమున్నది?) అని శ్రీవిష్ణుపురాణంలో చెప్పబడింది.

అజ్ఞానతో జ్ఞానతో వా వాసుదేవస్య కీర్తనాత్,
తత్ సర్వం విలయం యాతి తోయస్థం లవణం యథా

(తెలిసిగాని, తెలియకగాని, వాసుదేవుని తిరునామాన్ని పల్కినట్లయితే పల్కినవాని పాపం అంతా నీటిలో ఉండే ఉప్పువలె కరగిపోతుంది),

శమాయాలం జలం వహ్నేః తమసో భాస్కరోదయః,
శాంతే కలే రఘౌఘస్య నామసంకీర్తనం హరేః

(నిప్పును ఆర్పడానికి నీరు, చీకటిని లేకుండా చేయడానికి సూర్యోదయం సమర్థమైనవి. అదేవిధంగా, కలికోలాహలం వల్ల ఏర్పడే పాపసమూహాన్ని పోగొట్టేది హరినామసంకీర్తనమే) అని,

"యన్నామసంకీర్తనతో విముచ్యతే" (ఎవని తిరునామసంకీర్తనంతో మోక్షాన్ని పొందుతున్నాడో) అని,

యన్నామసంకీర్తనతో మహాభయాత్
విమోక్ష మాప్నోతి న సంశయం నరః

(ఎవని సంకీర్తనంతో మానవుడు గొప్ప ఆపదనుండి నిస్సందేహంగా విడువడుతున్నాడో.) అని,

సకృదుచ్చరితం యేన హరిరిత్యక్షరద్వయమ్,
బద్ధః పరికరస్తేన మోక్షాయ గమనం ప్రతి

(హరి అనే రెండు అక్షరాలు ఎవనిచే ఒకసారి ఉచ్చరింపబడతాయో, అతడు మోక్షానికి పోవడంకోసం చేయవలసినవానిని చేసినవాడవుతున్నాడు) అని,

యస్య నామ్ని స్మృతే మర్త్యః సముత్క్రాంతే రనంతరమ్,
ప్రాప్నోతి వైష్ణవం స్థానం పునరావృత్తివర్జితమ్

(ఎవని తిరునామాన్ని స్మరించిన మానవుడు, మరణించిన తరువాత పునరావృత్తి లేని, విష్ణువుయొక్క పరమపదాన్ని పొందుతున్నాడో) అని విష్ణుధర్మంలో పలుచోట్ల పలుకబడింది కదా!

వేఱొక చోట–

సర్వాన్ కామాన్ ప్రాప్నువంతి విశాలాన్, త్రైలోక్యేఽస్మిన్ కృష్ణనామాభిధానాత్

(ఈ మూడు లోకాలలో ఉండే చాలా గొప్పదైన ఇష్టవస్తువులన్నిటిని కృష్ణుడనే నామాన్ని పల్కడం మూలంగానే పొందుతున్నారు) అని ఘోషింపబడింది.

వేఱొకచోట–

సంకీర్తయేజ్జగన్నాథం, వేదం వాపి సమీరయేత్

(జగన్నాథుని సంకీర్తనం చేయాలి, లేక, వేదాన్ని అయినా జపించాలి)అని నారాయణ నామసంకీర్తనం వేదాధ్యయనం కంటే గొప్పది అని తెలుపబడింది.

వీటి అన్నిటికంటే గొప్పదైన వేదంలోను ధ్రువాసో అస్య కీరయో జనాసః (ఇతనిని కీర్తించే జనులు స్థిరమైన మోక్షస్థానాన్ని పొందుతున్నారు) అని ఉద్ఘోషింపబడింది.

కెడు మిడరాయ వెల్లామ్ కేశవా! ఎన్న, నాళుమ్
కొడువినై శెయ్యుమ్ కూఱ్ఱిన్ తమర్ కళుమ్ కుఱుకకిల్లార్

(కేశవా! అంటే దుఃఖాలన్నీ తొలగిపోతాయి, ప్రతిదినం క్రూరపాపాలను చేసినా యముని భటులు దరిచేరరు) అని నమ్మాళ్వార్లు పలికారు.

కావలిల్ పులనై వైత్తు కలితన్నై కడక్కప్పాయ్ న్దు,
నావలిట్టుழி తరుకిన్ణోమ్ నమన్దమర్ తలైకళ్ మీదే,
మూవులకుణ్డుమిழ్న్ద ముదల్వ! నిన్నామమ్ కఱ్ఱ
ఆవలిప్పుడైమై కణ్డాయ్! అరజ్గమానకరుళానే,

(శ్రీరంగనాథా! ఇంద్రియాలను కావలిలో పెట్టి, కలిప్రభావాన్ని వేగంగా దాటి యమభటుల తలపై నాట్యం చేస్తున్నాము. ముల్లోకాలను మింగి, వెలు వరించిన జగత్కారణభూతుడా! నీ నామాన్ని పల్కినందువల్ల కల్గిన గర్వాన్ని చూచావా! )

పచ్చైమామలైపోల్ మేని పవళవాయ్ క్కమల చ్చెజ్గణ్,

**అచ్చుతా! అమరరేఱే! ఆయర్ తమ్ కొ(ఝున్దే ఎన్నుమ్,**
**ఇచ్చువై తవిర యాన్ పోయ్ ఇన్దిరలోకమాళుమ్,**
**అచ్చువై పెఱినుమ్ వేణ్డేన్ అరజ్గమాన కరుళానే!**

(శ్రీరంగనాథా! గొప్ప పచ్చల పర్వతం వంటి మేని, పగడంవంటి పెదవి, తామరలవంటి ఎఱ్ఱని కన్నులు కలవాడా! అచ్యుతా! నిత్యసూరినాథా! గోపాలబాలా! – అనే ఈ నామానుసంధానంలోని రుచిని కాదని నేను, ఇంద్రలోకాన్ని పాలించే ఆ అనుభవాన్ని కూడా కోరను) అని,

**మొయ్ త్త వల్వినైయుళ్ నిన్ఱు మూన్ఱె(ఝుత్తుడైయ పేరాల్**
**కత్తిరబన్దుమనే పరామ్ కతి కణ్డుకొణ్డా**

(గాఢమైన, పేరుకుపోయిన, బలమైన క్రూరకర్మలను కలవాడైన క్షత్రబంధువు కూడా మూడక్షరాలను కల భగవన్నామ సంకీర్తనంతో మోక్షాన్ని పొందుతాడు) అని,

**నమనుమ్ ముట్కలనుమ్ పేశ నరకిల్ నిన్ఱార్కళ్ కేట్క**
**నరకమే శువర్క్క మాకుమ్ నామజ్గళుడైయ నమ్బి!**

(యముడు, ముద్గలుడు సంభాషించేటపుడు, వారి మాటలలోని భగవన్నామాన్ని నరకంలోని వారు వినగా, వారి పాపాలు తీరి నరకమే స్వర్గమయిన రీతిలోని నామాలను కల గుణపూర్ణుడు) అని తొణ్డరడిప్పొడి యాళ్వార్లు తిరునామసంకీర్తన ప్రభావాన్ని పలుమార్లు కీర్తించారు.

తిరుమంగై ఆళ్వార్లు కూడా పెరియ తిరుమొ(ఝి ప్రబంధంలో ప్రారంభంలో నారాయణనామ ప్రభావాన్ని పలు రీతులలో పలికారు.

ఇత్తిరునామన్దాన్ ప్రయోజనాంతరపరర్కు ప్రయోజనత్తై క్కొడుక్కుమ్; ఉపాయంతరనిష్ఠర్ క్కు పావనమాయిరుక్కుమ్. ప్రపన్నర్ క్కు దేహయాత్రా శేషమాయిరుక్కుమ్. ముత్తుప్పడుమ్ తుఱైయిల్ ముఱ్ఱుకువార్ ముత్తై క్కొడుత్తు పఴమ్ కొళ్ళువర్కళ్. శెఱ్ఱుముత్తు వెణ్ణెయ్ క్కెన చ్చెన్ఱు మాఱ్ఱువర్కళితే. విలైయఱియుమ్ శెట్టికళ్ పక్కల్ పుకున్దవాఱే పెరువిలైయనామ్. శెరుక్కరానార్ ఇత్తై ప్పూణ్డు అనుభవిప్పార్ కళ్. అప్పడియే, ప్రయోజనాంతర పరర్కుమ్ ఉఱుప్పాయ్, ప్రపన్నర్కు స్వయం ప్రయోజనమాయ్ ఇత్తిరునామమిరుప్పదు

(ఈ తిరునామం, వేరు ప్రయోజనాలను ఆశించేవారికి వారు కోరిన ప్రయోజనాన్ని ఇస్తుంది. అన్యోపాయాలను ఆశ్రయించేవారిని పవిత్రులనుగా చేస్తుంది. ప్రపన్నులకు దేహయాత్రాసాధనంగా అవుతుంది. ముత్యాలు దొరికే రేవు స్నానం చేసేవారు అక్కడ దొరికిన ఆ ముత్యాలను సాధనంగా చేసుకొని, అమ్మి పండ్లను కొంటారు. వాటి విలువను తెలిసినవారు, కోమటివారి దగ్గరకు వెళ్లి వాటిని అమ్మి ధనం సంపాదిస్తారు, ఇక, ధనవంతులు అయితే, వాటిని తమ ఆభరణాలలో పొదిగి, వాటిని ధరించి ఆనందిస్తారు. ఆ విధంగానే, ఈ భగవాన్నామం ప్రయోజనాంతరాలను కోరేవారికి సాధనం అవుతుంది. ప్రపన్నులకు స్వయం ప్రయోజనంగా ఉంటుంది )అని,

ఇప్పడి చ్చేతనన్ తన్ మూలైయడియే తిరిన్దాలుమ్ అవన్ దోషఙ్గళై ప్పోక్కి, మేల్ శెల్లుకిఱ నన్మైకళై క్కొడుక్కుమ్బడి యాయ్ త్తు, తిరునామత్తినుడైయ ప్రభావమిరుప్పదు. (ఈ విధంగా జీవుడు తిరుగకూడనిచోట్ల తిరిగినప్పటికీ, అతనికి కలిగిన దోషాలను పోగొట్టి, ఆ తర్వాత అతనికి కలుగవలసిన మంచిని అంతా కలిగించగలిగినదై ఈ భగవన్నామ ప్రభావం ఉన్నది ) అని,

భక్తియినుడైయ దుష్కరత్తైయోపాది, ప్రపత్తినిష్ఠాహేతువాన మహావిశ్వాసముమ్ శిలరుక్కు కిట్టుకై అరిదాకైయాలే, ఇదిల్ ఇఴియ క్కూశినవర్కళుక్కు సర్వాధికారమాన యాదృచ్ఛికభగవన్నామ సంకీర్తనమే చేతనరుడైయ పాపత్తై ప్పోక్కి, సుకృతానుకూలమాక కర్మయోగాదికళిలే మూట్టుదల్, ప్రపత్తియిలే

మూట్టుదల్, విరోధియై పోక్కి ప్రాప్యత్తై క్కొడుక్కైక్కు తానే నిర్వాహకమాదలాన్బుడియాన వైభవత్తై ఉడైత్తాయాయ్ త్తు తిరునామత్తినుడైయ వైభవమిరుప్పదు.

(భక్తి ఏ విధంగా ఆచరించడానికి కష్టమైనదో, ఆ విధంగానే, ప్రపత్తిలో కూడా మహా విశ్వాసం కలిగి ఉండడం చాలా అరుదు కనుక, వీటిలో ప్రవేశించడానికి సందేహించేవారికి వారి పాపాలను పోగొట్టి, సర్వాధికారమైన, యాదృచ్ఛికమైన భగవన్నామ సంకీర్తనం, వారి వారి పుణ్యానికి అనుకూలంగా కర్మయోగం మొదలైన ఉపాయాలలో ప్రవేశింప చేయడం, ప్రపత్తిలో ప్రవేశింప చేయడం, విరోధులను పోగొట్టి, ప్రాప్యాన్ని ఇవ్వడంలో తానే నిర్వాహకమై ఉండడం మొదలైన వైభవాలను కలిగినదై ఉంటుంది) అని పరమ కారుణికులైన పెరియ వాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించారు.

వీటిని అన్నిటిని వేదాంతాచార్యులైన భట్టర్ కూడా శ్రీసహస్రనామభాష్యంలో పరపక్షప్రతిక్షేపపూర్వకంగా విస్తృతంగా అనుగ్రహించారు. అభియుక్తాగ్రేసరులైన శ్రీపిళ్ళై లోకాచార్యులవారు కూడా

వాచ్యప్రభావమ్ పోలన్ఱు వాచకప్రభావమ్. అవన్ దూరస్థనానాలుమ్ ఇదు కిట్టినిన్ఱు ఉదవుమ్

(నామంచేత చెప్పబడే భగవంతుని ప్రభావం కంటే భగవన్నామం ఎక్కువ ప్రభావం కలిగినది),

ద్రౌపదిక్కు ఆపత్తిలే పుడవై శురన్దదు తిరునామమిఱే

(ద్రౌపదికి ఆపద సమయంలో సహాయపడి వస్త్రాలను అనుగ్రహించినది భగవన్నామమే కదా,),

శొల్లుమ్ క్రమమొழியచ్చొన్నాలుమ్ తన్ స్వరూపమ్ కెడనిల్లాదు.

(చెప్పే క్రమాన్ని తప్పి చెప్పినప్పటికీ చెప్పినవాని స్వరూపం పాడు కాకుండా రక్షిస్తుంది),

ఇదుతాన్ కులన్దరుమ్ ఎన్గిఱపడియే ఎల్లా అపేక్షితఙ్గళైయుమ్ కొడుక్కుమ్

(ఈ భగవన్నామం మంచి కులాన్ని కలిగిస్తుంది అనే విధంగా అన్ని విధాలైన ప్రయోజనాలను ఇస్తుంది),

ఐశ్వర్యకైవల్య భగవల్లాభఙ్గళై ఆశైప్పట్టవర్ కళుక్కు అవற்றை క్కొడుక్కుమ్. కర్మజ్ఞానభక్తికళిలే ఇழிన్దవర్ కళుక్కు విరోధియై పోక్కి, అవற்றை త్తలైక్కట్టిక్కొడుక్కుమ్. ప్రపత్తియిలే ఇழிన్దవర్కళుక్కు స్వరూపజ్ఞానత్తై ప్పిఱప్పిత్తు క్కాలక్షేపత్తుక్కుమ్, భోగత్తుక్కుమ్ హేతువాయిరుక్కుమ్

(ఐశ్వర్యాన్ని, కైవల్యాన్ని భగవంతుని ప్రాప్తిని ఆశపడినవారికి ఆ ప్రయోజనాలను కలిగిస్తుంది. కర్మయోగంలో, జ్ఞాన యోగంలో, భక్తియోగంలో ప్రవేశించినవారికి కలిగే విరోధులను పోగొట్టి, అవి సఫలం అయ్యేటట్లు చేస్తుంది. ప్రపత్తిలో ప్రవేశించినవారికి స్వరూప జ్ఞానాన్ని కలిగించి, కాలక్షేపానికి, భోగానికి సాధనమై ఉంటుంది) అని ముముక్షుప్పడిగ్రంథంలో అనుగ్రహించారు.

(జానంతః వివక్తన)– తెలిసినవారలారా! చెప్పండి. అచేతనమై ఉండకుండా, చేతనులై ఉండే వైలక్షణ్యానికి తగినట్లు పల్కండి. జ్ఞానాన్ని సంపాదించనక్కరలేదు. మిమ్ములను విడచి ఉండని– అపృథక్ సిద్ధమైన ధర్మంకదా ఇది (భగవత్కీర్తనం) – అని భావం.

ఇక్కడ జ్ఞానాన్ని గూర్చి పల్కడం శరీరం, జిహ్వా – మొదలైన ఉపకరణాలకు అన్నిటికి ఉపలక్షణం.

(నామ వివక్తన) – అతని నామం సిద్ధమై ఉన్నది కదా, ఈ విధంగా నామం సిద్ధమై, దానిని ఉచ్చరించడానికి ఉపకరణాలు కూడా ఏ లోటు లేకుండా ఉండేటపుడు ఉచ్చరించి, ఉజ్జీవించడంలో ఏమి అడ్డు? వెంటనే ఉచ్చరించండి– అని భావం.

ఈ అర్థాన్నే –

**నారాయణేతి శబ్దోఽస్తి వాగస్తి వశవర్తినీ,**
**తథాఽపి నరకే ఘోరే పతంతీతి కిమద్భుతమ్?**

(నారాయణ అనే శబ్దం ఉన్నది. వాక్కుకూడా వశంలో ఉన్నది. అయినా, ఘోరమైన నరకంలో పలువురు పడుతున్నారు అనేది ఏమి ఆశ్చర్యం! ) అని పురాణాలలో చెప్పబడింది.

పొయ్ గై ఆళ్వార్లు ఈ అర్థాన్ని

**నా వాయిలుణ్డే నమో నారణా వెన్ను, ఓవాదురైక్కుమ్ ఉరై యుణ్డే, మూవాద**
**మూక్కదిక్కణ్ శెల్లుమ్ వకై యుణ్డే, ఎన్నొరువర్ తీక్కదిక్కణ్ శెల్లుమ్ తిఱమ్**

(నోటిలో నాలుక ఉన్నది కదా! నమో నారాయణాయ అని నిరంతరం పలికే నామమున్నది కదా, గొప్పదైన, పునరావృత్తి లేని పరమపదానికి చేరే రీతి ఉన్నది. అయినా ఒకరు చెడ్డ గతికి పోయే క్రమం ఎంతటి ఆశ్చర్యకరమో కదా! ) అని అన్నారు.

(ఆవివక్తన)– ఆ సమంతాత్, వివక్తన– అంతటా పల్కండి. సర్వదేశాలలో పల్కండి. సర్వకాలాలలోను పల్కండి. సర్వావస్థలలోను పల్కండి– అని భావం.

**తుఞ్జుమ్బోదురైమి తుయర్వరిల్ నినైమిన్ తుయరిలీర్ శొల్లినుమ్ నన్ఱామ్,**
**నఞ్జుదాన్ కణ్డీర్ నమ్ముడై వినైక్కు నారాయణా ఎన్నుమ్ నామమ్**

(పెరియతిరు 1-1-9)

(నిద్రపోయేటప్పుడు చెప్పండి. దుఃఖం వచ్చినప్పుడు చెప్పండి. దుఃఖం లేకపోయినప్పుడు చెప్పినా మంచిదే. మనం చేసిన పాపాలకు నారాయణా అనే నామం విషం సుమా) అని తిరుమంగై ఆళ్వార్లు,

**ఆసీనా వా శయనా వా తిష్ఠంతో యత్ర కుత్ర వా,**
**నమో నారాయణయేతి సన్మంత్రశరణా వయమ్**

(ఎక్కడ కూర్చున్నా, పరుండి ఉన్నా, నిలుచుని ఉన్నా, నమో నారాయణాయ అనే మంత్రాన్నే శరణంగా ఆశ్రయించినవారం మనం) అని ఋషులు కూడా దీనిని వివరించారు.

(ఆవివక్తన)- అంతటా సంకీర్తనం చేయండి- అని పల్కినందున పరిశుద్ధుడై ఉండేటపుడు, అపరిశుద్ధుడై ఉండేటపుడు ఏ సమయం అయినా, సర్వకాలావస్థలలోను పల్కండి- అని చెప్పినట్లయినది. తిరునామసంకీర్తనం చేసేటపుడు శుద్ధి లేనివానికి శుద్ధిని సంపాదించుకోనక్కరలేదు. శుద్ధునకు అశుద్ధిని కల్గించుకోనక్కరలేదు. ఉండేరీతిలోనే సంకీర్తనం చేస్తేచాలు- అని భావం.

నంజీయర్- అశుద్ధుడై ఉండేటపుడు తిరునామసంకీర్తనం చేయవచ్చునా? చేయకూడదా? అని భట్టర్ ను ప్రశ్నించగా, గంగాస్నానం చేయడానికి పోయేవానికి సమీపంలోని ఉప్పు నీటిగుంటలో మునిగివెళ్ళాలా? స్నానం చేసిన తరువాత మంచిని కల్గించగల్గినది,పూర్వం ఉన్న అశుద్ధిని పోగొట్టలేదా? అని (భట్టర్) అన్నారు- అని తిరుమాలై వ్యాఖ్యానంలో పరమకారుణికులైన పెరియవాచ్చాన్పిళ్ళై ప్రస్తావించిన ఐతిహ్యం ఇక్కడ అనుసంధేయం.

(ఆవివక్తన) -అంతటా చెప్పండి. తిరునామం చెవి సోకిన జీవరాశులన్నిటికి ఉజ్జీవనం కల్గుతుంది కనుక, తిరునామం చెప్పే చోట అంతా అందరికి చెవిలో పడేటట్లు దీనిని ఉద్ఘోషించండి.

నమనుమ్ ముట్కలనుమ్ పేశ నరకిల్ నిన్డార్ కళ్ కేట్క,
నరకమే శువర్కమాకుమ్ నామజ్గళుడైయ నమ్బి (తిరుమాలై-12)

(యముడు, ముద్గలుడు అనే ఇద్దరు భగవన్నామసంకీర్తన వైభవాన్ని గూర్చి మాట్లాడుకుంటూ ఉండగా, ఆ సంభాషణను నరకంలో ఉండేవారు విన్నారు. అప్పుడు వారుండే నరకమే స్వర్గమైనది. అటువంటి నామాలను కలిగిన ఓ గుణపూర్ణా! )
అని కదా తిరునామ వైభవం తిరుమాలై ప్రబంధంలో చెప్పబడింది.

ఇక, చివరిగా, భక్తి అనే ఉపాయాన్ని స్వానుష్ఠానపర్యంతంగా చేసి చూపిస్తున్నాడు, వేదపురుషుడు.

(విష్ణో) – సర్వవ్యాపి అయినదేవా! ,

(మహతే)– మహాపురుషుడవైన నీ విషయంగా,

(సుమతిమ్)– చక్కని జ్ఞానాన్ని భక్తిరూపాపన్న జ్ఞానాన్ని– అని భావం. మదినలమ్ (తిరువాయ్–1–1–1) (భక్తిగా పరిణమించిన జ్ఞానం) అని దీనిని 'వేదమ్ తమిళ్ళ్ శెయ్ దమాఱన్' (శ్రీ శఠకోపమునులు) పలికారు.

(భజామహే)– పొందుతాము.

(మహస్తే విష్ణో సుమతిం భజామహే) – బ్రహ్మణి శ్రీనివాసే భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా (శ్రీభాష్యమంగళ శ్లోకమ్) (పరబ్రహ్మస్వరూపుడైన శ్రీనివాసుని విషయంలో నాకు భక్తిరూపాపన్న జ్ఞానం కలగాలి) అని ఈ అర్థాన్ని శ్రీభాష్యకారులు అనుసంధించారు. భజామహే అనే బహువచన ప్రయోగం ద్వారా పూర్వం తెలుపబడిన శరణాగతి, అవతార రహస్యజ్ఞానం, స్తుతి, తిరునామసంకీర్తనం –అనే ఉపాయాలను అనుష్ఠించేవారికికూడా భక్తి నియమంగా ఉండవలసినది–అని సూచింపబడింది. ప్రపత్తినిష్ఠునకు భక్తి ప్రాప్యరుచిలో అన్వయిస్తుంది. మిగిలిన ఉపాయాలను అనుష్ఠించేవారికి భక్తి అంగమై ఉంటుంది.

ఈ రీతిలో పూర్వమంత్రం ద్వారా, ఈ మంత్రం ద్వారా శరణాగతి, అవతార రహస్యజ్ఞానం, స్తుతి, తిరునామ సంకీర్తనం, భక్తి– అనే అయిదు ఉపాయాలను, వాటి ఫలాలను తెలుపబడినట్లయినది.

సేదు శ్రవోభి ర్యుజ్యమ్ చిదభ్యసత్ అని గడచిన మంత్రంలో చెప్పబడిన ఫలం ఈ మంత్రంలో కూడా ఫలంగా అనుసంధించదగినది.

16. **తమస్య రాజా వరుణ స్తమశ్వినా క్రతుం సచంత మారుతస్య వేధసః।**
**దాధార దక్ష ముత్తమ మహర్విదం వ్రజం చ విష్ణుః సఖివాం అపోర్ణుతే॥**

మారుతస్య = దేవగణాలకు, వేధసః= స్రష్ట అయిన, అస్య = విష్ణువు యొక్క, తం క్రతుం = సుప్రసిద్ధమైన రక్షణకార్యాన్ని, వరుణః = వరుణుడు, సచంత = పొందుతున్నాడు, తం = ఆ రక్షణకార్యాన్ని, అశ్వినౌ = అశ్వినీదేవతలు కూడా పొందుతున్నారు), సఖివాన్ విష్ణుః= సహచరులతో కూడిన విష్ణువు, అహర్విదం = మోక్షాన్ని ప్రదానం చేయడమనే, ఉత్తమమ్ దక్షమ్ = గొప్పదైన మోక్షఫలప్రదత్వ రూపసామర్థ్యాన్ని, దాధార = ధరిస్తున్నాడు, వ్రజం చ = = మేఘాన్నికూడా, అపోర్ణుతే = వర్షింపజేస్తున్నాడు.

వ్యాఖ్య : సాధనాలను, ప్రయోజనాలను గడచిన రెండు మంత్రాలు తెలిపాయి. ఈ సాధనాలు సాక్షాత్తు ఫలాన్ని ఇచ్చేవి కావు. భగవానునకు ప్రీతిని కల్గించడం ద్వారా ఐహికాముష్మిక ఫలాలను ఇచ్చేటట్లు చేస్తున్నాయి. సర్వరక్షకుడైన అతడే ఐహిక ఫలాలను, పారలౌకిక ఫలాలను ఇస్తున్నాడు– అని ఈ మంత్రం తెల్పుతున్నది.

సర్వరక్షకుడై ఉండేవాడే సకలఫలప్రదుడై ఉండగలడు కనుక, ఈ భగవంతుడే సకల చేతనులను రక్షిస్తున్నాడు– అనేది ఈ మంత్రంలోని పూర్వార్ధతాత్పర్యం. ఇతడే సర్వరక్షకుడనే విషయాన్ని

న హి పాలన సామర్థ్యమృతే సర్వేశ్వరం హరిమ్,
స్థితౌ స్థితం మహాప్రాజ్ఞ! భవత్యన్యస్య కస్యచిత్

(ఓ మహాబుద్ధిమంతుడా! రక్షణలోనిలకడగా ఉండే, సర్వేశ్వరుడైన హరికి తప్ప వేరెవ్వరికి రక్షించడంలో సామర్థ్యంలేదు కదా) అని శ్రీవిష్ణుపురాణంలో శ్రీ పరాశరమహర్షి,

ఏ పావమ్ పరమే ఏఝులకుమ్ ఈపావమ్ శెయ్ దు అరుళాలళిప్పారార్?

(ఏమి పాపం! ఏడు లోకాలను రక్షించేవారు శ్రీమన్నారాయణుని కంటే వేఱెవ్వరున్నారు? ).అని శ్రీపరాంకుశులు వివరించారు.

(మారుతస్య)– మరుద్గణాలకు – అని భావం.

(వేధసః)– స్రష్ట అయిన వానియొక్క –దేవతలను సృష్టించిన వానియొక్క– అని భావం.

నాట్టై ప్పడై యెన్ఱయన్ ముదలా త్తన్ద నళిర్మామలరున్ది
వీట్టై ప్పణ్ణి విళైయాడుమ్ విమలన్

(లోకాలను సృష్టించు అని బ్రహ్మమొదలైన ప్రజాపతులను సృష్టించిన, చల్లని గొప్ప పద్మాన్ని కల నాభి అనే గృహాన్ని సృష్టించి లీలారసాన్ని అనుభవించే పావనుడైన వానిని) యొక్క– అని సారం. లేక,

(మారుతస్య)– మరుత్తులు అనబడే దేవతలతో సంబంధాన్ని కలవానియొక్క– అని అర్థం. వారి స్వల్పమైన ఆనుకూల్యాన్నే చూచి, వారు తనను ఆశ్రయించినవారుగా భావించేవానికి– అని భావం.

దేవానాం దానవానాం చ సామాన్య మధిదైవతమ్ (జితంతే–1)

(దేవతలకు, దానవులకు సామాన్యమైన దైవం నీవు) అనేవిధంగా అందఱికి చెందిన (సామాన్యమైన) పొదునిన్ఱ పొన్నమ్ కఝల్ (సర్వసాధారణమైన, అందమైన

బంగారు శ్రీచరణాలు) కల్గినవాడైనా, ఆనుకూల్యలేశాన్ని కలవారి పట్ల అంతు లేని పక్షపాతాన్ని కలవాడై ఉంటాడు. పరస్పర విరుద్ధమైన ఈ రెండు ఏవిధంగా పొసగుతాయి? అంటే,

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి కశ్చన

(నన్ను ఆశ్రయించే విషయంలో నేను అందరికీ సమానమై ఉంటాను. నాకు గర్హించదగిన వాడెవడూ లేడు) అనేవిధంగా తనను ఆశ్రయించే విషయంలో అందరికీ సమానంగా ఉండేవాడు కనుక, పొదు నిన్ఱ కழల్ (అందరికీ సాధారణమైన శ్రీచరణం) అనేది కూడా పొసగుతుంది. ఆశ్రయించిన తరువాత వారిపట్ల ఆశ్రయించని వారిపట్ల కంటే ప్రేమ అతిశయించి ఉండడం కూడా మిక్కిలి పొసగుతుంది.

(వేధసః) – ఈ రెండవ నిర్వాహంలో వేధసః అంటే– సర్వస్రష్ట అయినవానియొక్క– అని అర్థం.

(అస్య) – సుప్రసిద్ధ రక్షకుడైన ఈ విష్ణువుయొక్క– అని అర్థం. అకారవాచ్యుడైన విష్ణువుయొక్క –అని కూడా అర్థం. అ ఇతి బ్రహ్మ (అకారం పరబ్రహ్మను తెల్పుతుంది), "అకారార్థో విష్ణుః" అని శ్రీపరాశరభట్టరుల సూక్తి.

తస్య ప్రకృతిలీనస్య యః పరః స మహేశ్వరః (తైత్తి–నారా)

(తన కారణమైన అకారంలో అంతర్భవించిన ఓంకారానికి అర్థం గొప్ప ఈశ్వరుడైన ఆ నారాయణుడే) అని,

అక్షరాణా మకారోస్మి (గీత–10–33) (అక్షరంలో అ అనే అక్షరాన్ని నేను)అని,

**అ ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధానమ్ (మహాభాష్యమ్)–**

(అ అనేది భగవంతుడైన నారాయణుని మొదటి నామం) అనేవిధంగా అకారవాచ్యుడు ఇతడే– అనేది సుప్రసిద్ధం కదా! అవ–రక్షణే అనే ధాతువు నుండి పుట్టినది అయినందున, వీరిని రక్షిస్తాడు, ఈ దేశంలోనే రక్షిస్తాడు– అనే నియమం చేయబడనందున, సర్వదేవ సర్వకాల సర్వావస్థలలో అందరినీ రక్షించేవాడు– అనేది అకారానికి అర్థం.

(వేధసః అస్య) – సర్వకారణుడైన అకారవాచ్యునియొక్క –అని అర్థం. ప్రకృతిలీనస్య అనేవిధంగా వాచకాలైన అన్ని అక్షరాలకు కారణమైన అకారానికి వాచ్యుడే వాచ్యలన్నిటికి కారణమని ఇక్కడ తెలుపబడింది.

ప్రకృతి లీనస్య యః పరః స మహేశ్వరః

(అక్షరకారణమైన అకారానికి అర్థమైనవాడే సర్వకారణుడు) అని వేదం తెలిపింది కదా!

(అస్య తం క్రతుమ్)– సర్వరక్షకుడైన ఆ రక్షణకార్యాన్ని,

(రాజా వరుణః సచంత)– ప్రకాశించే వరుణుడు పొందుతున్నాడు– అని అర్థం. లోకాన్ని అంతటిని ఆర్ద్రహస్తంతో స్పృశిస్తాడు కనుక, సుప్రసిద్ధరక్షకుడుగా ప్రకాశించే వరుణుడు పొందుతున్నాడు. వరుణుని వద్ద రక్షణకార్యం పరమపురుషునిదే– అని ఇక్కడ భావం.

(రాజా వరుణః) – ప్రకాశించేవాడైన వరుణుడు– అని అర్థం. ఇక్కడ ప్రకాశమంటే– భగవానునిచే విశేషించి అభిమానింపబడడం. అంటే, ఆழிமழை క్కణ్ణా! అనేచోట తిరుప్పావై వ్యాఖ్యానంలో

సృష్టిసంహారజ్గళై బ్రహ్మరుద్రర్ తలైయిలే పొకట్టు, స్వరూపత్తుక్కు చ్చేర్ న్ద పాలనవిధియై త్తాన్ నడత్తుమాపోలే, నాట్టారై క్కట్టువదు, విడువదాకిఱ

క్రౌర్యవ్యాపారత్తై యమాదికళ్ తలైయిలే ఏఱిట్టు, తమ్మోపాది ఈరక్కైయాలే తడవిక్కొడుక్కవల్లన్ ఎన్ఱు ఈశ్వరనాలే మదిక్కప్పట్టవనల్లైయో, నీ!

(సృష్టి, సంహారాలను బ్రహ్మ, రుద్రులకు అప్పగించి, తన స్వరూపానికి తగిన పాలన విధిని తాను నిర్వహించేటట్లుగా, లోకాలను బంధించడం, విడువడమనే క్రూరవ్యాపారాన్ని యమాదులకు అప్పగించి, నా వలె ఇతడు చల్లని చేతితో లోకాలను స్పృశించగలడు అని భగవానునిచే గౌరవింపబడినవాడవు కదా, నీవు)

అని వ్యాఖ్యానచక్రవర్తి పెరియవాచ్చాన్పిళ్ళై అనుగ్రహించిన రీతిలోనే, ఆ భగవంతునిచే కూడా అభిమానింపబడడమనే గొప్పతనాన్ని తెల్పుతున్నది. లేక, ఆழிమழைக்కణ్ణా! అని గోదాదేవి పల్కినట్లే గంభీరస్వభావాన్ని కలవాడై, వృష్టికి నిర్వాహకుడై ఉండే గొప్పతనాన్ని తెల్పుతున్నదని కూడా చెప్పవచ్చు.

(తమశ్వినా) – ఆ రక్షణకార్యాన్నే దేవవైద్యులుగా ప్రసిద్ధి పొందిన అశ్వినీదేవతలు కూడా పొందుతున్నారు. వర్షం కురిసి, ఈ లోకాన్ని రక్షించేవాడైనందున వరుణుని, వైద్యం చేసి దేవలోకాన్ని రక్షించేవాడైనందున అశ్వినీదేవతలను ప్రార్థించడం– మిగిలిన లోకంలో కన్పించే రక్షకులందరికీ ఉపలక్షణం. లోకంలో రక్షకులుగా చెప్పబడేవారిలో ఉండే రక్షణధర్మమంతా ఇతనిదే– అని భావం.

రాజు అయిన వరుణుడు, అశ్వినీదేవతలు భగవంతుని రక్షణకార్యాన్ని (ధర్మాన్ని) పొందుతున్నారు– అని అనడం వారు కూడా అతని రక్షణ కార్యానికి విషయం అవుతున్నారనే అర్థాన్ని తెల్పుతున్నది, రక్షకులుగా భావింపబడే దేవతలు కూడా అతనికి రక్ష్యభూతులు. కనుక, సర్వరక్షకుడు అతడే– అని నిర్ణయిస్తున్నదని కూడా చెప్పవచ్చు. లేక, వేఱు రీతిలో కూడా అర్థాన్ని చెప్పవచ్చు.

(మారుతస్య)– వైద్యులైన ఋత్విక్కుల సమూహాన్ని కలవానియొక్క, లేక, దేవతలతో సంబంధాన్ని కలవానియొక్క– అని అర్థం. దీని అర్థమేమంటే–

దేవాన్ భావయతాఽనేన తే దేవా భావయంతు వః,
పరస్పరం భావయంతః శ్రేయః పర మవాప్స్యథ (గీత)–

(దేవతలను యజ్ఞాలతో ఆరాధించండి. ఆ దేవతలు కూడా వర్షం మొదలైన వానితో లోకాలను తృప్తిపరిచెదరుగాక! ఈ విధంగా ఒకరికొకరు తృప్తిని కల్గించుకొంటూ గొప్ప శ్రేయస్సును పొందండి) అని చెప్పబడిన సంబంధాన్ని కలవానియొక్క –అని అర్థం.

(వేధసః అస్య)– మేధావి అయిన ఈ యజమానుని యొక్క,

(తం క్రతుమ్)– ప్రసిద్ధమైన యజ్ఞాన్ని– యజ్ఞస్వరూపి అయిన విష్ణువును – అని అర్థం. యజ్ఞో వై విష్ణుః అని వేదంలో అధ్యయనం చేయబడుతున్నది కదా!

(వరుణః –అశ్వినా –సచంతే)– వరుణుడు, అశ్వినీదేవతలు మొదలైన దేవతలందఱు సేవిస్తున్నారు. ఇక్కడ వరుణుని, అశ్వినీదేవతలను ప్రస్తావించడం– – అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు మొదలైన సకలదేవతలకు ఉపలక్షణం.

ఎణ్మర్ పదినొరువర్ ఈరఱువర్ ఓరిరువర్
వణ్ణ మలరేన్ది వైకలుమ్– నణ్ణి ఒరు మాలైయాల్
పరవి ఓవాదెప్పొழுదుమ్
తిరుమాలై క్కైతొழுవర్ శెన్రు (ముదల్ తిరు52)

(అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అశ్వినీదేవతలు– అనే వీరు మంచి రంగును కల పూలను తీసికొని, ప్రతిదినం ఆశ్రయించి, ఒక వరుసగా నిలచి, ఎల్లప్పుడు శ్రియఃపతికి అంజలి ఘటిస్తారు) అని పొయ్ గై అళ్వార్లు అనుగ్రహించారు

కదా! ఈ విధంగా ఇంతవరకు, యజ్ఞస్వరూపియైనవాడై రక్షించేవాడితడే- అని ఉద్ఘోషింపబడింది.

ఈ మంత్రం పూర్వార్ధంలో ఇతడే సర్వరక్షకుడనే అర్థం తెలుపబడింది. ఇతడు రక్షించడం ఏ విధంగా? అంటే, ఇహలోక పరలోకప్రయోజనాలను అనుగ్రహించడం ద్వారా రక్షిస్తున్నాడు- అని ఇక తెలుపబడుతున్నది.

(దాధార దక్షమ్) - బలాన్ని ధరిస్తున్నాడు— అని అర్థం. మోక్షఫలప్రదత్వ సామర్థ్యం ఇక్కడ బలమనబడుతున్నది. అనాదికాలంగా సంసారంలో ఉండే జీవుని ప్రకృతిసంబంధాన్ని రుచివాసనలతో సహితంగా పోగొట్టడం సామాన్యమైన పని కాదు కదా!

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా (గీత-7-13)

(విచిత్ర కార్యాలను చేస్తున్నందున మాయ అనబడే ప్రకృతి దేవుడనబడే నాచే నిర్మింపబడినదై, దాటడానికి సాధ్యం కానిది కదా! ) అనికదా, అతడు పలికాడు.

(దక్షమ్ దాధార)- మోక్షఫలప్రదత్వాన్ని ఇతడే ధరిస్తున్నాడు ఉతామృతత్వస్యేశానః (పురుషసూక్తమ్) (మోక్షానికి ఈశ్వరుడు పరమపురుషుడే) అని పల్కింది సూక్తం. మోక్షమిచ్ఛేజ్జనార్థనాత్ (జనార్దనుని వల్ల మోక్షాన్ని కోరాలి— అని అన్నారు ఋషులు. మామేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే (గీత-7-13) (నన్నే ఎవరు శరణు పొందుతున్నారో, వారు ఈ మాయను దాటుతున్నారు)అని భగవంతుడు తానే స్వయంగా నోరుతెరచి పలికాడు.

(ఉత్తమం దక్షమ్)- మిక్కిలి గొప్పదైన ముక్తిఫలప్రదత్వ గుణాన్ని—అని అర్థం. జగత్కారణత్వం, ముక్తిఫలప్రదత్వం— అనేవి సర్వలోక సార్వభౌముడైన భగవంతునకు

ఛత్రచామరాలవలె అసాధారణ లక్షణాలు- అని కదా ఆచార్యులందఱు పలికారు. నిత్యానపాయిని అయిన లక్ష్మీదేవికి కూడా ముక్తిఫలప్రదానకార్యంలో అన్వయం లేదు- అనే రీతిలోనిది కదా ఇతని ఉపాయాంతరనైరపేక్ష్యం ఉంటుంది. పరమప్రాప్యమైన మోక్షాన్ని ఇచ్చే గుణమైనందున, ఉత్తమమైన ఫలం- అనబడుతున్నది. ఫలవాచియైన దక్షపదాన్ని ప్రయోగించినందున, ఈ గుణమే భక్తులందఱికి రక్షకం–అని తెలుపబడుతున్నది. ఇది ఉత్తమమై ఉండడానికి ఏమి కారణం? అంటే,

(అహర్విదమ్)- అహం శబ్దవాచ్యుడైన భగవానుని పొందడానికి కారణమై ఉండడమే- అని అర్థం.

అహ స్తదవలుంపతు (అహస్సు–పగలు అనడే భగవానుడు ఆ పాపాన్ని పోగొట్టుగాక) అని వేదంలో,

పకలై చ్చెన్ఱు నాడి క్క్ణ మంగైయుళ్ కణ్డుకొణ్డే (ఇరణ్డామ్ రు-81)

(పగలు అనే శబ్దంతో చెప్పబడే భగవంతుని అన్వేషించి, తిరుక్కణ్ణమంగై అనేక్షేత్రంలో దర్శించాను) అని

పకఱ్క్ణ్డేన్ నారణనై క్క్ణ్డేన్

(పగలును చూచాను, నారాయణుని చూచాను) అని ఆళ్వార్లు కూడా అహశ్శబ్దవాచ్యుడు భగవానుడని తెలిపారు కదా! అహర్విందత్యనేన అనే వ్యుత్పత్తిద్వారా అహర్విత్ అనే శబ్దం భగవత్ప్రపత్తిసాధనమైన ముక్తి ఫలప్రదత్వ సామర్థ్యాన్ని తెల్పుతున్నది. లేక, తస్మాద్వా ఏతం సేతుం తీర్త్వా అపి నక్తమహరేవ అభినిష్పద్యతే. సకృద్విభోధో హ్యేష బ్రహ్మలోక:

(మోక్షోపాయమైన ఈ పరమాత్మను పొందితే రాత్రికూడ పగలు అవుతున్నది. ఏ నాడూ అస్తమించని పగలుగా ఉంటుంది కదా, ఈ బ్రహ్మస్వరూపం)

అనే విధంగా పరబ్రహ్మ ప్రాప్తిని పగలు– అని నిర్దేశించే క్రమం ఉన్నందున, ఆ భగవత్ప్రాప్తికి సాధనమై ఉండేది– అని అహర్విత్ శబ్దానికి అర్థాన్ని గ్రహించవచ్చు.

(సఖివాన్ విష్ణుః ఉత్తమం దక్షం దాధార) – సఖివాన్ అనే పదాన్ని మూడవ పాదంలోను, నాల్గవ పాదంలోను ఈ విధంగా రెండు చోట్ల అన్వయించుకోవాలి. సహచరులతో విష్ణుభగవానుడు మోక్షఫల ప్రదత్వగుణాన్ని ధరిస్తున్నాడు. నిరుపాధిక పురుషకారప్రద అయిన పిరాట్టితో, ఆమెతో గల సంబంధంచేత పురుషకారత్వ మహిమను పొందిన నిత్యముక్తులు, భాగవతులు, ఆచార్యులు– మొదలైనవారితో కూడిన భగవానుడు ముక్తి ఫలప్రదుడవుతున్నాడు. ఫలప్రదానసంకల్ప సమయంలో వేరెవ్వరినీ అపేక్షించకపోయినా, దానికి ముందు, అనాదికాలం దుష్కర్మలను చేసే కాలం గడిపే ఇతనిని చూచి కోపంతో ప్రజ్వలించే సర్వేశ్వరుని ఉపశమింపజేసి, అతనివద్ద చేతనుని ఆశ్రయింపజేయడానికి, చల్లని నీరువంటి లక్ష్మీదేవి మొదలైనవారి పురుషకారకృత్యం తప్పక ఆవశ్యకమైనందున, సహచరులతో కూడిన ఇతడు ముక్తి ఫలప్రదత్వాన్ని ధరిస్తున్నాడు అని అనడంలో విరోధం లేదు. ఇక్కడ, పరమకారుణికులైన పెరియవాచ్చాన్పిళ్ళై పరందరహస్యంలో పురుషకార విషయంగా పల్కిన ఈక్రింది శ్రీసూక్తులు అనుసంధేయాలు.

శ్రీమన్నారాయణ చరణౌ ఎన్టు ఉపాయతయా వక్ష్యమాణమాన నారాయణనుక్కు విశేషణమాక శ్రీమత్తైయై చ్చొల్లానిన్టాల్, నారాయణశబ్దత్తినాల్ శొల్లప్పడుకిఐ గుణవిశేషజ్గళ్ విశేషణత్వేన ఉపాయశరీరత్తిల్ అన్వితమాకిఐవోపాది, ఇవళుమ్ ఉపాయావయవమాక ప్రాప్తైయుమాయ్, మాతాపితాక్కళ్ ఇరువరుమ్ శేరవిరున్దు ప్రజారక్షణమ్ పణ్ణుకై ప్రాప్తముమాయ్, అదుక్కుమేలే, వేరి మాఱాద పూమేల్ ఇరుప్పాళ్ వినై తీర్కుమ్ ఎన్టు ఉపాయకృత్యమాన విరోధినివర్తకత్వమ్ ఇవ్వర్థత్తిలే నిష్ఠరాన నమ్మాళ్వార్ తిరువుళ్ళత్తాలు ముణ్డాయ్, ప్రదేశాంతరజ్గళాల్ ఇవళై ప్పురుషకారమాక నినైత్తు చ్చొల్లుకిఐార్– ఎన్గిఐ అవైయుమ్ ఉపాయభావత్తిల్

అన్వయిప్పిక్క యోగ్యముమాయ్, అదుక్కుమేలే, అరిః ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః ఎన్టు మేలే అనుష్ఠిక్కప్పడుకిఱ ప్రపత్తితానే పురుషకారకృత్యత్తై శెయ్యవற்றாకైయాలుమ్, మాట్టాదాకిల్, ఇవళ్ స్వాతంత్ర్యత్తై ఆగ్రణి చ్చేరవిట్ట ఉపాయభూతనాన ఈశ్వరన్ రక్షిక్క అమైన్దిరుక్క, ఉపాయాన్వితమాన ఇవనుడైయ ప్రపత్త్యనుష్ఠానమ్ నిష్ఫలమామ్బడియుమాయిరుక్క, ఇవళుక్కు ఉపాయశరీరత్తిలే అన్వయమిల్లై. పురుషకారత్తిలే –ఎన్టు ఒదుక్కిత్తరువార్ ఆర్? ఎన్నిల్,

విశేషణత్వ ముణ్డేయాకిలుమ్, విశేషణభూతమాన గుణవిశేషఙ్గళోపాది ఉపాయోపయోగిత్వమ్ అవళుక్కు ఇల్లామైయాలుమ్, సమాశ్రయణైకాంతమాన సౌశీల్యాదిగుణోదయవిరోధియాన స్వాతంత్ర్యత్తై పురుషకారభూతైయాన ఇవళ్ ఆற்றినాలుమ్ అవన్ కార్యమ్ శెయ్యుమ్ పోదైక్కు రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే ఎన్గిఱపడియే ఉపాయప్రార్థన రూపమాన ప్రపత్తి వేణుకైయాలుమ్, విన్నై తీర్ క్కుమ్ ఎన్గిఱ ఇడమ్ కళైవాయ్ తున్బమ్ కళైయాదొழివాయ్ కళైకణ్ మற்றిలేన్ ఎన్గిఱవరుడైయ ఉక్తియాకైయాలే, ఇత్తిరువాయ్ మొழి అనుసంధిత్తవర్కళ్ పక్కల్ ఇవళుక్కుణ్డాన ఆదరాతిశయ ప్రకాశకమాకైయాలుమ్, ఇవళుక్కు ప్పురుషకారభావత్తిలే నోక్కాక క్కడవదు.

ఇవళుక్కు ఉపాయభావత్తిల్ అన్వయముణ్డాకిల్, సాధనభూతమాన కర్మజ్ఞానాదికళుక్కు ఫలమతః, స ప్రీతోఽలం ఫలాయ ఎన్టు ఆరాధన ప్రీతనాన ఈశ్వరముఖత్తాలే ఇష్టానిష్టప్రాప్తిపరిహారరూపమాన ఫలసిద్ధి ఇవళాలే యాదల్, అఙ్గనన్టియిలే, ఫలోపపాదనహేతువాన జ్ఞానశక్త్యాదికళుక్కు ఉత్పాదకైయాదల్ ఆకవేణుమ్. తాన్ ఫలప్రసాదికైయాకిల్, య స్సర్వజ్ఞ స్సర్వవిత్, పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ, తేజోబలైశ్వర్యమహాబోధసువీర్య శక్త్యాదిగుణైకరాశిః ఎన్టు శ్రుతిస్మృతికళిల్ ఈశ్వరనుక్కు చ్చొల్లుకిఱ జ్ఞానశక్త్యాది

గుణవిశేషఙ్గళిన్డియిలే ఒழியయవేణుమ్. ఉణ్డాకిల్, ఇవళై యొழியయ యవనే ఈశ్వరన్డానే కార్యమ్ శెయ్య క్షమనే. ఇగ్గుణఙ్గళై ఉత్పాదిక్కిఱాళాకిల్, గుణఙ్గళుక్కు స్వాభావికత్వ మిన్డియిలే ఒழியయుమ్.

సౌశీల్యాదికళోపాది తిరోహితమానవற்றை ప్రకాశిప్పిక్కిఱా –ఎన్నిల్, జగత్సృష్టిస్థితి సంహారాదికళిలే ఇడైవిడామల్ వినియోగమ్ కొణ్డుపోరుకిఱ జ్ఞానశక్త్యాదికళుక్కు సౌశీల్యాదితిరోధాయకమాన స్వాతంత్ర్యత్తోపాది ఒరు తిరోధానమిల్లైయే. ఉణ్డాకిల్ సృష్ట్యాదికళ్ నడవాదొழியయవేణుమ్. సర్వదా అన్వితమాకిల్ స్వవిరోధినివృత్తియిల్, తత్తస్య సదృశం భవేత్ ఎన్డిరుక్కక్కడవాదే, గుణవిశేషఙ్గళే అమైకైయన్డో. ఆశంసేయం హరిశ్రేష్ఠ క్షిప్రం మాం ప్రాప్స్యతే పతిః, అంతరాత్మా హి మే శుద్ధః తస్మింశ్చ బహవో గుణాః ఎన్డు తన్ పక్కల్ అనన్యోపాయత్వముమ్, అవన్ పక్కల్ గుణవిశేషఙ్గళుమ్ ఫలసిద్ధిక్కు అపేక్షితమాకత్తాన్ అఱుతియిట్టు వైత్తదు.

నామ్ ఉపాయమాక యాదొరు వస్తువై స్వీకరిక్కిఱోమ్, అవ్వస్తువుక్కు ఇవళ్ స్వరూపమ్ నిరూపకమాకైయాలే, ప్రణవత్తిల్ ప్రథమపదత్తిఱ్పోలే యద్యపి సచ్చిత్తః ఎన్గిఱ గుణసిద్ధిన్యాయత్తాలే అవర్జనీయమాయ్ అన్వయియాదో? ఎన్నిల్, స్వరూప నిరూపకత్వేన అవర్జనీయబంధ ముణ్డేయాకిలుమ్, ఉపాయదశైయిల్ కణ్డుకొళ్వదొరు ప్రయోజనమిల్లామైయాలే, స్వరూపనిరూపకఙ్గళాన జ్ఞానానందఙ్గళోపాదియుమ్, స్వరూపాశ్రయమాన గుణాంతరఙ్గళోపాదియుమ్ కుమరిరున్దు పోమత్తనై.

ఇవற்றைక్కు ప్రయోజనమిన్డిక్కే, ఇరుక్కైక్కు హేతు అవనుడైయ నైరపేక్ష్యమాకిల్, శిల గుణవిశేషఙ్గళ్ ఉపాయతయా అన్వయిక్కిఆపడి ఎన్? ఎన్నిల్, అవై కార్యోపయోగి యాకైయాలుమ్, గుణత్వేన అపృథక్ బుద్ధిప్రవర్తకమాకైయాలుమ్, గుణిగుణద్వారా కార్యమ్ శెయ్కై నైరపేక్ష్యత్తుక్కు క్కుఱైయిల్లై యాకైయాలుమ్, అవற்றுక్కు త్తటిల్లై. ఇవళ్ కార్యానుపయుక్తై యాకైయాలుమ్, ద్రవ్యత్వేన పృథక్

బుద్ధిప్రవృత్తియోగ్యతై యుణ్డాకైయాలుమ్, అత్తాలే ఉపాయనైరపేక్షత్తుక్కు క్కొత్తైయా యఱుకైయాలుమ్, ఉపాయభావత్తిల్ అన్వయమిల్లై, ఆకైయాలే, శేషిత్వదశైయిలుమ్, ప్రాప్యత్వదశైయిలుమ్ ఒరు మిథునమే యాకవేణ్డిన వోపాది, ఉపాయదశైయిలే స్వేతరసకల సహాయానహమాయిరుక్కైయాలే ఇవళుక్కు ఉపాయభావత్తిల్ అన్వయమిన్ఱియిలే, పురుషకారభావత్తిలే యాకక్కడవదు.

ఇచ్చేతనరోట్టై సంబంధమ్ ఈశ్వరనుక్కుమ్, పిరాట్టిక్కుమ్ ఒత్తిరుక్క, అవన్ పురుషకారద్వారా సమాశ్రయణీయనాకైక్కుమ్, ఇవళ్ పురుషకారభూతైయా యిరుక్కైక్కుమ్ హేతు ఎన్? ఎన్నిల్, అవన్ పురుషోత్తమనాయ్, పుంస్త్వప్రయుక్తమాయ్ వరుమ్ కాఠిన్యమ్ నడైయాడుకైయాలుమ్, దేవదేవో హరిః పితా ఎన్గిఱపడియే పితృత్వప్రయుక్తమాయ్ వరుమ్ హితపరత్వత్తాలుమ్, అదుక్కు మేలే, స్వేతరసకల పదార్థ సార్థనిరుపాధిక నిర్వాహకనాకైయాలే దహ, పచ ఎన్నుమ్బడియాన క్రౌర్యత్తాలుమ్, అవనై ఆశ్రయిక్కుమ్బోదు పురుషకారద్వారా ఆశ్రయిక్కవేణుమ్. ఇవళ్, నారీణా ముత్తమై యాకైయాలే స్త్రీత్వప్రయుక్తమాయ్, వరుమ్ మార్దవత్తాలుమ్, త్వం మాతా సర్వదేవానామ్ ఎన్గిఱపడియే మాతృత్వప్రయుక్తమాన వాత్సల్యాతిశయత్తాలుమ్, తత్తత్కార్యానుగుణ నిర్వహణమిల్లామైయాల్ వరుమ్ మాధుర్యత్తాలుమ్ అవనిఙ్గాట్టిల్ ఇవళుక్కు నెడువాశి యుణ్డాకైయాల్ ఇవల్ పురుషకారభూతైయాకక్కడవళ్.

ఈ సూక్తుల అనువాదం ఏమంటే–

శ్రీమన్నారాయణ చరణౌ అని ఉపాయంగా చెప్పబోయే నారాయణునకు విశేషణంగా శ్రీమత్త్వాన్ని చెప్పేటట్లు అయితే, నారాయణ పదం చేత చెప్పబోయే గుణ విశేషాలు విశేషణంగా ఉపాయ శరీరంలో అన్వయాన్ని పొందేటట్లు ఈమె కూడా ఉపాయంలో అందంగా అన్వయాన్ని పొందినదై, తల్లిదండ్రులు ఇద్దరు కలసి

సంతానాన్ని రక్షించడం అనేది తగినది కనుక ,అంతే కాకుండా, వేఱి మాఱాద పూమేలిరుపాళ్ విన్నై తీర్ క్కుమ్ (సువాసన మారని తామర పువ్వులో నివసించే లక్ష్మీదేవి మన పాపాలను తీరుస్తుంది) అనే విధంగా ఉపాయకృత్యమైన పాపాలను తీర్చడం అనేది ఈ సూక్తిలో నిష్టను కలిగిన నమ్మాళ్వారుల సూక్తి చేత వారికి అభిమతం అనే విషయం సిద్ధిస్తున్నదై, వేరొక సందర్భాలలో ఈమెను పురుషకారంగా భావించి చెబుతున్నారు అనే విషయం కూడా ఉపాయత్వంలోనే అన్వయించడానికి వీలవుతున్నదై, ఇంతే కాక, అరిః ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా –శత్రువైనా శరణాగతి చేస్తే ప్రాణాలను విడిచి అయినా రక్షించాలి అని చెప్పిన విధంగా ఆచరించబోయే ప్రపత్తియే పురుషకార కృత్యాన్ని కి చేయగలిగినది కనుక, లేకపోతే ఈమె భగవంతుని స్వాతంత్ర్యాన్ని ఉపశమింపజేసి భగవంతుని, జీవుని ఒకటిగా చేర్చగా, ఉపాయభూతుడైన భగవంతుడు రక్షించడం వీలవుతుంది గనుక ఉపాయంలో అన్వయించిన ఈ జీవుని ప్రపత్తి అనుష్ఠానం నిష్ఫలం అయ్యేటట్లుగా ఉండగా, లక్ష్మీదేవికి ఉపాయంగా అన్వయం లేదు, పురుషకారంలోనే అన్వయం అని పరిమితం చేసి చెప్పేవారు ఎవరు? అని అంటే,

లక్ష్మీదేవికి నారాయణ పదంలో విశేషణంగా ఉండే స్థితి ఉన్నప్పటికీ, విశేషణంగా ఉండే గుణవిశేషాలవలె ఉపాయోపయోగిత్వం ఆమెకు లేనందు వల్ల, ఆశ్రయించడానికి ఏకాంతమైన సౌశీల్యం మొదలైన గుణాలు ఉదయించడానికి అడ్డుగా ఉండే భగవంతుని స్వాతంత్ర్యాన్ని పురుషకార రూపిణి అయిన ఈమె ఉపశమింపజేసినా, అతడు కార్యాన్ని చేసేటప్పుడు, రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే – రక్షింపబడే జీవుని ప్రార్థనను భగవంతుడు అపేక్షిస్తాడు– అనే విధంగా ఉపాయ ప్రార్థనా రూపమైన ప్రపత్తి ఆవశ్యకం కనుక, విన్నై తీర్ క్కుమ్ – పాపాలను తీరుస్తుంది– అనే సందర్భంలో కళైవాయ్ తున్బమ్ కళైయాదొழிவాయ్ కళైకణ్ మற்றిలేన్– నీవు నా పాపాలను

తీర్చినా, తీర్చకపోయినా, నీవు తప్ప వేరొక రక్షకుడు లేరు– అనే విధంగా ఈ సూక్తిని అనుసంధించినవారి విషయంలో లక్ష్మీదేవికి ఉండే ఆదరాతిశయప్రకాశకం కనుక, ఈమెకు పురుషకార భావంలోనే అన్వయం తగినది.

ఈమెకు ఉపాయత్వంలో అన్వయం ఉన్నట్లయితే సాధనం గా ఉండే కర్మజ్ఞానాదులకు ఫలమతః – ఫలం భగవంతుని వల్లనే సిద్ధిస్తున్నది, స ప్రీతోఽలం ఫలాయ– ప్రీతిని పొందిన భగవంతుడు ఫలాన్ని ఇవ్వడంలో సమర్థుడు.– అని చెప్పిన విధంగా ఆరాధన చేత సంతోషించిన ఈశ్వరుని ద్వారా అనే ఇష్ట ప్రాప్తి రూపమైన ఫలసిద్ధి ఈమెవల్ల కాని, ఆ విధంగా కాకుండా, ఫలాన్ని కలిగించడానికి హేతువైన జ్ఞాన శక్త్యాదులను ఉపపాదకం కావాలి. తాను ఫల ప్రసాదకం అయితే, యః సర్వజ్ఞః సర్వవిత్ – ఎవడు సర్వజ్ఞుడో, అన్నిటినీ పొందేవాడో– అని, పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ – ఈ పరమాత్మ యొక్క శక్తి గొప్పది అనేక విధాలయినది, జ్ఞానం, బలం, క్రియ అనపడేవి కూడా ఆ విధంగానే గొప్పవి, అనేక విధాలయినవి –అని, తేజోబలైశ్వర్య మహావబోధ సువీర్యశక్త్యాది గుణైకరాశిః– తేజస్సు, బలం, ఐశ్వర్యం, గొప్ప జ్ఞానం, గొప్ప వీర్యం, శక్తి మొదలైన గుణాలకు అద్వితీయమైన రాశి– అని శ్రుతులలో, స్మృతులలో చ భగవంతునకు చెప్పబడే జ్ఞాన శక్త్యాది గుణవిశేషాలు లేకుండా పోవలసి వస్తుంది. ఉన్నట్లయితే, ఈమె లేకుండానే భగవంతుడు స్వయంగా కార్యం చేయగలిగిన సమర్థుడే. ఆ గుణాలను ఈమెఉత్పత్తి చేస్తుంది అంటే, గుణాలకు సాభావికత్వం లేకుండా పోతుంది.

సౌశీల్యం మొదలైన, కప్పబడిపోయిన గుణాలనుఈమె ప్రకాశింప చేస్తుంది అని అంటే, జగత్తు యొక్క సృష్టి స్థితి సంహారాదులలో నిరంతరంగా ఉపయోగపడే జ్ఞానం, శక్తి మొదలైనవానికి సౌశీల్యం మొదలైనవానిని తిరోధానం చేసే స్వాతంత్ర్యం మొదలైనవానివలె ఏ విధమైన తిరోధానం లేదు కదా. ఉంటే, సృష్టి మొదలైనవి జరగకుండా ఉండాలి. సర్వదా అన్వయించినవి అయితే, స్వవిరోధినివృత్తిలో తత్తస్య

సదృశం భవేత్ – రావణుని సంహరించి, నన్ను రక్షించడం అనేది రామునకు తగినది అనే విధంగా సీతాదేవి వేచి ఉండేది కాదు కదా. గుణ విశేషాలే ఆమెను రక్షించడానికి చాలు కదా. ఆశంసేయం హరిశ్రేష్ఠ క్షిప్రం మాం ప్రాప్స్యసే పతిః, అంతరాత్మా చ మే శుద్ధః తస్మింశ్చ బహవో గుణాః – ఆంజనేయ! నా భర్త అయిన శ్రీరాముడు త్వరగా నా దగ్గరకు వస్తాడు అని నేను నమ్ముతున్నాను నా ఆత్మ పరిశుద్ధమైనది ఆ శ్రీరామునిలో కళ్యాణ గుణాలు అనేకంగా ఉన్నాయి– అని తన పట్ల అనన్యోపాయత్వం, భగవంతుని పట్ల గుణవిశేషాలే ఫలసిద్ధికి అపేక్షితాలుగా కదా నిశ్చయింపబడింది.

మనం ఉపాయంగా ఏ వస్తువును,అంటే, భగవంతుని స్వీకరిస్తున్నామో, ఆ వస్తువుకు, అంటే, భగవంతునకు ఈమె స్వరూప నిరూపకం అయినందున, ప్రణవంలో ప్రథమ పదంలోవలె, యద్యపి సచ్చితః అనే వన గుణ సిద్ధిన్యాయంతో అవర్జనీయమై ఉపాయంగా అన్వయించదా? అని అంటే స్వరూప నిరూపకం అయినందున విడువడానికి వీలులేని సంబంధం ఉన్నప్పటికీ ఉపాయ దశలో గమనించడానికి ప్రయోజనం ఏమీ లేనందున, స్వరూపనిరూపకాలైన జ్ఞానానందాలవలె, స్వరూపాశ్రయమైన గుణాంతరాలవలె మిణుకు మిణుకు మంటుంది, అంతే.

వీటికి ప్రయోజనం లేకుండా పోవడానికి హేతువు భగవంతుని నైరపేక్ష్యమే అయితే, కొన్ని గుణ విశేషాలు ఉపాయంగా ఏ విధంగా అన్వయిస్తున్నాయి? అని అంటే, అవి కార్యానికి ఉపయోగించేవి కనుక, గుణాలుగా అపృథక్ బుద్ధి ప్రవర్తకాలు కనుక, గుణి అనేది గుణం ద్వారా కార్యం చేయడం అనేది గుణినైరపేక్ష్యానికి ఏ కొరత లేనందు వల్ల, వాటికి ఏ ఆటంకం లేదు. ఏమి కార్యానికి ఉపయోగించేది కాదు గనుక ద్రవ్యంగా బుద్ధి ప్రవృత్తి యోగ్యత ఉన్నది కనుక దానివల్ల ఉపాయనైరపేక్ష్యానికి.

ఆచార్యసార్వభౌములైన పెరియవాచ్చాన్ పిళ్ళై ఈవిధంగా నిర్ణయించడానికి కారణం ఏమంటే–

ఆకించన్యైకశరణాః కేచిద్భాగ్యాధికాః పునః,
యత్పదాంభోరుహద్వంద్వం ప్రపద్య ప్రీతమానసాః,
లక్ష్మీం పురుషకారేణ వృతవంతో వరానన! ,
మత్ క్షమాం ప్రాప్య సేనేశ! ప్రాప్యం ప్రాపకమేవ మామ్,
లబ్ధ్వా కృతార్థాః ప్రాప్స్యంతే మామేవానన్యమానసాః

(అందమైన ముఖాన్ని కల్గిన ఓ సేనాధిపతీ! ఏ ఉపాయానుష్ఠానాన్ని చేయకపోవడమనే ఆకించన్యాన్నే ఆలంబనంగా (శరణంగా) కల కొందఱు భాగ్యశాలురైతే, నా శ్రీచరణపదయుగాన్నే ప్రేమతో కూడిన మనస్సు కలవారై శరణుపొంది, లక్ష్మీదేవిని పురుషకారంగా ఆశ్రయించి, నా క్షమకు లక్ష్యభూతులై, నన్నే ప్రాప్యప్రాపకాలుగా ఆశ్రయించి కృతార్థులై, వేఱు దేనిలోను మనస్సు ప్రవేశించనివారై, నన్ను పొందుతారు) అని,

అహం మత్ప్రాప్త్యుపాయో వై సాక్షాత్ లక్ష్మీపతిః స్వయమ్,
లక్ష్మీః పురుషకారేణ వల్లభా ప్రాప్తియోగినీ,
ఏతస్యాశ్చ విశేషోఽయం నిగమాంతేషు శబ్ద్యతే

(లక్ష్మీపతిని అయిన నేనే నన్ను ఆశ్రయించడానికి ఉపాయమవుతున్నాను. నాకు ఇష్టురాలైన లక్ష్మీదేవి పురుషకారంతో నన్ను ఆశ్రయించడంలో సహాయపడుతున్నది. పురుషకారత్వమనే ఈ గొప్పతనం ఈమెకు వేదాంతాలలో చెప్పబడుతున్నది) అని,

మత్ప్రాప్తిం ప్రతి జంతూనాం సంసారే పతతా మధః,
లక్ష్మీః పురుషకారత్వే నిర్దిష్టా పరమర్షిభిః,
మమాపి చ మతం హ్యేతత్ నాన్యథా లక్షణం భవేత్

(సంసారంలో కిందపడే(బాధపడే)– జీవులకు, నన్ను ఆశ్రయించే విషయంలో లక్ష్మీదేవి గొప్ప ఋషులచే పురుషకారంగా నియమింపబడింది. పురుషకారస్వరూపిణిగా చెప్పబడింది. నాకు కూడా ఇదే ఇష్టం. వేఱయిన అంటే, ఉపాయత్వమనే ఆకారం లేదు) అనే ఈ పాంచరాత్రవచనాలే (కారణం.)

(సఖివాన్ విష్ణుః వ్రజం చ అపోర్ణుతే)– సహచరులతో కూడిన విష్ణువు మేఘాన్ని ఏ లోటు లేకుండా చేస్తున్నాడు. ఇంద్రుడు, వరుణుడు మొదలైనవారితో కూడిన భగవంతుడు లోకానికి వర్షం కురిపించడంద్వారా ఇహలోక ఫలాలను అనుగ్రహిస్తున్నాడు– అని అర్థం. పైరులు చిగిర్చి, వర్థిల్లడానికి కారణమైన వర్షాన్ని కురిపించడమనేది ఇహలోక ఫలాలను అనుగ్రహించడంలో గొప్పది కనుక, దానిని ప్రస్తావించి మిగిలినవానిని వానిద్వా  వేదపురుషుడు లక్షిస్తున్నాడు, ఇంద్రుడు వర్షాన్ని కురిపిస్తున్నాడు. ఆழிமழை க்கண்ணா! అయిన వరుణుడు వర్షాన్ని కురిపిస్తున్నాడని లోక ప్రసిద్ధి అయినా, వారిని నిమిత్తమాత్రంగా గ్రహించి, వర్షం మొదలైన ఇహలోక ఫలాలను అనుగ్రహించేవాడితడే– అనే మహార్థాన్ని ఈ మంత్రం తెల్పుతున్నది.

కామై స్తై స్తైః హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః,
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్వయా,
యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్,
స తయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే,
లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్

(తమ పాపవాసనలతో కూడినవారై, దానికి తగిన త్రిగుణమయాలైన, కోరబడే విషయాలతో నా స్వరూపవిషయంలోని వారి జ్ఞానం నశించినవారై, ఇంద్రుడు మొదలైన అన్యదైవాలను శరణు పొందుతున్నారు. నాకు శరీరభూతమైన ఏ యే దైవాన్ని శ్రద్ధతో ఏ యే మానవుడు పూజించగోరుతున్నాడో, ఆ యా మానవునకు, ఆ శ్రద్ధను నేను స్థిరంగా ఉండేటట్లు చేస్తున్నాను. ఆ శ్రద్ధతో కూడిన అతడు, ఆ దైవం యొక్క ఆరాధనను కోరుతున్నాడు. దానివల్లనే (నిజానికి) నాచేతనే అనుగ్రహింపబడిన ఆ కోరిన వస్తువులను ఇతడు పొందుతున్నాడు) అని శ్రీకృష్ణుడు,

అవరవర్ తమతమ దఱివఱివకై వకై
అవరవర్ ఇఱైయవర్ ఎనవడి అడైవర్కళ్,
అవరవర్ ఇఱైయవర్ కుఱైవిలర్ ఇఱైయవర్,
అవరవర్ విదివ**ழி** అడైయ నిన్దనరే అని
నమ్మాళ్వార్లు ఈ అర్థాన్ని అనుగ్రహించారు.

ఈ విధంగా ఈ మంత్రంతో సకల ఫలప్రదుడు విష్ణువే– అనే అర్థం స్థిరీకరింపబడింది.

17) ఆ యో వియాయ సచథాయ దైవ్య ఇంద్రాయ విష్ణుః సుకృతే సుకృత్తరః।
వేధా అజిన్వత్ త్రిషధస్థ ఆర్య మృతస్య భాగే యజమానమాభజత్॥

యః విష్ణుః= ఏ విష్ణువు, దైవ్యః= పరమపదంలో ఉండేవాడై, సుకృత్తరః= సత్ఫలాలను అనుగ్రహించేవారిలో గొప్పవాడై, సుకృతే = (స్తుతి అనే) సత్కార్యాన్ని చేసే, ఇంద్రాయ= ఇంద్రునకు, సచథాయ = సహాయాన్ని చేయడంకోసం, ఆవియాయ = (స్వర్గానికి) వేంచేస్తున్నాడో, త్రిషధస్థః వేదాః= త్రిపాద్విభూతిలో ఉండేవాడై, సకలఫలవిధాత అయిన ఆ విష్ణువే, ఆర్య= మంచివాడు, యజమానం = (తనకు ఉద్దేశించి) ఆరాధించేవాడైన ఇంద్రుని, అజిన్వత్ = సంతోషింపజేసు . ఋతస్య= యజ్ఞంయొక్క, భాగే = హవిర్భాగంలో, ఆభజత్ = (అతనిని) స్థిరంగా నిలుపుతున్నారు.

వ్యాఖ్య : గడచిన మంత్రంలో ఉదోషింపబడిన సకలఫలప్రదత్వాన్ని ఇంద్రుని విషయంలో పరమాత్మ చూపిన రీతిని నిరూపించడం ద్వారా స్థిరీకరించి, ఈ మంత్రంద్వారా వేదపురుషుడు ఉపసంహరిస్తున్నాడు.

(యః విష్ణుః)– ఎవడు సర్వవ్యాపకుడనే ప్రసిద్ధిని పొందాడో– అని అర్థం.

యచ్చ కించిత్ జగత్ సర్వం దృశ్యతే శ్రూయతేపి వా,
అంతర్బహిశ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః

(ఈ లోకంలో కన్పించే, వినిపించే అన్నిటి లోపల బయట వ్యాపించి నారాయణుడు ప్రకాశిస్తున్నాడు) అని వేదాలలో అధ్యయనం చేయబడేవాడెవడో, అతడు– అని భావం.

(దైవ్యః) - తద్విష్ణోః పరమం పదమ్ అని వేదాంతాలలో కీర్తింపబడే పరమపదంలో ఉండేవాడు.

(సుకృత్తరః)– గడచిన మంత్రంలో శోభనఫలప్రదులలో మిక్కిలి గొప్పవాడుగా నిరూపింపబడినవాడు– అని అర్థం.

దేవేంద్రస్త్రిభువన మర్థ మేకపింగః సర్వర్థిం త్రిభువనగాం చ కార్తవీర్యః,
వైదేహః పరమపదం ప్రసాద్య విష్ణుం సంప్రాప్త స్సకలఫలప్రదో హి విష్ణుః
(విష్ణుధర్మమ్–4347)

(విష్ణువును ఆరాధించి దేవేంద్రుడు ముల్లోకాధిపత్యాన్ని, కుబేరుడు సంపదను, కార్తవీర్యుడు ముల్లోకాలలో వ్యాపించిన అన్ని వస్తువులను, జనకమహారాజు పరమపదాన్ని పొందారు. విష్ణువు సకల ఫలప్రదుడు కదా! ) అని జ్ఞానులచే ఉద్ఘోషింపబడేవాడు.

(ఆవియాయ)– అంతటా అవతరించాడు. ఎందుకు? అంటే,

(సచథాయ)– (యుద్ధం మొదలైనవానిలో) సహాయం చేయడంకోసం– అని అర్థం. ఎవరికి? అంటే,

(ఇంద్రాయ)– ఇంద్రునకు, అతనికోసం– అని అర్థం. ఈ విధంగా సహాయపడడానికి ఏమి కారణం? అంటే,

(సుకృతే)– తన విషయమైన స్తుతి మొదలైన సత్కార్యాలను చేసినవానికి. ఇక్కడకు వచ్చి, ఇంద్రునకు ఇతడు చేసిన సహాయాలు ఏమి?అంటే,

(త్రిషధస్థః)– త్రిపాద్విభూతిలో ఉండే ఇతడు– అని అర్థం.

పాదోస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి

(ఈలోకంలో ఉండే జీవరాశులంతా ఇతనికి నాల్గవ భాగం. పరమపదంలో ఇతనికి నాల్గింటిలో మూడు భాగాలున్నవి) అని మూడు రెట్లుగా చెప్పబడిన పరమపదం ఇక్కడ సూచింపబడింది. ఈ విభూతి, ఆ విభూతి– అనే రెండు అనంతమైనా, దీనికంటే అది మూడు రెట్లు పెద్దది– అని అనబడుతున్నది. ఇక్కడ మూడు రెట్లు అనేది బహుత్వాన్ని సూచిస్తుంది. అనంతమైనవానిలో కూడా తారతమ్యం ఉన్నది– అనేది గణితశాస్త్రజ్ఞులు కూడా దర్శించిన సత్యం. ఈ విభూతిద్వయవిషయమైన పాదశబ్దం, త్రిపాచ్ఛబ్దం ఆల్పత్వబహుత్వాలకు ఉపలక్షణం, ఇంతే తప్ప, పరిచ్ఛేదపరం కాదు. లీలావిభూతిలో అండాలు అసంఖ్యాతాలు కదా అని దీపప్రకాశంలో పెరియవాచ్చాన్పిళ్ళై శిష్యులైన వాదికేసరి అழకియమణవాళచ్చీయర్ పలికారు.

దివి ఇతి అప్రాకృతం స్థానముచ్యతే. త్రిపాత్త్వం చ అప్రాకృతైః భోగ్యభోగోపకరణ భోగస్థానవిశేషైర్వా భూషణాస్త్రాదిరూపేణ జగదంతర్గత వస్త్వభిమానిభిః నిత్యైః భగవదనుభవమాత్రపరైశ్చ నిత్యసిద్దైః ముక్తై శ్చాత్మభిర్వా సంభవతి (శ్రుతప్రకాశిక)

(దివి అని ప్రకృతికార్యం కాని పరమపదం చెప్పబడుతున్నది. దీనికి మూడు రెట్లు, అంటే,అప్రాకృతమైన భోగ్య, భోగోపకరణ భోగస్థానాలనే మూడు రీతులలో ఉన్నందున ఏర్పడినది కావచ్చు. . లేక, భగవానునకు భూషణం, అస్త్రం మొదలైనవాని రూపంలో ఉండే లోకంలో అంతర్భవించిన ప్రకృతి, మహత్తు, అహంకారం, ఆత్మ. మనస్సు మొదలైన వస్తువులకు అభిమానిదేవతలైన నిత్యమూర్తులు, ఈ విధంగా కాకుండా భగవదనుభవాన్ని మాత్రం చేస్తూ ఉండే నిత్యులు, ముక్తాత్మలు– అనే మూడు

విధాలుగా ఉండే ఆత్మలను కల్గినదై ఉన్నందున ఏర్పడినది కావచ్చు) అని శ్రుతప్రకాశికాచార్యులవారు వివరించారు.

ఈ కారణాలవల్లనే ఇక్కడ పరమపదనిలయుడైన భగవంతుడు త్రిషధస్థః అని అనబడుతున్నాడు. (యాగంలో) సవనత్రయాలను స్థానంగా కలవాడు. లేక, భూమి మొదలైన లోకత్రయాలను స్థానంగా కలవాడు అని సాయణభాష్యం.

(వేధాః)– అన్ని ప్రయోజనాలను (ఇంద్రునకు) ఇస్తున్నాడు. అతని సంపదలకు అసురులవల్ల ఆపదలు కల్గితే ఆ ఆపదలను పోగొట్టి, వాటిని తిరిగి ఇస్తాడు.

(ఆర్యమ్)– సత్పురుషుడైన ఇంద్రుని– సత్యగుణ ప్రధానుని– అని అర్థం. ఆగంతవ్యమ్ (సమీపించదగినవానిని) –అని సాయణభాష్యం.

(అజిన్వత్)– ఈ విధంగా సకలప్రయోజనాలను అనుగ్రహించడం ద్వారా ఉపకరిస్తాడు. జిని అనే ధాతువు సంతోషింపజేయడం– అనే అర్థాన్ని కల్గినది.

(యజమానమ్)– తనను ఆరాధించే ఇంద్రుని– అని అర్థం. యజ–దేవపూజాయామ్ అని ధాతువు.

(రుద్రస్య భోగే ఆభజత్)– యజ్ఞంలో హవిర్భాగాన్ని కలవాడు అయేట్లు చేశాడు. వేధాః అనేచోట తెలుపబడిన ఫలాలలో ఒకటి ఉదాహరింపబడుతున్నది.

ఈ విధంగా ఇంతవరకు ఇంద్రాయ అనే దానికి ముఖ్యార్థాన్ని గ్రహించి, యజమానాయ అనేదానికి గౌణమైన అర్థాన్ని గ్రహించి, మంత్రం వివరింపబడింది. యజమానాయ అనే దానిని ముఖ్యంగా గ్రహించి యాగంలో యజమానునకు పరమపురుషుడు ఉపకరించడాన్ని సూచిస్తున్నదని సాయణులు భాష్యం రచించారు. అప్పుడు మంత్రానికి అర్థాన్ని ఈ విధంగా చెప్పాలి.

(ఇంద్రాయ)– ఇరాం హవిర్లక్షణాంతమ్ ద్రావయతీతి ఇంద్రో యజమానః (ఇరా అనబడే హవిస్సును (అగ్నిలో సమర్పించి) నశింపజేస్తున్నాడు. కనుక యజమాని ఇంద్రుడవుతున్నాడు–) అని సాయణభాష్యం.

(సుకృతే ఇంద్రాయ సచథాయ సుకృత్తరః దైవ్యః యః విష్ణుః ఆవియాయ)– స్తుతులను చేసే యజమానునకు యాగంలో సహాయం చేయడం కోసం శుభఫలాలను అనుగ్రహించేవారిలో గొప్పవాడై, పరమపద నిలయుడైన ఏ విష్ణువు వేంచేసి ఉన్నాడో– అని అర్థం.

(త్రిషధస్థః వేధాః ఆర్యమ్ అజిన్వత్)– సవనత్రయస్థానాలలో ఉండేవాడై, యజమాని కోరిన ఫలాలను అనుగ్రహించేవాడైన విష్ణువు, పొందదగినవాడైన యజమానునకు ఉపకరిస్తున్నాడు.

(యజమానమ్ ఋతస్య స్వభాగే ఆభజత్) – యాగం చేసేవానికి హుతశేషరూపమైన యజ్ఞభాగాన్ని పొందిస్తున్నాడని అర్థం. లేక, యజ్ఞం యొక్క ఫలాన్ని యజమానునకు పొందిస్తున్నాడని కూడా అర్థం. ఈ విధంగా దీనిద్వారా

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ (గీత–9–24)

(నేనే అన్నియాగాలను భుజించేవాడను, వాటికి ఫలాన్ని ఇచ్చేవాడను కూడా నేనే) అని శ్రీకృష్ణుడు గీతలో చూపిన అర్థం వివరింపబడింది.

ఇక, ఋగ్వేదం అయిదవ అష్టకం, ఆఱవ అధ్యాయం, ఇరవై నాల్గవ వర్గం (దీనికి సమానమైన సప్తమమండలం, ఆఱవ అధ్యాయం 99వ సూక్తం) నుండి ఆరంభించి ఉండే విష్ణుసూక్తాలు వివరింపబడుతున్నాయి.

1. పరో మాత్రయా తన్వా వృధాన న తే మహిత్వ మన్వశ్నువంతి |
ఉభే తే విద్మ రజసీ పృథివ్యా విష్ణో! దేవ! త్వం పరమస్య విత్సే ॥

మాత్రయా = చాలా పెద్ద, తన్వా =తిరుమేనితో, వృధాన= పెరిగిన దేవ దేవుడవైన, విష్ణో = ఓ విష్ణూ! , పరః= నీవు చాలా గొప్పవాడవు, తే = నీయొక్క, మహిత్వం = గొప్పతనాన్ని, న అన్వశ్నువంతి = (పరిచ్ఛేదించి)

అనుభవించేవారెవ్వరూలేరు, పృథివ్యాః= భూమినుండి ఆరంభించిన, తే = నీయొక్క, ఉభే రజసీ= రెండు పాదస్థానాలను, విద్మ=తెలిసికొంటున్నాము, పరమస్య = దానికి మించిన మూడవ పాదన్యాసాన్ని, త్వమ్ = నీవే, విత్సే= తెలియగలవు.

త్రీణి పదా విచక్రమే ఇత్యాది ప్రమాణాలలో భగవంతుడు మూడు పాదాలతో లోకాలను కొలిచినట్లు చెప్పబడుతున్నది. క్రింది లోకాలను ఒక పాదంతో, పై లోకాలను ఇంకొక పాదంతో కొలువడం అనేది అందటికి తెలిసినదే. మూడవ పాదాన్ని ఎక్కడ పెట్టాడు? అంటే, దానిని విష్ణువైన నీవే తెలియగలవు- అని ఈ మంత్రంలో తెలుపబడింది.

నాచ్చియార్ తిరుమొழிలో

కొణ్డ కోలి క్కుఱళురువాయ్ చ్చెన్టు పణ్డు మావలితన్ పెరువేళ్వియిల్,
అణ్డముమ్ నిలనుమ్ అడియొన్టి కొణ్డవన్ వరిల్ కూడిడు కూడలే (4-9)

(దండాన్ని ధరించిన బ్రహ్మచారి రూపుడై వెళ్ళి, పూర్వం మహాబలి యాగంలో బ్రహ్మాండాన్ని, భూమిని ఒక పాదంతో కొలిచినవాడు వచ్చేటట్లయితే కూడిక దేవతలారా! మీరు కూడండి.) అనే పాశురవ్యాఖ్యానంలో –

త్రీణి పదా విచక్రమే ఎన్టుమ్, మూన్టడి నిమిర్ త్తు ఎన్టు ఉణ్డాయిరానిన్టదు. ఇదు ఇరుక్కిఱపడి ఎన్? ఎన్టు భట్టరై క్కేట్క, పరో మాత్రయా తనువా వృథాన న తే మహిత్వ మన్వశ్నువంతి, ఉభే తే విద్మ రజసీ పృథివ్యాః - ఎన్టు వేదపురుషన్ తానే ఇరణ్డడియాల్ అళన్ద విడమ్ ఎల్లారుమ్ అఱియుమ్. నీ మూన్టడియాల్ అళన్ద విడమ్ ఉనక్కే తెరియు మత్తనై ఎన్టు కాణామల్ విట్టాన్. అవన్ అళన్దమై యుణ్ణు, అవనుక్కే తెరియుమత్తనై ఎన్టు అరుళిచ్చెయ్ దర్- ఎన్టు జీయర్ అరుళిచ్చెయ్ వర్ అని పెరియవాచ్చాన్పిళ్ళై ప్రస్తావించిన ఐతిహ్యంలో పరమాచార్యులైన భట్టర్ ఈ మంత్రంలోని అర్థాన్ని వివరించారు. దానిని అనుసరించి ఈ మంత్రార్థం వివరింపబడుతున్నది.

(పరః) – నీవు గొప్పవాడవై ఉన్నావు– అని భావం. ఏ విధంగా గొప్పవాడవు? అంటే,

(మాత్రయా)– అతిమాత్రయా అని అరుంబదవివరణంలోని సూక్తి. చాలా పెద్ద– అని అర్థం. కృత్స్నం జగత్ మాతుం ప్రవృత్తయా (అన్ని లోకాలను కొలువడం ఆరంభించిన) అని యజుర్వేదంలో (అష్టకం2, ప్రశ్నం–8, అనువాకం–3) ఈ మంత్రం యొక్క సాయణభాష్యం.

(తన్వా)– తిరుమేనితో– త్రివిక్రమావతార రూపంతో –అని అర్థం.

(వృథాన)– పెరిగినవాడా! ఓజ్గి ఉలకళన్ద ఉత్తమనే! (ఉన్నతంగా పెరిగి లోకాలను కొలిచిన ఉత్తముడా! ) అని భావం.

(విష్ణో! ) – సర్వవ్యాపివి అయిన ఓ విష్ణూ!

(తన్వా వృథాన విష్ణో! )– స్వరూపంతో అంతటా వ్యాపించి ఉండడం చాలదని, దివ్యమంగళరూపంతో కూడా అంతటా వ్యాపించి విష్ణుత్వాన్ని ద్విగుణీతం చేసినవాడా!

(తే)– అటువంటి నీయొక్క,

(తే మహిత్వమ్)– నీ గొప్పతనాన్ని– అని అర్థం. నీ పరత్వ సౌశీల్యాది గుణాలను– అని భావం. అందటి తలలపై శ్రీపాదాన్ని పెట్టి, లోకం అంతా వ్యాపించి పెరిగిన పరత్వం, బ్రహ్మాదులకు కూడా అందని తిరుమేనిని అందటి కన్నులకు కనబడేటట్లు చేసే సౌశీల్యం, బంధమే హేతువుగా గ్రహించి, జీవుల గుణాగుణనిరూపణం చేయకుండా, వశిష్ఠుడు, ఛండాలుడు– అనే తారతమ్యం లేకుండా అందటి మలినం నిండిన శరీరాలను తన అప్రాకృతమైన శ్రీచరణాలతో స్పృశించిన వాత్సల్యం, దేవదేవుడైన తాను అసురులకు ప్రభువైన మహాబలి ఔదార్యానికి జితుడై, తన సొత్తును అతని దగ్గర యాచించి పొందిన సౌశీల్యం, బ్రహ్మాదులు

శ్రీచరణాలను అభిషేకించేటట్లు స్తుతించేటట్లుగా ఉండే స్వామిత్వం మొదలైన లెక్కలేనన్ని మహాగుణాలను– అని హృదయం.

(న అన్వశ్నువంతి)– పరిచ్ఛేదించి దర్శించి పలుకగలవారు లేరు. లోకంలోని అందరు కాలం ఉన్నంతవరకు దర్శించినా, పరిచ్ఛేదించడానికి సాధ్యం కాదు.

వర్షాయుతై ర్యస్య గుణా న శక్యా వక్తుం సమేతై రపి సర్వలోకైః,
మహాత్మనః శంఖచక్రాసిపాణే: విష్ణోర్జిష్ణో ర్వసుదేవాత్మజస్య
(భారత–కర్ణ–83–65)

(మహాపురుషుడు, శంఖం, చక్రం, ఖడ్గం మొదలైన దివ్యాయుధాలను చేతులలో ధరించినవాడు, సర్వవ్యాపి, జయశీలుడు, వసుదేవుని పుత్రుడైన ఎవని గుణాలు పదివేల ఏళ్ళు అన్ని సకల లోకులు కలసినా వర్ణించలేరో)అని,

చతుర్ముఖాయుర్యది కోటివక్త్రో భవేన్నరః క్వాపి విశుద్ధచేతాః,
స తే గుణానా మయుతైక దేశం, వదేన్న వా దేవవర! ప్రసీద

(పలు బ్రహ్మల ఆయుస్సును కలవాడై, కోట్ల సంఖ్యలోని ముఖాలను కలవాడై, చాలా శుద్ధమైన మనస్సును కలవాడైన ఒక మానవుడు ఉంటే, అతడు నీ గుణాలలో పదివేల భాగాలలో ఒక భాగాన్ని చెప్పగలదో! లేదో! తెలియలేము. దేవతలలో గొప్పవాడా! అనుగ్రహించు)

(దేవః)– దేవా! నీ రూపగుణచేష్టితాలను అందరికి ఉదారంగా దానాన్ని చేసినవాడా! గుణాలతో వెలిగేవాడా! పరదశలో మసకబారిఉండే సౌశీల్యాది గుణాలు ప్రకాశించినవాడా! తనను యాచకునిగా చేసికొని, చిన్న పాదాన్ని, పెద్ద పాదంగా చేసినవాడా! జితం భగవతా జగత్ (భగవంతునిచే లోకం జయింపబడింది) అనే రీతిలో విజిగీషువు అయినవాడా!

(పృథివ్యాః తే ఉభే రజసీ విద్మ) – భూమినుండి కొలువడం ఆరంభించిన నీ రెండు పాదన్యాసాలను తెలిసికొంటున్నాము. అణ్డముమ్ నిలనుమ్ అడి ఒన్టినాల్ (బ్రహ్మాండాన్ని, భూమిని ఒకపాదంతో) అనేటట్లు భూమికి కింద ఉండే లోకాలన్నిటిని ఒక పాదంతో, పైన ఉండే లోకాలన్నిటిని ఒక పాదంతో కొలువడం తెలిసికొంటున్నాము.

ఒణ్మిదియిల్ పునలురువి ఒరు కాల్ నిఱ్ప,
ఒరు కాలుమ్ కామరుశీరవుణ నుళ్ళత్తు,
ఎణ్మదియుమ్ కడన్దణ్డమీదు పోకి
యిరుశవిశుమ్బినూడు పోయ్ ఎழுన్దు,
మేలై త్తణ్ మదియుమ్ కదిరవనుమ్ తవిరవోడి
త్తారకైయిన్ పుఱన్దడవి యప్పాల్ మిక్కు,
మణ్ మழுదు మకప్పడుత్తు నిన్ఱ వెన్దై,
మలర్ పురైయుమ్ తిరువడియే వణఙ్గినేనే

అని తిరుమంగై ఆళ్వార్లు పల్కినట్లుగా, నీ రెండు పాదన్యాసాలను గూర్చి తెలిసికొంటున్నాము. రజః అని అన్నందున వామనన్ మణ్ అయిన ఈ లోకం అంతా భగవంతుని శ్రీచరణాలకు అంటుకొన్న రజస్సు (ధూళి కణసముదాయం)– అని భావం.

(త్వం పరమస్య విత్సే)– దీనికి మించిన మూడవ పాదస్థానాన్ని నీవే తెలియగలవు– అని అర్థం.

రెండవ అష్టకం రెండవ అధ్యాయంలో త్వే ఇదస్య క్రమణే అని ఆరంభమవుతున్న మంత్రంలో ఈ అర్థమే తెలుపబడింది. అక్కడ తృతీయమస్య అనేది ఇక్కడ పరమస్య అని అనబడింది. పరమస్య – ఉత్కృష్టస్య తృతీయస్య పదస్య స్థానమ్ (పరమస్య– గొప్పదైన మూడవ పాదస్థానం) అని సాయణభాష్యం. అస్య పరం త్వమేవ విత్సే– జానాసి (దీనికి మించిన మూడవ పాదస్థానాన్ని నీవే తెలియగలవు) అని అరుంబద వివరణంలో పదపాఠానికి విరుద్ధంగా పదాన్ని విడదీసి అర్థం గ్రహింపబడింది.

ఇక్కడ, మూడవ పాదస్థానం ఏది? అనే విషయంలో త్వమేవ విత్సే అనే ఆ మంత్రం యొక్క వ్యాఖ్యానంలో తెలుపబడిన రెండు నిర్వాహాలు ఇక్కడ అనుసంధేయాలు.

2)న తే విష్ణో! జాయమానో న జాతో దేవ మహిమ్నః పరమంతమాప॥
ఉదస్తభ్నా నాకమృష్వం బృహంతమ్ దాధర్థ ప్రాచీం కకుభం పృథివ్యాః॥

దేవ విష్ణో =దేవుడవైన విష్ణూ! , జాయమానః= పుట్టేవాడు, జాతః= పుట్టినందున, తేః= నీయొక్క, మహిమ్నః= గొప్పతనంయొక్క, పరమ్ అంతమ్ = పరమావధిని, న ఆప = పొందలేదు, ఋష్వం = చూడడానికి అందమైనది, బృహంతం = గొప్పది అయిన, నాకం = పరమపదాన్ని, ఉత్ అస్తభ్నా = ఉన్నతంగా ధరిస్తున్నావు, పృథివ్యాః= భూమియొక్క, ప్రాచీం కకుభం = ప్రాచీనమైన స్థానాన్ని, దాధర్థ = ధరించి ఉన్నావు.

ఉభయవిభూతినాథుడైన నీ గొప్పతనాన్ని మూడు కాలాలలో ఉండే ఎవనికీ తెలియ సాధ్యం కాదు- అని ఈ మంత్రంలో వేదపురుషుడు తెల్పుతున్నాడు. పరమపురుషుని పరత్వాన్ని తెలియడానికి ప్రతిమంత్రం సరిపోయేదేయజుర్వేదానికి నారాయణ పరం బ్రహ్మ అని ఆరంభమవుతున్న మంత్రంతో సాటిగా ఋగ్వేదానికి ఈ మంత్రం వెల్గుతున్నది. వేఱు ఏ దైవానికి ఇటువంటి గొప్పతనం వేదంలో ఎక్కడా చెప్పబడలేదు- అనేది సువ్యక్తం.

(దేవ)- దివు-క్రీడా - అని ధాతువు. జగత్ సృష్టిస్థితి సంహారాలను క్రీడగా కలవాడా! దివు-విజిగీషా అని ధాతువు. అందఱిని జితం తే అని, తోற்றோம்' అని అనేటట్లు పరాజితులను చేసేవాడా! , దివు-వ్యవహారే అని ధాతువు. వేదం కీర్తించే శ్రియఃపతీ! , దివు- -ద్యుతౌ - పరంజ్యోతి అయినవాడా, దివు- మోదే ఆనందమయా! , దివు-మదే -అవాక్యనాదరః (ఎవరితోను మాటలాడనివాడు, ఏ అపేక్ష లేనివాడు) అనే విధంగా మదాన్ని కలవాడా! , దివు-కాంత్యామ్ -అందఱికి భోగ్యమైనవాడా!, దివు-గతౌ ఫలాలను ఇచ్చేవాడా, ఫలస్వరూపుడా!

ఈ విధంగా ఈ అర్థాలన్నీ దివు అనే ధాతువునుండి దేవశబ్దం పుట్టినదని గ్రహించినపుడు ఏర్పడుతున్నాయి. డు దాఞ్–దానే, అవ– రక్షణే అనే ధాతువులనుండి దేవశబ్దం పుట్టినదని భావించినపుడు, సకలఫలప్రదుడా! సర్వరక్షకుడా! అనే అర్థాలు కూడా స్ఫురిస్తాయి.

(విష్ణో! )– ఇన్ని గొప్పతనాలకు కారణమైన వ్యాప్తిని కలవాడా! – అని అర్థం. ఈ విధంగా దేవ! విష్ణో! ఈ రెండు సంబోధనలతో ఇతని గొప్పతనం అంతు లేనిది– అని చూపబడింది.

ఇక, ఈ మహిమ ఎవరికీ పరిచ్ఛేదించడానికి, ఇంతటిది అని కొలిచి తెలియడానికి సాధ్యం కానిదని వివరింపబడుతున్నది.

(జాయమానో న జాతో ఆప) జన్మించేవాడు, పుట్టినవాడెవడూ తెలియలేదు. ఇది జన్మించబోయేవానికి, జన్మ లేని నిత్యసూరులకు, పరమపురుషునకు కూడా ఉపలక్షణం.

సో అఙ్గ వేద యది వా న వేద (తై–ప్రా2–8–9)

(అతడు కూడా తన గొప్పతనాన్ని గూర్చి తెలియగలడో, లేడో) అని వేదం పల్కిన దానిని

తనక్కుమ్ తన్ తన్మై అఱివరియానై (తిరువాయ్–8–4–6)

(తన గొప్పతనాన్ని గూర్చి తనకు కూడా తెలియని వానిని),

తామ్ తమ్ పెరుమై అఱివార్ (పెరియతిరు–5–2–1) (తాము తమ గొప్పతనాన్ని తెలియలేరు) అని ద్రావిడవేదాలు నిశ్చయించాయి. నిత్యుడైన వేదపురుషుడు కూడా నేతి నేతి (బృహ–4–3–6) (బ్రహ్మమనేది ఏతావన్మాత్రం కాదు,

ఇటువంటి వేఱేరదీ లేదు) అని, క ఇత్థా. వేద యత్ర సః (కఠ-1-2-25) (ఆ బ్రహ్మం ఎటువంటిది -అనేది ఎవడు తెలియగలడు?) అని,

యస్యా మతం తస్య మతం మతం యస్య న వేద సః,
అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్ (కేన-2-3)

(ఎవనికి పరబ్రహ్మం పరిచ్ఛేదించి తెలియసాధ్యం కానిది- అని తెలిసినదో, అతనికి అది తెలిసినది అవుతున్నది. ఎవనికి అది పరిచ్ఛేదించి తెలియదగినదిగా అవుతున్నదో (తోస్తున్నదో), అతడు దానిని తెలియలేదు. పరిచ్ఛేదించి తెలిసినవారికి తెలియనిదిగాను, పరిచ్ఛేదించి తెలియని వారికి తెలియబడినదిగాను అది అవుతున్నది) అని ఈ పరమాత్మ యొక్క గొప్పతనం ఎవరికీ తెలియ సాధ్యం కానిది- అని నిశ్చయించాడు. పూర్వం ప్రస్తావించిన వాక్యాలలో తెలియ సాధ్యం కాని గొప్పతనాన్ని కలవాడుగా చెప్పబడ్డవాడు విష్ణువే- అనేదానిని న తే విష్ణో అని ఈ వాక్యం నిస్సందేహంగా నిర్ణయించి తెల్పుతున్నది. జన్మించినవారిలో గొప్పవారైన బ్రహ్మరుద్రాదులు కూడా ఇతని గొప్పతనం తెలియలేరు- అనే విషయం

బ్రహ్మరుద్రేంద్రభూతానాం మనసామప్యగోచరమ్

(బ్రహ్మ, రుద్రుడు ఇంద్రుడు మొదలైనవారి మనస్సుకు కూడా అందనివాడు) అని ఋషులు,

నాన్ ముకన్ శెఙ్గడైయాన్ ఎన్టివర్ కళ్
ఎమ్బెరుమాన్ తన్మైయై యారఱికిఱ్పార్ పేశి యెన్? (తిరువాయ్-8-3-9)

(చతుర్ముఖుడు, ఎఱ్ఱని జటలను కల రుద్రుడు- అనే వీరిలో భగవానుని తత్వాన్ని ఎవరు తెలియగలరు? పలికి ఏమి ఫలం! ) అని ఆళ్వార్లుకూడా ఉద్ఘోషించారు. మహాభారతంలోని మోక్షధర్మంలో బ్రహ్మరుద్రసంవాదంలో

న స శక్య స్త్వయా ద్రష్టుం మయాన్యై ర్వాపి సత్తమ,
సర్వేషాంసాక్షిభూతోఽ సౌ న గ్రాహ్యః కేనచిత్ క్వచిత్,

**తవాంతరాత్మా మమ చ యే చాన్యే దేహిసంజ్ఞితాః**

(నాయనా! ఆ పరమపురుషుడు నీకు నాకు, మిగిలిన మరెవ్వరికీ చూడడానికి సాధ్యం కానివాడు. అందరినీ సదా నేరుగా చూస్తూ ఉండే ఇతడు ఎవరికి ఏ కాలంలోను పరిచ్ఛేదించి తెలియబడడు) అని కొందరిచే పరబ్రహ్మగా కీర్తింపబడే శివునకు బ్రహ్మ ఉపదేశించాడు.

న త్వాం కేచన జానతే (రామా–ఉత్తర–110–10) (నిన్ను ఎవరు తెలియలేరు) అని,

**యన్న దేవా న మునయో న చాహం న చ శంకరః,**

**జానంతి పరమేశస్య తద్విష్ణోః పరమం పదమ్** (విష్ణుపు–1–9–53)

(దేనిని దేవతలు, మునులు బ్రహ్మ అయిన నేను, ఈశ్వరుడు తెలియలేమో, అదే పరమేశ్వరుడైన విష్ణువుయొక్క, పరమప్రాప్యమైన స్థానం) ఇత్యాది వేలాది సందర్భాలలో ఈ శ్రుతిని బ్రహ్మమొదలైనవారు ఉపబృంహణం చేశారు.

(ఎవరూ) తెలియలేరు– అంటే, బౌద్ధులు పలికేటట్లు ఇది లేని వస్తువా? (తుచ్ఛమా?) లేక, అద్వైతులు పలికేటట్లుగా జ్ఞాత, జ్ఞేయం లేని జ్ఞానమాత్రమైన వస్తువా? అని అంటే,

(**తే మహిమ్నః పరమమ్ అంతం న ఆప**)– ఆ విధంగా కాదు, ఈ పరవస్తువు తుచ్ఛం కాదు. ఉండే వస్తువే. జ్ఞానమాత్రం కాదు. అంతు లేని మహిమను కల్గినది. జ్ఞాతలు లేనందున తెలియ సాధ్యం కాదు. అనే ఉద్దేశ్యంతో చెప్పలేదు. మహిమకు అవధి లేనందున తెలియ సాధ్యం కాదు– అని చెప్పబడుతున్నది. అంతే. నీ గొప్పతనంలోని ఒక్కొక్క సూక్ష్మమైన అంశాన్ని మాత్రమే ఎవరో ఒకరు తెలియవచ్చు. నీ గొప్పతనం యొక్క పరమావధిని తెలిసినవారెవరూ లేరు. ఎందుకు? అంటే, నీ గొప్పతనానికి పరమావధి అనేది లేదు. పరమావధిని చూచినట్లుగా పలికేవారుకూడా– పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యం కాని వస్తువు– అని తెలిసికొంటున్నారే తప్ప, వేరేమీలేదు. వేదాహమేతం పురుషమ్ (పురుషసూక్తమ్)– (నేను ఈ పురుషుని

తెలిసికొంటున్నాను) అని పల్కిన, వేదపురుషుడు ఏ విధంగా తెలిసికొన్నావు? అనే ప్రశ్నరాగా మహాంతమ్ అని, తెలియడానికి సాధ్యం కాని గొప్పవాడు– - అని తెలిసికొన్నాను–అని అన్నాడు. అహం వేద్మి (రామా–బాల–19–14) (నేను తెలిసికొన్నాను) అని పల్కిన విశ్వామిత్రుని వశిష్ఠుడు ఏ విధంగా తెలిసికొన్నావు అని ప్రశ్నించగా, మహాత్మానమ్ అని అన్నాడు.

వేదాన్ని ద్రావిడీకరించిన నమ్మాళ్వార్లు కూడా

**అఱిన్దన వేద అరుమ్ పొరుళ్ నూల్కళ్**
**అఱిన్దన కొళ్క అరుమ్పొరుళాదల్** (తిరువాయ్–9–3–3)

అని ఇతనిని తెలియ సాధ్యం కాని గొప్పతనాన్ని గూర్చి తెలియజేశారు.

ఈ విధంగా ఇతని గొప్పతనం ఎవరికీ తెలియడానికి సాధ్యం కానిదిగా ఉండడానికి ఏమి కారణం? అంటే, ఒక్కొక్కటి పరిచ్ఛేదించి తెలియడానికి వీలు కాని రెండు విభూతులను కలిగినవాడై ఉండడమే ఇతని గొప్పతనం తెలియడానికి సాధ్యం కాకుండా ఉండడానికి కారణం–అనే విషయాన్ని ఈ మంత్రంలోని ఉత్తరార్ధం తెల్పుతున్నది.

(నాకమ్)– ఆనందమే స్వరూపంగా కల పరమపదం. కమ్ అంటే సుఖం. అకమ్ సుఖం లేకపోవడం. నాకమ్– సుఖరాహిత్యం అనేది ఏ మాత్రం లేశం కూడా లేని చోటు– అని అర్థం. ఈ విధంగా దుఃఖాన్ని ప్రస్తావించి, అది లేదని నిషేధించినందున, దుఃఖప్రాచుర్యాన్ని కల ఈ విభూతి కంటే గల వ్యత్యాసం తెలుపబడింది.

(ఋష్వమ్)– దర్శనీయమని అర్థం. చూడదగినది. చూడగా, చూడగా మధురమై, అప్పొழுదైక్కప్పొழுదు ఎన్నారావముదమ్ (ఎప్పటికప్పుడు నాకు తృప్తి తీరని అమృతం) గా ఉండేది– అని తాత్పర్యం. ఇందువల్ల చూస్తే కళ్ళను బాధించే (కణ్ణ క్కరిక్కుమ్)టట్లుగా ఉండే ఈ లీలావిభూతి కంటే దీనికి గల వ్యత్యాసం తెలుపబడింది.

(బృహంతమ్)– చాలా గొప్పది అని అర్థం. ఇందువల్ల, అంతు లేని ఈలోకం కంటే లెక్కలేనన్ని రెట్లు గొప్పదై, పెద్దదై ఉంటుంది, ఆ లోకం– అని తెలుపబడింది.

(ఉదస్తభ్నాః)– ఉన్నతంగా ధరిస్తున్నావు –అని అర్థం. ఇందువల్ల ఈ విభూతి ఉన్నతంగానే ఉంటుందని, ఔన్నత్యమే అంతు లేనిది– అని, కింద ఈ లీలావిభూతిని అవధిగా కల్గినదని, దానిని ధరించి నిలచేవాడు నారాయణుడే– అని తెలుపబడింది.

(పృథివ్యాః ప్రాచీం కకుభం దాధర్థ) భూమియొక్క ప్రాచీనమైన స్థానాన్ని ధరించి ఉన్నావు. లీలావిభూతిని అంతటిని ధరించి ఉన్నావు–అని అర్థం. ఉభయవిభూతినాయకుడైనందున నీ గొప్పతనం ఎవరికీ పరిచ్ఛేదించడానికి సాధ్యం కానిది– అని దీనివల్ల తెలుపబడినట్లయినది.

3. ఇరావతీ ధేనుమతీ హి భూతం సూయవసినీ మనుషే దశస్యా|
వ్యస్తభ్నా రోదసీ విష్ణవేతే దాధర్థ పృథివీ మభితో మయూఖైః॥

(ద్యావా పృథివీ దేవతలారా! ), మనుషే = స్తుతించే మానవునకు, దశస్యా = అనుగ్రహించాలనే ఆశను కల మీరు, ఇరావతీ =అన్నాన్ని కల్గినవారుగా, ధేనుమతీ = గొప్ప పశువులను కల్గినవారుగా, సూయవసినీ = మంచి అవయవాలను కల్గినవారుగా, భూతం హి = అయినారు కదా! , విష్ణో = ఓ విష్ణుదేవా! , ఏతే రోధసీ = ఈ దేవలోకాన్ని, భూమిని, వి అస్తభ్నాః= పలు విధాలుగా ధరించి ఉన్నావు, పృథివీం =భూమిని, అభితః = చుట్టూ, మయుఖైః= (నీ) విశేషకటాక్షాలతో, దాధర్థ = ధరించి నిలచావు.

వ్యాఖ్య: భగవంతుని శ్రీచరణస్పర్శతో ద్యావాపృథివులు పొందిన గొప్పతనాలను, వాటిని అతడు (విష్ణువు) ధరించి ఉండే రీతిని ఈ మంత్రం తెల్పుతున్నది.

ఉత్తరార్థంలో ఏతే రోదసీ (ఈ ద్యావాపృథివులు) అని ఉన్నందున పూర్వార్థంలో ఆ ద్యావాపృథివులు సంబోధింపబడినట్లుగా గ్రహించాలి. అచేతనాలైన

వీనిని సంబోధించడం పొసగుతుందా? అంటే, వీటిని అభిమానిదేవతలు ఉన్నాయి కనుక పొసగుతుంది.

(ఇరావతీ)– భగవానుడు త్రివిక్రముడై మిమ్ములను తన శ్రీచరణంతో తడవినపుడు ఆ శ్రీచరణస్పర్శవల్ల మీరు అన్నాన్ని కలవారయ్యారు.

(ధేనుమతీ) పశుసంపదను సమృద్ధిగా పొందారు. ఉత్తముడు ఎదిగి లోకాలను కొలువగానే,

తీఙ్గిన్ఱి నాడెల్లామ్ తిఙ్గళ్ ముమ్మారి పెయ్ దు,
పూఙ్గువళై ప్పోదిల్ పొఱి వణ్డు కణ్పడుప్ప,
తేఙ్గాదే పుక్కిరున్దు శీర్ త్త ములై పఱ్ఱి వాఙ్గ,
క్కుడమ్ నిఱైక్కు వళ్ళల్ పెరుమ్ పశుక్కళ్ నీఙ్గాద శెల్వమ్ నిఱైన్దు–

(ఏ కీడు లేకుండా లోకాలన్నిటిలో వర్షం మాసానికి మూడు మార్లు కురిసి, కలువపూలలో అందమైన, పరస్పరం స్పర్థించే తుమ్మెదలు నిద్రించగా, బద్ధకించకుండా గోవుపొదుగును పట్టి గోపాలకులు పితికినపుడు, కుండలు నిండుగా పాలు స్రవించే గోవులు, ఏ నాటికీ తరిగిపోని సంపద వృద్ధిచెందేటట్లు పొందుతున్నారు) అని గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో పల్కినపుడు ఆ త్రివిక్రముని చరణం తీర్థంగా వ్యాపించినపుడు ఈ గొప్పతనాలు కలిగాయని వేఱుగా చెప్పాలా?

(ధేనుమతీ)– ఇక్కడి మతుప్ ప్రత్యయాన్ని ప్రశంసార్థంలోను, భూమార్థంలోను గ్రహించవచ్చు.

(ధేనుమతీ) ప్రశంసార్థంలో మతుప్ ప్రత్యయం వచ్చినట్లుగా గ్రహించినపుడు ప్రశస్తమైన ధేనువులను కల్గినది– అనే అర్థం వస్తుంది. భూమార్థంలో మతుప్ ప్రత్యయమని భావిస్తే, అటువంటి గొప్ప పశువులను లెక్కలేని సంఖ్యలో కల్గినది– అనే

అర్థం వస్తుంది. కఱవై క్కణఙ్గళ్ పల (పాలిచ్చే గోవుల గుంపులు అనేకం) అనే తిరుప్పావై సూక్తి స్మరణీయం. ప్రశంసార్థంలో స్ఫురించే పశువుల గొప్పతనానికి ఏమి అర్థం? అంటే, శీற்ற ములై పற்றி వాఙ్గ క్కుడమ్ నిఱైక్కుమ్ వళ్ళల్ పెరుమ్ పశుక్కళ్ (పొదుగును పట్టి పాలు పితికితే కుండలను పాలతో నింపించే ఔదార్యాన్ని కల గొప్ప గోవులు) అని ఆణ్డాళ్ ఈ గొప్పతనాన్ని గూర్చి పలికారు.

(శీర్ త్త ములై)- విరలిట్టు చ్చుற்றி ప్పిడిక్క వొణ్ణాదు ఇరణ్డు కైకళాలుమ్ అణైత్తు క్కఱక్కవేణుమ్బడి కనత్తిరుక్కై.

(పற்றி వాఙ్గ క్కుడమ్ నిఱైక్కుమ్)- వాఙ్గుకై- వలిక్కైయాయ్, పற்றி క్కఱక్క క్కుడమ్ నిఱైక్కుమ్- ఎన్నుదల్. ములైయై ప్పற்றி క్కైవాఙ్గ. తానే పాల్ శొరియు మెన్నుదల్. ఇరట్ట కుడఙ్గళ్ వాఙ్గ వాఙ్గ నిఱైక్కుమెన్నుదల్. కుడమిడాదారిక్కిఱదు పశువిన్ కుற்றమన్లే. ఇచ్చైయుడైయార్ ఈశ్వరనై ప్పற்றி కృతకృత్యరామాపోలేయాయ్ ற்று, ఇవైయుమ్.

(వళ్ళల్)- కీழே పాల్ పోరుమ్ పెరుమైయై చ్చొల్లిற்றாకిల్, ఇని వళ్ళల్ తనమావదు ఎన్? ఎన్నిల్, కృష్ణనడి ఇవற்றுక్కు ఉణ్డాయిరుక్కై. ఆరేనుమ్ ఇవన్ కழுత్తిలే ఓలై క్కట్టి తూతుపో ఎన్నా , పోమాపోలే యాయ్ త్తు, ఇవైయుమ్. శిఱుప్రజైకళుక్కుమ్ కూడక్కట్టవు మడి క్కవుమామ్బడి తన్నై క్కొడుత్తుక్కొణ్డు నిఱ్కై.

(పెరుమ్ పశుక్కళ్)- పుల్లుమ్, తణ్ణీరుమ్ ధారకమాక వళర్ న్దవై యన్రిక్కే, కృష్ణస్పర్శమే ధారకమాక వళర్ న్దవై యాకైయాలే, శ్రీశత్రుంజయన్ పోలే యాయ్ற்று ఇరుప్పదు. (తిరుప్పావై మూవాయిరప్పడి) అనే వ్యాఖ్యాన చక్రవర్తి పెరియవాచ్చాన్పిళ్ళై శ్రీసూక్తులు ఈ సందర్భంలో కూడా వ్యాఖ్యానంగా గ్రహించదగినది.

(సూయవసినీ) - · గొప్ప యవలనే ధాన్యపు కంకులను కల్గినవిగా అవుతున్నారు. ఓఙ్గు పెరుమ్ శెన్నెల్ (ఉన్నతంగా పెరిగిన ఎఱ్ఱని ధాన్యం), శెయ్ కొళ్ శెన్నెల్ (చేలు నిండుగా ఉండే ఎఱ్ఱని ధాన్యం) అనే రీతిలో ఆకాశాన్ని తాకే రీతిలో

ఉన్నతంగా ఉండడం, ఒక కంకి మొత్తం చేనును అంతటినీ వ్యాపించేటట్లు ఉండడం వీటి గొప్పతనం.

కీழ் శొన్న తిరువులకళన్దరుళిన సర్వేశ్వరనోడు ఒత్తిరుక్కై. విడివోడే నట్టు, ఇౘాయిఱు పట్టపోదు వన్దు పార్ త్తాల్ ,కైకవిత్తు ప్పార్క్కవేణ్డుమ్బడి యిరుక్కై.

(ఓఙ్గుమ్ పెరుమ్ శెన్నెల్)– ఒరు ముదలే ఒరు శెయ్యై విళాక్కులైక్కొణు, అఙ్గన్ ఒరువరమ్బిల్లామైయాలే ఆకాశావకాశమ్ ఉళ్ళవళవుమ్ వళర్ న్దిరుక్కై (మూవాయిర ప్పడి వ్యాఖ్యానమ్) అని పెరియ వాచ్చాన్ పిళ్లై.

(ఓఙ్గు పెరుమ్ శెన్నెల్)

(పెరుమ్ శెన్నెల్) – కునిందునిన్టు మూదలిట్టు మేలే నోకి పార్ త్తాల్ ఆకాశత్తై వెళయడైప్పదు కాణుమ్. ఆకాశత్తిలే వరంబిల్లైయే. తిరు లకు అళంధరుళినవనై ప్పోలే.

(పెరుమ్ శెన్నెల్) శుற்றிలే పణైక్కై. శెయ్ కొళ్ శెన్నెలుయర్ ఎన్నుమాపోలే (తిరుప్పావై– ఆఙాయిరప్పడి వ్యాఖ్య) అని అంకియమణవాళ ప్పెరుమాళ్ నాయనార్ అనుగ్రహించినవి. సూయవసినీ అనే ఈ పదానికి విస్తృత వ్యాఖ్యగా గ్రహించదగినవి.

(భూతం హి) అవుతున్నారుకదా – అని అర్థం. పరో మాత్రయా అనే మంత్రంతో త్రివిక్రమావతారం ప్రస్తుతమైనందున త్రివిక్రముడు శ్రీచరణంతో స్పృశించినపుడు, ఈ గొప్పతనాలను పొందారు కదా– అని తాత్పర్యం.

(హి)– ఇది ప్రసిద్ధిని తెల్పుతున్నది. ఈ గొప్పతనాలను పొందడం ఎవరికోసం? అంటే,

(మనుషే దశస్యా) –మిమ్ములను స్తుతించే మానవునకు అనుగ్రహించడంకోసం పొందారు. మీకు ఈ గొప్పతనాలను అనుగ్రహించిన ఉత్తముని స్తుతించే మానవునకు ఇవ్వగోరి పొందారు —అని కూడా అర్థం.

ఓజ్గి ఉలకళన్ద ఉత్తమన్ పేర్పాడి
నాజ్గళ్ నమ్పావైక్కు చ్చాற்றி నీరాడినాల్
తీజ్గిన్టి నాడెల్లామ్ తిజ్గళ్ ముమ్మారి పెయ్ దు,
ఓజ్గు పెరుమ్ శెన్నెల్ ఊడుకయలుకళ,
పూమ్ కువళైప్పోదిల్ పొఋవణ్డు కణ్పడుప్ప
తేజ్గాదే పుక్కిరున్దు శీర్ త్తములై పற்றి వాజ్గ
క్కుడమ్ నిఱైక్కుమ్ వళ్ళల్ పెరుమ్ పశుక్కళ్
నీజ్గాద శెల్వమ్ నిఱైన్దేలోరెమ్పావాయ్

(త్రివిక్రమావతార సమయంలో ఉన్నతంగా పెరిగి లోకాలను కొలిచిన పురుషోత్తముని నామాలను కీర్తించి, మనం మన వ్రతానికి ఒక వ్యాజ్యాన్ని గ్రహించి, స్నానం చేస్తే, లోకం అంతా ఏ ఉపద్రవాలు లేకుండా, ప్రతినెల మూడు సార్లు వానలు కురుస్తాయి. గొప్పగా పెరిగి మంచి సస్యం మధ్యలోబలిసిన చేపలు త్రుళ్ళుతూ ఉండగా, అందమైన నల్లకలువలలో కాంతిని కల తుమ్మెదలు హాయిగా నిద్రిస్తాయి. ఏసంకోచం లేకుండా గోపాలకులు పాలను గోశాలలోకి వెళ్ళి, బలిసిన ఆవుల పొదుగును పట్టి పితికితే, సమృద్ధిగా పాలను ఇచ్చే గోవులు కుండలను పాలతో నిండిస్తాయి. ఈ రీతిలో తొలగిపోని సంపద నిండి ఉంటుంది.) అనేది తిరుప్పావై ప్రబంధంలోని.

వేదమనైత్తుక్కుమ్ విత్తాకుమ్ కోదైతమిழ் ఐయైన్దుమైన్దుమ్

(గోదాదేవి పాశురాలు ముప్పై వేదానికి అంతటికి విత్తనం వంటివి) అనే గోదాప్రబంధంలోని ఈ పాశురం ఈ వేదమంత్రానికి విత్తు (బీజభూతం) అనే విషయం సుస్పష్టం.

ఈ విధంగా ద్యావాపృథివులు ఇటువంటి మహిమను పొందడానికి కారణం ఇతని విశేషకటాక్షమే– అనే విషయాన్ని మంత్రంలోని ఉత్తరార్ధం తెల్పుతున్నది.

– (విష్ణో! ) ఓ సర్వవ్యాపీ! అని అర్థం. సర్వాధారుడై ఉండడానికి కారణమైన వ్యాప్తిని తెలిపే ఈ తిరునామాన్ని వేదపురుషుడు ఇక్కడ పఠిస్తున్నాడు.

(ఏతే రోదసీ వ్యస్తభ్నా:) ఈ ద్యావాపృథివులను పలు విధాలుగా ఇతఃపూర్వమే నీవు ధరించి ఉన్నావు.

(వ్యస్తభ్నాః) వివిధంగా ధరించి ఉన్నావు– స్వరూపంతో ధరించి ఉన్నావు. ధర్మభూతజ్ఞానంతో ధరించి ఉన్నావు. శక్తితో ధరించి ఉన్నావు. అస్తభూషణాధ్యాయంలో చెప్పబడిన రీతిలో నీ తిరుమేనిలో ఉండే అస్త్రభూషణాలతో ధరించి ఉన్నావు. ప్రళయంలో మిక్కిలి చిన్నదిగా చేసి, నీ ఉదరంలో పెట్టుకొని ధరించి ఉన్నావు. తరువాత లోకంలో స్పష్టమయేటట్లు వెలువరించి నీ, సంకల్పంలోని అత్యల్పభాగంతో ధరించి ఉన్నావు.

'యస్యాయుతాయుతాంశాంశే విశ్వశక్తి రియం స్థితా,

పరబ్రహ్మస్వరూపం యత్ ప్రణమామ్యస్తమవ్యయమ్ (విష్ణుపు– 1-953)

(ఎవని, సంకల్పంలోని పలు వేల భాగాలలోని ఒక భాగంలో ఈ లోకం నిలచి ఉన్నదో, ఏది పరబ్రహ్మస్వరూపమని చెప్పబడుతున్నదో, నాశం లేని ఆ పరవస్తువును నమస్కరిస్తున్నాను) అనే శ్రీవిష్ణుపురాణవచనం ఈ వేదసూక్తిని వివరిస్తున్నది.

(పృథివీమ్ అభితః మయూఖైః దాధరః)– భూమిని త్రివిక్రమావతారంలో చుట్టూ విశేషకటాక్షాలతో ధరించే (నిలచేటట్లు చేశావు. పృథివీమ్ అనే పదం దేవలోకాన్ని కూడా ఉపలక్షిస్తుంది. ఎల్లప్పుడు పలు విధాలుగా వీటిని ధరించి ఉండడమనేది ఒక విషయంకాగా, త్రివిక్రమావతారంలో నీ కటాక్షాలనే కిరణాలతో ద్యావాపృథివులను చుట్టూ ధరించి ఉండి, వానిని వర్ధిల్లజేశావు. తల్లి, తన బిడ్డను చల్లగా చూచి, దగ్గరకు తీసికొనేటట్లుగా, నీవు కూడా నీ సొత్తు అయిన ఈ లోకాన్ని చల్లగా చూచి శ్రీచరణంతో స్పృశించినందున, ఈలోకం ఓఙ్గు పెరుమ్ శెన్నెల్, వళ్ళల్ పెరుమ్ పశుక్కల్ (వృద్ధిచెందే గొప్ప ధాన్యాన్ని, ఉదారభావాఇన్న కల గొప్ప పశువులను) పొంది వెల్గుతున్నది.

(మయూఖైః) కిరణాలతో విశేషకటాక్షాలతో – అని భావం.

బృందావనం భగవతా కృష్ణనాక్లిష్టకర్మణా,

శుభేన మనసా ధ్యాతం గవాం సిద్ధి మభీప్సతా,
తత స్త్రత్రాతిరూక్షోపి ఘర్మకాలే ద్విజోత్తమ,
ప్రావృట్కాల ఇవోద్భూతం నవశష్పం సమంతతః (విష్ణు పు-5-6-28,29)

(అరుదైన కృత్యాలను అవలీలగా చేసే కృష్ణుడు, పశువుల మంచిని కోరి, బృందావనాన్ని శుభమైన మనస్సుతో భావించాడు. అపుడు మిక్కిలి కఠినమైన ఆ గ్రీష్మకాంతిలో కూడా వర్షాకాలంలో వలె నూతనమైన పచ్చగడ్డి బృందావనంలో అంతటా మొలిచింది)

అనేవిధంగా భగవత్కటాక్షాలతో పల్లేరు అడవి అయిన బృందావనం పచ్చగడ్డి మొలిచే ప్రదేశమైనది- అని పరాశరమహర్షి పలికాడు కదా!

ఈ విధంగా ఈ మంత్రంలో సర్వాధారుడైన సర్వేశ్వరుడు త్రివిక్రమావతార కాలంలో తాను విశేషకటాక్షాన్ని ప్రసరింపజేసి, శ్రీచరణాలతో స్పృశించడంవల్ల లోకం అంతా చిగిర్చి వర్ధిల్లింది- అని తెలుపబడినట్లయినది.

4)ఉరుం యజ్ఞాయ చక్రథురు కం జనయంతా సూర్య ముషా సమగ్నిమ్|
దాసస్య చిద్వృషశిప్రస్య మాయా జగ్నథు ర్నరా పృతనాజ్యేషు ॥

(ఓ ఇంద్రవిష్ణువులారా! )- యజ్ఞాయ = యజమానునకు, ఉరుమ్ లోకం = గొప్పదైన సర్వలోకాన్ని, చక్రథుః ఉ= సృష్టించారు కదా! , సూర్యం = సూర్యుని, ఉషాసమ్ = ఉషఃకాలాన్ని, అగ్నిం = అగ్నిని, జనయంత్యా సృష్టిస్తున్నారు (మీరు), నరా = నాయకులారా! , వృషశిప్రస్య= వృషశిప్రుడనే పేరును కల, దాసస్యచిత్ = నశింప జేసే అసురుని యొక్క, మాయా = ఆశ్చర్యాన్ని కల్గించే యుద్ధప్రకారాలను, పృతనాజ్యేషు= తగవులలో, జగ్నథుః= నశింపజేస్తున్నారు.

త్రివిక్రముని గొప్పతనాన్ని గూర్చి పల్కిన తరువాత, అతనితో పాటు అతని అన్ననుకూడా చేర్చి ఈమంత్రం స్తుతిస్తున్నది.

(నరా)– నరౌః హ నేతారా అని అర్థం. నేతలారా! అని సంబోధింపబడుతున్నారు. దేవతల నాయకుడొకడు (ఇంద్రుడు).! దేవాధిదేవుడు అతని అనుజుడై అవతరించినవాడు (ఉపేంద్రుడు). వీరిని నేతలారా! అని అనడం పొసగేదే కదా!

(యజ్ఞాయ)– యజమానునికోసం.

(ఉరుం లోకం చక్రథుః ఉ) చాలా గొప్పదైన స్వర్గలోకాన్ని, సృష్టించారుకదా! ఇక్కడ సర్వేశ్వరుడైన ఉపేంద్రుడు చేసిన సృష్టులను ఇంద్రునిపై కూడా ఆరోపించి చెప్పబడింది. లేక, వృషశిప్రుడనే అసురుడు తన మాయలతో స్వర్గాన్ని నశింపజేసి, యాగాలను పాడుచేసి, సూర్యుడు, అగ్ని మొదలైన వారిని కూడా మఱుగుపరచి బాధించగా, ఉపేంద్రుడు, ఇంద్రుడు కలసి ఆ అసురునితో పోరాడి, అతనిని నశింపజేసి, నశించినవి అన్ని తిరిగి వ్యక్తమయేటట్లు చేసిన వృత్తాంతం చెప్పబడినదని కూడా చెప్పవచ్చు.

(సూర్యం జనయంతా) సూర్యం జనయంతౌ సూర్యుని సృష్టిస్తున్నారు– అని అర్థం. రెండవ అర్థనిర్వాహంలో మఱుగు పడిపోయి ఉండే సూర్యుని వ్యక్తం చేశారు అని అర్థం. ఆ విధంగానే మిగిలిన ప్రయోగాలలో కూడా అర్థం గ్రహించాలి.

(ఉషాసమ్)– ఉషసమ్– ఉషఃకాలాన్ని సృష్టిస్తున్నారు. సూర్యుడు లేనందున ఉషఃకాంతి లేదనేది సిద్ధం. అయినా, సత్త్వప్రచురమైన సమయం కనుక, ప్రత్యేకంగా ఉషఃకాలం గూర్చి ప్రస్తావింపబడింది. తమస్సును పోగొట్టే సత్వప్రచురమైన ఉషఃకాలం తామసులైన అసురులకు అనుకూలం కాదు కనుక, దానిని కూడా అసురుడు మఱుగుపరచాడు.

(అగ్నిమ్)– అగ్నిని కూడా సృష్టించారు. తమస్సు అనే చీకటిని పోగొట్టే అగ్నిని మఱుగుపరచి, ఎల్లప్పుడు చీకటియే వ్యాపించి ఉండేటట్లు చేశారు అసురులు. దానిని పోగొట్టి, అగ్నిని ఇంద్రవిష్ణువులు తిరిగి సృష్టించారు.

ఏ విధంగా సృష్టించి ఇచ్చారు? అంటే,

(వృషశిప్రస్య)– ధర్మాన్ని నశింపజేసేవాడనే పేరును కలవాని యొక్క,

(దాశస్య) – సృష్టించే కార్యమనేదానినే తెలియనివాడై, నశింపజేసే కార్యంలోనే ఆసక్తిని కలవాడై – అని అర్థం. దో– అవఖండనే అనే ధాతువు నుండి దాశశబ్దం పుట్టినది.

(మాయాః)– ఆశ్చర్యకరమైన యుద్ధప్రకారాలను– అని అర్థం. అంతర్హితుడై (కన్పించకుండా ఉండి) యుద్ధం చేయడం మొదలైన మాయాయుద్ధరీతులను – అని అర్థం. మాయా అనే శబ్దం కొందఱు పలికేటట్లు అసత్యమనే అర్థాన్ని ఇచ్చేది కాదు– అనేదానికి ఈ ప్రయోగమొక దృష్టాంతం. ఆశ్చర్యం, వంచన, జ్ఞానం– అనే అర్థాలను ఈ శబ్దం ఇస్తుంది. ఇక్కడ ఆ అర్థాలన్నీ పొసగుతాయి. అసత్యమనే అర్థం మాత్రం పొసగదు.

(మాయాః పృతనాజ్యేషు జగ్నథుః) పోరులో అతని ఆశ్చర్యమైన, వంచన నిండిన యుద్ధరీతులను భగ్నం చేశారు. అతని సంకల్పాలను అన్నిటిని పాడుచేశారు– అని కూడా అర్థం. శ్రీవిష్ణుపురాణంలో కూడా

తేన మాయాసహస్రం తత్ శంబరస్యాశుగామినా,

బాలస్య రక్షతా దేహమేకైకం చ విశోధితమ్ (విష్ణుపు–1–19–20)

(ప్రహ్లాదుని శరీరాన్ని రక్షించుచు, వేగంగా తిరిగే చక్రాయుధం చేత శంబకాసురుని వేల సంఖ్యలోని మాయలు అన్నీ నశింపజేయబడ్డాయి) అని మాయాశబ్దం ఈ అర్థాలలోనే ప్రయోగింపబడింది.

ఈ విధంగా, ఈ మంత్రంద్వారా ఇంద్రవిష్ణువుల వీరకృత్యమొకటి వివరింపబడింది.

5)ఇంద్రావిష్ణూ ద్రుంహితాః శంబరస్య నవ పురో నవతిం చ శ్నథిష్టమ్।

శతం వర్చినః సహస్రం చ సాకం హథో అప్రత్యసురస్య వీరాన్ ||

ఇంద్రావిష్ణూ = ఓ ఇంద్రవిష్ణువులారా! , ద్రుంహితాః = స్థైర్యాన్ని పొందినవి, శంబరస్య = శంబరాసురుని, నవ నవతిం చ పురః= తొంభై తొమ్మిది పురాలను, శ్నథిష్టమ్ = నశింపజేశారు, వర్చినః అసురస్య శతం సహస్రం చ వీరాన్ = బలశాలులైన ఆ అసురుని వందవేల యుద్ధవీరులను కూడా, అప్రతి = ఎదిరించ సాధ్యం కాని రీతిలో, సాకం= ఒకటిగా, హతః= నశింపజేశారు.

ఇంద్రునియొక్క, విష్ణువుయొక్క వేఱొక వీరకృత్యాన్నిగూర్చి మంత్రం తెల్పుతున్నది.

(ఇంద్రావిష్ణూ)- ఓ ఇంద్రా విష్ణువులారా!

(ద్రుంహితాః) - వరబలం వల్ల దృఢంగా ఉండే పురాలు, అవి ఒకటా? రెండా? లేక త్రిపురాలవలె మూడా? అంటే,

(న వపురో నవతిం చ)- తొంభై తొమ్మిదిపురాలను, ఒక్కటి కూడా విడువకుండా నశింపజేశారు. అవి ఎవరివి? అంటే,

(శంబరస్య) - మాయలో మిక్కిలి సమర్థుడైన శంబరాసురునివి. వాటిని ఏమి చేశారు? అంటే,

(వర్చినః అసురస్య)- సమూలంగా నాశం చేశారు. అవి నిర్జనపురాలా? అంటే,

(వర్చినః అసురస్య)- మిక్కిలి బలాన్ని కల అసురుని పురాలు. శంబరం మాయినాం పరమ్ (విష్ణుపు-1-19-15) (మాయా సమర్థుడైన శంబరుని), అని, శంబరస్య మాయా సహస్రమ్ (విష్ణు.పుర1-19-20) అని శ్రీవిష్ణుపురాణంలో పల్కిన రీతిలో మాయాబలాన్ని మిక్కిలిగా కలవానియొక్క- అని అర్థం.

(శతం సహస్రం చ)- నూఱు వేలమంది (లక్ష) వీరులను, వారు బలం లేని అసమర్థులా? లేక,

(వీరాన్) – అతనివలెనే బలం మిక్కిలిగా కల్గిన వీరులను వారు తిరిగి వచ్చి ఎదిరించేటట్లుగా కేవలం తరిమివేశారా? అంటే,

(అప్రతిహతః) ఇక ఎదిరించలేనట్లుగా వారిని నాశనం చేశారు. కొంతమందిని విడిచిపెట్టి కొంతమందిని మాత్రమే వధించారా? అంటే,

(సాకమ్)– ఒక్కరిని కూడా వదలకుండా వధించారు. దీనివల్ల వీరి వీర్యం సాటి లేనిది– అని తెలుపబడింది.

6. ఇయం మనీషా బృహతీ బృహంతో రుక్రమా తవసా వర్ధయంతీ।
రరే వాం స్తోమం విదథేషు విష్ణో పిన్వతమిషో వృజనేష్వింద్ర॥

విష్ణో! = = ఓ విష్ణుదేవా! , ఇంద్ర! = ఓ ఇంద్రా! , బృహతీ = పెద్దది అయిన, ఇయం మనీషా = ఈ మననం చేయదగిన స్తుతి, బృహంతా = పెద్దలు, ఉరుక్రమా = గొప్పవిక్రమాన్ని కలవారు, తవసా బలాన్ని కలవారైన మిమ్ములను, వర్ధయంతి = వర్ధిల్లజేస్తున్నది. విదథేషు = యజ్ఞాలలో, వామ్ = మీకు, స్తోమమ్ = ఈ స్తుతిని, రరే = ఇస్తున్నాను, (మీరు), వృజనేషు = ఆపత్కాలాలలో, ఇషః= మాకు అన్నాలను, పిన్వతమ్ వర్ధిల్లజేయుదురుగాక!

ఇంద్ర విష్ణువులను స్తుతించి, అన్నాన్ని ప్రార్థిస్తున్నారు, ఈ మంత్రంలో.

(ఇయమ్)– ఇటువంటి గొప్పతనాన్ని కల ఈ స్తుతి,

(మనీషా)– అందటిచే మననం చేయదగినది,

(బృహతీ)– మిక్కిలి పెద్దది అయిన ఈ స్తుతి,

(బృహతీ బృహంతా)– మిక్కిలి గొప్పవారినిగూర్చిన స్తుతి అయినందున మిక్కిలి పెద్దది.

(ఉరుక్రమా) – ఉరుక్రమౌ– మిక్కిలి గొప్ప పరాక్రమాన్ని కల మిమ్ములను –అని అర్థం. పెద్ద పాదన్యాసాలను కల విష్ణువులతో చేరి ఉన్నందున పూలతో

చేరిన దారంకూడా పరిమళాన్ని పొందేటట్లు, ఇంద్రుడు కూడా ఉరుక్రమ నామాన్ని పొందుతున్నాడు.

(మనీషా ఉరుక్రమా)– మిక్కిలి గొప్ప వీరకృత్యాలను కలవారిని గూర్చిన స్తుతి అయినందున అందఱిచే మననం చేయదగినదిగా ఉన్నది.

(తవసా)– తవ అని బలానికి, వృద్ధికి పేరు. కనుక, బలాన్ని కలవారిని– అని, లేక వృద్ధిని కలవారిని– అని అర్థం.

(తపసా వర్థయంతీ)– సహజంగానే మిక్కిలి బలాన్ని కలవారై ఉండేవారిని ఈ స్తుతి మఱింత గొప్ప బలాన్ని కలవారినిగా వృద్ధిచేస్తున్నది– అని భావం. వీరు స్తవప్రియులు కనుక స్తుతిని ఆలకించి వర్ధిల్లుతున్నారు (ఉబ్బి తబ్బిబ్బు అవుతున్నారు)

(రరే వాం స్తోమం విదథేషు)– ఈ స్తుతిని యాగాలలో, యజమానుడనైన నేను మీకు ఇస్తున్నాను.

(విష్ణో) – సర్వస్వామి అయినవాడా! నీ కోరికను గూర్చి తెలియనివాడవు కాదుకదా!

(ఇంద్ర) గొప్ప సంపదను కలవాడా! సంపద లేని దరిద్రుని, నేను యాచిస్తున్నానా?

మేము నీకు ఏమి చేయాలి? అంటే,

(వృజనేషు ఇషః పిన్వతమ్)– ఆపత్కాలాలలో అన్నాన్ని మాకు వృద్ధిచేయండి. క్షామకాలాలలో అన్నాన్ని వృద్ధి చేసి క్షేమాన్ని కల్గించండి.

7. వషట్ తే విష్ణవాస ఆ కృణోమి తన్మే జుషస్వ శిపివిష్ట హవ్యమ్।
వర్ధంతు త్వా సుష్టుతయో గిరో మే యూయం పాత స్వస్తిభి స్సదా నః॥

విష్ణో! = ఓ విష్ణూ! , తే = నీకు, ఆసః ఆ= ఆ ముఖాన్ని ఉద్దేశించి, వషట్కృణోమి = వషట్కారంతో హవిస్సును హోమం చేస్తున్నాను, శిపివిష్ట! = కాంతిచే పరివేష్టింపబడినవాడా! , మే = నాచే హోమం చేయబడిన, తత్ ఆ

వషట్కరింపబడిన హవ్యాన్ని, జుషస్వ= పూజించాలి, సుష్టుతయః= అందమైన స్తుతిరూపమైన, మే గిరః= నా వాక్కులు, త్వా వర్ధంతు = నిన్ను వర్ధిల్లజేయాలి, నః = మమ్ములను, యూయం = మీరు, స్వస్తిభిః= మంగళాలను కల్గించి, సదా = = ఎల్లప్పుడు, పాత = కాపాడండి.

తిరిగి, విష్ణువును ప్రత్యేకంగా ఈ మంత్రంతో స్తుతించడానికివేదపురుషుడు ఆరంభిస్తున్నాడు.

(విష్ణో) – ఓ విష్ణూ!

(తే ఆసః ఆ)– నీకు తిరుముఖమండలం (ముఖం) వంటివాడైన అగ్నిని ఉద్దేశించి అని అర్థం. అగ్నిముఖా వై దేవః (దేవతలు అగ్నిని ముఖంగా కలవారు) అని చెప్పబడుతున్నది కదా!

(వషట్కృణోమి) వషట్కారంతో కూడా హవిస్సును హోమం చేస్తున్నాను. ఇతడు (విష్ణువు) వషట్కారస్వరూపికదా.

(శిపివిష్ట కాంతిని చుట్టూ కల స్వామీ! అల్లలిల్ ఇన్బమ్ అళవిఱన్దు ఎజ్గుమ్ అழమర్ శూழாళియన్ (దుఃఖాలు లేని, అంతు లేని ఆనందం కల, అందాన్ని కల్గిన, కాంతిని చుట్టూ కలవాడు) అని, పరంజ్యోతిః అని వేదాలలో కీర్తింపబడేవాడుకదా, ఇతడు.

(తత్ మే హవ్యం జుషస్వ) – నాచే సమర్పింపబడిన ఈ హవ్యాన్ని భుజించండి. అహం హి సర్వయజ్ఞానాం భోక్తా (గీత) (నేనే కదా అన్ని యజ్ఞాలకు భోక్తను, వాటిని భుజించేవానిని) అనే విధంగా సర్వయజ్ఞహవిర్భోక్త అయిన నీవు నాచే సమర్పింపబడిన హవిస్సును భుజించాలి.

(వర్ధ తు త్వా సుష్టుతయో గిరో మే) – నా గొప్ప మంగళాశాసన రూపమైన వాక్కులు నిన్ను వర్ధిల్లజేయుగాక.

(యూయం పాత స్వస్తిభిః సదా నః)– నీవు, నీపరివారం నన్ను, నా పరిజనాన్ని ఎల్లప్పుడు సకల మంగళాలను కల్గించి రక్షించాలి.

8)నూ మూర్త దయతే సనిష్యన్యో విష్ణవ ఉరుగాయాయ దాశత్।
ప్రయః సత్రాచా మనసా యజాత ఏతావంతం నర్య మావివాసాత్॥

యః= ఏమానవుడు, ఉరుగాయాయ= పెద్దవారిచే కీర్తింపబడేవాడు, విష్ణవే = సర్వవ్యాపి అయిన భగవంతునకు, దాశత్ = (తనను) సమర్పిస్తున్నాడో, యః= ఎవడు, సత్రాచా = వెంట ఉండి మనస్సుతో, ప్ర యజాతే మిక్కిలి పూజిస్తున్నాడో, ఏతావంతమ్ = ఇంత గొప్పవాడు, నర్యం = మానవులకు హితాన్ని కల్గించేవాడైన విష్ణువునకు, ఆవివాసాత్ = కైంకర్యం చేస్తున్నాడో, సః మర్త్యః= ఆ మానవుడు, సనిష్యన్ = గొప్ప సంపద అనే మోక్షాన్ని పొందగోరి, ను = వేగంగానే, దయతే = దానిని పొందుతున్నాడు.

వ్యాఖ్య : విష్ణువును ఆశ్రయించి ఆత్మ– ఆత్మీయాలను సమర్పణం చేసేవాడు వేగంగా మోక్షమనే గొప్ప సంపదను పొందుతున్నాడు– అని ఇందులో తెలుపబడుతున్నది.

(సవిష్యన్ యః)– గొప్ప సంపదను కోరే ఏ మానవుడు– అని అర్థం. ఇక్కడ గొప్ప సంపద– అనేది మోక్షం రూపమైన– ఏనాటికీ నశించని సంపదయే. ఉరుగాయాయ దాశత్ అని ఆత్మసమర్పణాన్ని చేసేవానిని ప్రస్తావించినందున, పెరుమ్ శెల్వముమ్ అవరే యిని యావరే (తిరువాయ్–5–1–8) (గొప్ప సంపద కూడా ఆభగవానుడే, మిగిలినవి అన్నీ అతడే) అని కదా ప్రపన్నజనకూటస్థులైన నమ్మాళ్వార్ల సూక్తి. ఇక్కడ చెప్పబడే సంపదను నశించే (నశ్వరమైన) సంపదగా గ్రహించేవారు ఆ విధంగానే గ్రహించనివ్వండి. కాని, ఆళ్వార్లు చూపిన దారిలో వర్తించే మనకు ఇది నశించని సంపద అయిన అచ్యుతుని శ్రీచరణసన్నిధియే. ధనం మదీయం తవ పాదపంకజమ్ (నా సంపద నీ శ్రీచరణపద్మమే) అని కదా ఆళవందార్ పలికారు.

(విష్ణవే) సర్వవ్యాపి అయిన విష్ణువునకు– అని అర్థం. ఇతని వద్ద ఆత్మసమర్పణాన్ని చేయడానికి బహుదూరం వెళ్ళనక్కరలేదు. ఉన్నచోటనే ఉండి చేయవచ్చు– అని భావం.

(ఉరుగాయాయ) పెద్దలు– అని చెప్పబడేవారు అందరిచేత స్తుతింపబడేవానికి– అని అర్థం. ప్రాప్తవిషయం ఇతడే అయినందున, ఇతని వద్ద శరణు పొందడమే తగినది – అని భావం.

(దాశత్)– ఇస్తున్నాడో, సమర్పిస్తున్నాడో– అని అర్థం. దీనిని చేస్తున్నాడు– అని విశ్లేషించి నిర్దేశించి పలుకనందున, తనను, తనదిఅని ఇతడు (జీవుడు) భ్రమించిన అంతా అతనిది అని తెలిసి సమర్పించాలి– అని స్ఫురిస్తున్నది.

ఇక, రాబోయే మంత్రభాగంలో, ఈ ప్రపన్నాధికారికి కర్మజ్ఞానభక్తులు కూడా ఉన్నాయని తెలుపబడుతున్నది. ఇతని భక్తి అనేది ప్రాప్యరుచిలో చేరుతుంది. జ్ఞానమనేది స్వరూపాన్ని తెలియడంలో ఉపయోగపడుతుంది. కర్మం కైంకర్యంలోకి చేరుతుంది. ఆ యా యోగనిష్ఠులకు అవి సాధనమవుతాయి. అవే ఈ ప్రపన్నాధికారికి సాధ్యమవుతాయి. ఇందువల్లనే కదా సాధ్యభక్తి (సాధ్యా భక్తిః యయా సా– భక్తిని సాధించి ఇచ్చేది) అని ప్రపత్తికి వ్యుత్పత్తిచెప్పబడుతున్నది.

(యః)– ఎవడు– అని అర్థం. ఈ అధికారికి ఉండే వైలక్షణ్యాన్ని చూచి, ఆదరాతిశయంతో తిరిగి మళ్ళీ యః అనుసంధింపబడుతున్నాడు.

(సత్రాచా)– సహించతా అని సాయణభాష్యం.

(సత్రాచా మనసా)– వెంట ఉండి సహాయపడే మనస్సుతో–అని అర్థం. బంధాయ విషయాసంగి అనే విధంగా లౌకిక విషయాలలో ఇతనిని అభినివేశం కల్గినవానినిగా చేసి, సంసారబంధానికి కారణం కాకుండా, ముక్త్యై నిర్విషయం మనః అనేటట్లు భగవద్విషయంలో ఆసక్తిని కల్గించి, మోక్షాన్ని పొందడంలో సహాయపడే మనస్సుతో– అని తాత్పర్యం.

**నీయుమ్ పాజ్గిల్లై కాణ్ నెంజమే!** (తిరువాయ్-5-4-3) (మనసా! నీవు కూడా అనుకూలంగా లేవు కదా! ) అనే రీతిలో ఉండకుండా,

**నెఞ్జమే! నల్ల నల్లై ,ఉన్నై ప్పెఱ్ ఎన్ శెయ్ వోమ్! ఇని ఎన్న కుత్తెవినమ్**
**మైన్దనై మలరాళ్ మణవాళనై తుణ్ణమ్బోదుమ్ విడాదు తొడర్ కణ్ణాయ్**

(తిరువాయ్-1-10-4) (మనసా! చాలా మంచిది! నిన్ను అనుకూలంగా కల్గి ఉంటే ఏమి చేయలేము? ఇక ఏమి లోటు? యువకుడు, లక్ష్మీపతి అయిన స్వామిని నిద్రించేటపుడు కూడా విడువకుండా అనుసరించు) అనే రీతిలో ముందడుగు వేసే మనస్సుగా ఉండడం.

(ప్రయజాతే)- మిక్కిలి పూజిస్తున్నాడో- అని అర్థం. యజ–దేవపూజాయామ్ అని ధాతువు. మనసా యజాతే (మనస్సుతో పూజిస్తున్నాడు) అని అన్నందున, జ్ఞానయోగభక్తియోగాలు ఇతనికి ఉన్నాయని తెలుపబడింది. ఇక, ఇతనికి కర్మయోగం కూడా ఉన్నదనే విషయం తెలుపబడుతున్నది.

(ఏతావంతమ్)- ఇంతటివానిని- అని అర్థం. ఎంతటివానిని? అంటే,

**న తే విష్ణో జాయమానో న జాతో దేవ మహిమ్నః పర మంత మాప**

(దేవుడవైన ఓ విష్ణూ! జన్మించేవాడు, జన్మించినవాడు, ఇద్దరు నీ గొప్పతనంలోని పరమావధిని తెలియలేదు) అనే అవధిని (గొప్పతనాన్ని) కలవానిని- అని భావం.

(నర్యమ్)- నరేభ్యో హితమ్- ప్రాప్యవస్తువై ఉండడం కాకుండా, మానవులకు తనను పొందడంలో ఉపాయమై ఉండేవానిని - అని దీని భావం. ఉపాయోపేయత్వే తదిహ తవ తత్త్వం న తు గుణౌ (శ్రీరంగరాజస్తవ-2-87) (నీకు ఉపాయత్వం, ఉపేయత్వం– అనేవి స్వరూపనిరూపక గుణాలు. నిరూపిత స్వరూపవిశేషణాలు కావు) అని భట్టర్ పలికారు కదా! స స్వేనైవ ఫలప్రదః ఫలమపి స్వేనైవ నారాయణః (ఆ నారాయణుడే స్వయంగా ఫలాన్ని ఇచ్చేవాడుగా, ఫలంగా

ఉన్నాడు) అని మురారికవి అనర్ఘరాఘవమనే నాటకంలో అన్నాడు. వాటికన్నిటికి మూలం ఇటువంటి పలు శబ్దాలే.

(ఆవివాసాత్)– నమస్కారం మొదలైనవానితో ఏ మానవుడు కైంకర్యం చేస్తాడో– అని అర్థం. ఈ విధంగా ఇంతవరకు కర్మజ్ఞాన భక్తులను కల ప్రపత్తినిష్ఠునిగూర్చి పల్కి, సనిష్యన్ అని అతనికి ఉండే ప్రాప్యత్వరను గూర్చి తెలుపబడుతున్నది.

(మర్త్యః) – మరణాన్ని సహజంగా కల్గిన మానవుడు,

(నూ దయతే)– వేగంగా పొందుతున్నాడు. తన ప్రయత్నంలో కర్మయోగాన్ని, జ్ఞానయోగాన్ని, భక్తియోగాన్ని సాధనంగా అనుష్ఠించేవారికి ఈ జన్మలో మోక్షమనే నిశ్చయం లేదు. వారికి ప్రారబ్ధకర్మ ముగిసినపుడే మోక్షం. అందువల్ల వారు పరమపురుషార్థాన్ని వేగంగా పొందడం వీలు కాదు. అన్నిటికోసం అతని (పరమపురుషుని) సహాయాన్ని అపేక్షించే ఇతడు (జీవుడు) ఈ జన్మలోనే మోక్షాన్ని పొందుతున్నందున, త్వరగా సిద్ధిని పొందుతున్నాడు. స్వరూపానురూపమైన ఉపాయాలలో అన్వయించినందున వారికి ఫలప్రాప్తిలో విళంబం (ఆలస్యం) కల్గుతుంది. ఇతడు, స్వరూపానికి తగిన ఉపాయాన్ని ఆశ్రయించినందున ఆలస్యం కలుగదు.

ఈ విధంగా ఈ మంత్రంలో తనను శరణు పొందినవారికి వేగంగా పరమపురుషార్థాన్ని అనుగ్రహించేవాడు విష్ణువే– అని తెలుపబడింది.

9. త్వం విష్ణో సుమతిం విశ్వజన్యా మప్రయుతా మేవయావో మతిం దాః పర్చ్యో
యథా నః సువితస్య భూరే రశ్వావతః పురు శ్చంద్రస్య రాయః॥

ఏవయావః విష్ణో! =అవాప్త సమస్తకాముడవైన విష్ణూ! , త్వం నీవు, విశ్వజన్యాం = ఆత్మలన్నిటికి హితాన్ని కల్గించేదై, అప్రయుతాం దోషరహితమైన, సుమతిం = మంచి జ్ఞానాన్ని, దాః= (మాకు) ఇవ్వాలి, సువితస్య = చక్కగా

పొందదగినది, భూరేః= మిక్కిలి పెద్దది, అశ్వావతః = శ్రీదేవి సంబంధాన్ని కల్గినది, పురశ్చంద్రస్య = పలువురిని ఆనందింపజేసేది అయిన, రాయః= కైంకర్య సంపదయొక్క, పర్చ్యః= సంబంధం, సః= మాకు, యథా= దేనితో కల్గుతుందో, (ఆ మంచి జ్ఞానాన్ని నీవు ఇవ్వాలి).

మోక్షలక్ష్మిని ప్రపన్నుడు పరమాత్మవద్ద పొందుతున్నాడు- అని గడచిన మంత్రంలో తెలుపబడింది. ఆ ప్రపత్తి అనే మంచి జ్ఞానాన్ని మాకు కల్గించాలి- అని ఇందులో ఆ పరమాత్మ సన్నిధిలో ప్రార్థింపబడుతున్నది. అదువు మవనదు ఇన్నరుళే (తిరువాయ్) (అదికూడా ఆ పరమాత్మ యొక్క భవ్యమైన కృపయే) అని ఆళ్వార్లు పల్కినట్లు అన్నిటికి మూలకారణమై ఉండేది స్వామి కరుణే కదా.

(విష్ణో! ) - సర్వవ్యాపి అయినవాడా! - అని అర్థం. అన్నిచోట్ల అర్చావతార పర్యంతమైన అవతారాలతో వ్యాపించి, సంసారులకు పరాధీనుడై ఉన్నందున సౌలభ్యసౌశీల్యగుణాలు, సొత్తు అంతా, తన సొత్తు అయినందున చాలా తక్కువ వస్తువులలోను వ్యాపించి ఉన్నందున స్వామిత్వ, వాత్సల్య గుణాలు ఈ నామం ద్వారా తెలుపబడుతున్నాయి.

ఈ విధంగా ఈ పదంద్వారా ఆశ్రయణ సౌకర్యాపాదకగుణాలు తెలుపబడ్డాయి.

(ఏవయావః)- ఇక్కడ ఏవాః అని పొందదగిన కామాలు (కోరికలు) చెప్పబడుతున్నాయి. ఏవయావః అని అంటూ అన్ని కామాలను పొందినవాడా! అని సంబోధిస్తున్నాడు. ఇది, జ్ఞానం, శక్తి, సర్వస్వామిత్వం, కృప- అనే మిగిలిన ఆశ్రితసౌకర్యాపాదకగుణాలకు కూడా ఉపలక్షణం. సౌలభ్యం, సౌశీల్యం, వాత్సల్యం, స్వామిత్వం, అవాప్తసమస్త కామత్వం మొదలైనవి శరణ్యునకు తప్పక ఉండవలసిన గుణాలు అయినందున వాటిని తెలిపే తిరునామాలతో సంబోధిస్తున్నాడు. ఏవయావః

అనేదానికి– కోరికలను ఆశ్రితులు పొందేటట్లు చేసేవాడా! అని కూడా అర్థం. ఇందువల్ల శరణ్యునకు ఉండవలసిన ఉపాయత్వమనే గుణం తెలుపబడింది.

(త్వమ్)– ఈ విధంగా ఆశ్రయణ సౌకర్యాపాదకగుణాలతో, ఆశ్రిత కార్యాపాదక గుణాలతోనూ నిండిన నీవు– అని భావం.

(సుమతిం దాః)– మంచిజ్ఞానాన్ని మాకు అనుగ్రహించు. పూర్వమంత్రంలో ప్రసక్తమైన,

అహమస్మ్యపరాధానా మాలయోऽ కించనోऽగతిః,
త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః,
శరణాగతిరిత్యుక్తా సా దేవేస్మిన్ ప్రయుజ్యతామ్

(నేను దోషాలకు అన్నిటినికి ఆకరమైనవాడను, అకించనుడను, గతి లేనివాడను, నీవే నాకు ఉపాయంగా కావాలి– అని ప్రార్థించే జ్ఞానమే శరణాగతి– అని చెప్పబడుతున్నది. దానిని ఈ దేవుని విషయంలో ప్రయోగింపబడుగాక) అనే విధంగా ప్రార్థనామతి (జ్ఞాన) రూపమైన శరణాగతియే ఇక్కడ సుమతి అని అనబడుతున్నది– అని గ్రహించడం యుక్తం. భక్తియోగ, జ్ఞాన యోగాది మిగిలిన జ్ఞానాలు స్వరూప విరుద్ధాలు కనుక, అవి అధికృతాధికారాలు కనుక, ఆలస్యంగా ఫలాన్ని ఇచ్చేవి కనుక, అవి సుమతి అనదగినవి కావు. ఇది, స్వరూపానురూపమైనది. కనుక, సర్వాధికారం కనుక, ఈ జన్మలలోను మోక్షాన్ని కల్గిస్తుంది. కనుక, ఇదే సుమతి అని అనదగినది. అందువల్ల న్యాసమేషాం తపసా మతిరిక్తమాహుః (తపస్సులన్నిటిలో గొప్ప తపస్సు న్యాసమే) అని సకలోపాయశ్రేష్ఠంగా చెప్పబడిన శరణాగతియే ఇక్కడ సుమతి అని నిర్దేశింపబడినదని గ్రహించాలి.

దీనిని సుమతి అని అనడానికి దీనిలో ఉండ వైలక్షణ్యం ఏమి? అంటే, దానికి సమాధానాన్ని రెండు పదాలు తెలుపుతున్నాయి.

(విశ్వజన్యామ్)- జీవులందఱికి హితమై ఉండేది భక్తిమొదలైన మిగిలిన ఉపాయాలు ఆ కర్మలో అధికారం కల త్రైవర్ణికులకే (బ్రాహ్మణ- క్షత్రియ- వైశ్యులనే మూడు వర్ణాలవారికే) అనుష్ఠించదగినవి. ఇది, ఆ విధంగా కాకుండా స్త్రీలు, శూద్రులు మొదలైన అందఱు అనుష్ఠించదగినవిగా ఉన్నది- అనేది ఈ శరణాగతిలోని ముఖ్యమైన వైలక్షణ్యం- అని దీని ద్వారా తెలుపబడుతున్నది.

(అప్రయుతామ్) దోషాలు లేనిది. మిగిలిన ఉపాయాలకు పలు దోషాలున్నాయి. ప్రపత్తి అనే ఉపాయం- ఆ దోషాలు ఏమీ లేనిది-అని దీని గొప్పతనం ఉద్ఘోషింపబడుతున్నది. మిగిలిన ఉపాయాలు స్వయత్నరూపాలు అయినందున, పరమపురుషునకు అత్యంత పరతంత్రుడై ఉండే ఈ ఆత్మయొక్క స్వరూపానికి తగనివి. సకలయత్న నివృత్తి రూపమైన శరణాగతి ఆత్మస్వరూపానికి తగినది. ఆ ఉపాయాలు, ప్రారబ్ధకర్మలు అనుభవించి ముగిసిన తరువాతనే ఫలాన్ని ఇస్తాయి. ఇది ఈ శరీరం యొక్క అవసానంలోనే మోక్షాన్ని ఇస్తుంది. వాటికి అంతిమస్మృతి కావాలి. దీనికి అంతిమస్మృతి అక్కర లేదు. అవి, అచేతన క్రియాకలాపాలలో ఉపాయబుద్ధిని కల్గినవి. ఇది, పరమచేతనుని విషయం అనే ఉపాయబుద్ధిని కల్గినది. అవి, సాధ్యాలై ఉండేవి. ఇది, సిద్ధోపాయమై ఉండేది. అవి, సహాయాంతరాలను అపేక్షిస్తాయి. ఇది, వాటిని అపేక్షించదు. ఈ విధంగా మిగిలిన ఉపాయాలకు ఉండే దోషాలు ఏవీ లేనందున శరణాగతి అప్రయుక్తామ్ (దోషం లేనిది) అనబడుతున్నది. ఈ విధంగా మంత్రపూర్వార్థం ద్వారా శరణాగతి రూపప్రార్థన చేయబడింది.

ఇక, మంత్రంలోని ఉత్తరార్ధంలో గల శరణాగతి ద్వారా చేతనుడు పొందే ఫలం వివరింపబడుతున్నది. ద్వయమంత్రం పూర్వఖండార్థం ఈమంత్రంలోని పూర్వార్ధంలోను, ఉత్తరఖండార్థం ఉత్తరార్ధంలోను వివరింపబడుతున్నది- అనేది సువ్యక్తం.

(సువితస్య) - శేషభూతుడైన చేతనునకు- అని అర్థం. అకించత్కరస్యశేషత్వానుపపత్తి: (కైంకర్యం చేయనివానికి శేషత్వం సిద్ధించదు) అనే రీతిలో కైంకర్యమే స్వరూపస్థితిని కలుగజేస్తుంది. కనుక, ఇదే ఇతనిచే పొందదగిన ప్రకారాలలో చాలా గొప్పది- అని చెప్పబడుతున్నది. ఒழிవిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని ఒழிవిలా వడిమై శెయ్యవేణు నామ్ (తిరువాయ్-3-3-1) (విచ్ఛేదం లేని కాలం అంతా వెంటనే స్థిరంగా ఉండే నిరంతరమైన కైంకర్యాన్ని మనం చేయాలి) అని జ్ఞానులందఱు ఆశపడేది కదా, ఈ నిత్యకైంకర్యం.

(భూరే:)- మిక్కిలి గొప్పదియై ఉండేది, పరమప్రాప్యమైనది.

(అశ్వావతః)- అశూ-వ్యాప్తౌ అనేధాతువు నుండి పుట్టిన అశ్వశబ్దానికి

**యథా సర్వగతో విష్ణు స్తథేవేయం ద్విజోత్తమ! (విష్ణుపు)**

(బ్రాహ్మణోత్తమా! ఏవిధంగా విష్ణువు అంతటా వ్యాపించి ఉన్నాడో, విధంగానే ఈ లక్ష్మీదేవి కూడా అంతటా వ్యాపించి ఉన్నది) అనే విధంగా సర్వవ్యాపివి అయిన లక్ష్మీదేవి అశ్వా అనబడుతున్నది. అశ్వావతః అని ఆమెను ప్రతిసంబంధిగా కల్గినది కైంకర్యమని తెలుపబడుతున్నది. శ్రీసూక్తంలో కూడా అశ్వపూర్వామ్ అనే చోట అశ్వా అనేది లక్ష్మీదేవి తిరునామంగా పఠింపబడిందికదా! అందువల్ల, ఇక్కడ కూడా అశ్వావతః అని లక్ష్మీదేవి సంబంధమే చెప్పబడుతున్నది- అని అనడంలో ఏ లోటు లేదు. ఇందుచేత, శ్రీమతే నారాయణాయ అని ఒక మిథునవిషయంలోని కైంకర్యమే ఉద్దేశ్యం- అని ద్వయోత్తరఖండార్థం తెలుపబడినట్లయినది.

(పురుశ్చంద్రస్య) - పలువురిని ఆనందింపజేసేది - అని అర్థం. చది- ఆహ్లాదేనే అనేది ఇక్కడ ధాతువు. త్రిపాదస్యామృతం దివి (పురుషసూక్తమ్) అని నిత్యవిభూతిలో చేతనులు లీలావిభూతిలోని చేతనులకంటే ఎక్కువమంది అయినందున పురుశ్చంద్రస్య (పలువురను ఆనందింపజేసేవి) అని అనబడుతున్నది.

లేక, నిత్యముక్తులు జ్ఞానసంకోచాన్ని లేనివారైన, గొప్పవారు కనుక, మహనీయులను ఆనందింపజేసేది అనే అర్థంలో ఇది ప్రయోగింపబడిందని కూడా గ్రహించవచ్చు.

(రాయః)- ధనంయొక్క- అని అర్థం. కైంకర్యసంపద యొక్క-అని తాత్పర్యం. ఇదే నిజమైన సంపద. ఇహలోకైశ్వర్యాన్ని విడచి, రామకైంకర్యాన్ని ఆశ్రయించి ఉండే లక్ష్మణుడు లక్ష్మణో లక్ష్మిసంపన్నః (సంపద నిండిన లక్ష్మణుడు) అనబడ్డాడు. అంతరిక్షగతః శ్రీమాన్ (ఆకాశాన్ని చేరిన సంపన్నుడు) అని విభీషణుడు నిర్దేశింపబడ్డాడు. స తు నాగవరః శ్రీమాన్ (సంపన్నుడైన ఆ గజేంద్రుడు) అని గజేంద్రుడనబడ్డాడు. అందుచేత, కైంకర్యాన్ని సంపదగా వ్యవహరించడంలో తప్పు లేదు. లేక, భూమిలో నిక్షిప్తమైన ఉండే హిరణ్యనిధిగా వేదంలో చెప్పబడేవాడై, ప్రాప్యభూతుడై, మిక్కిలి గొప్పవాడై, లక్ష్మీసహితుడైన పరమపురుషుడే ఇక్కడ ధనమనబడుతున్నట్లుగా కూడా చెప్పవచ్చు. లేక, హిరణ్మయ లోకమనబడేదై, ప్రాప్యభూమియై, పరమం పద మవభాతి భూరి అనే రీతిలో మిక్కిలి పెద్దదై, లక్ష్మీదేవిచే ప్రకాశాన్ని పొందే పరమపదం ఇక్కడ ధనమనబడుతున్నదనికూడా చెప్పవచ్చు. ఇది ద్వయవివరణ రూపమై ఉన్నందున వీటిలో మొదటి అర్థం మిక్కిలి సరసం.

(రాయః పర్త్యః యథానః)- భవతి తథా సుమతిం దాః అని అన్వయించి అర్థాన్ని చెప్పాలి. పూర్వం పల్కిన సంపదయొక్క సంబంధం మాకు ఏర్పడే రీతిలో నీవు మాకు మంచి జ్ఞానమనే శరణాగతిని అనుగ్రహించు అని భావం.

ఈ విధంగా, ఈ మంత్రంలో ప్రాపకం, ప్రాప్యం భగవంతుడే-అనే ద్వయార్థం వివరింపబడింది.

10. త్రిర్దేవః పృథివీ మేష ఏతాం వి చక్రమే శతర్చసం మహిత్వా|
ప్రవిష్ణురస్తు తవస స్తవీయాన్ త్వేషం హ్యస్య స్థవిరస్య నామ॥

ఏష దేవః= ఈ దేవుడైన విష్ణువు, శతర్చసం = పలు కిరణాలను కల, ఏతాం పృథివీం ఈ భూమిని, త్రిః= మూడు పాదన్యాసాలతో, మహిత్వా = (తాను) పెద్దవాడై

ఉన్నందున, విచక్రమే = విక్రమించాడు కొలిచాడు, తవసః = వృద్ధులకంటే, తవీయాన్= వృద్ధుడైన, విష్ణుః= విష్ణువు, ప్ర అస్తు = (మనకు ఎల్లప్పుడు) రక్షకుడుగా కావాలి, స్థవిరస్య = మిక్కిలి వృద్ధుడైన, అస్య : = ఈ భగవానుని యొక్క, నామ = (విష్ణువు అనే) నామం, త్వేషం హి = (రక్షకత్వంవల్ల) చాలా గొప్పగా వెల్గుతున్నది కదా!

వ్యాఖ్య : ఆనుకూలస్య సంకల్పః ప్రాతికూలస్య వర్జనమ్,

రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వవరణం తథా, ఆత్మనిక్షేపకార్పణ్యే షడ్విధా శరణాగతి:

(1. భగవానుని రక్షణప్రయత్నానికి అనుకూలంగా ఉండాలనే సంకల్పం, (2) ప్రతికూలంగా ఉండడం మానివేయడం, (3) భగవంతుడు తప్పక రక్షిస్తాడనే నమ్మకం కల్గి ఉండడం, (4) నీవు రక్షకుడవు కావాలి – అనే వరణం, ఆ విధంగా, (5) ఆత్మసమర్పణం, (6) తన నైచ్యాన్ని విన్నపించడం– అని శరణాగతి ఆఱు అంగాలను కల్గినది) అనే విధంగా ఆఱు విధాలైన శరణాగతిలో గోప్తృత్వవరణరూపమైన శరణాగతి ప్రకారం ఇందులో చేయబడుతున్నది.

ఇందులోని పూర్వార్ధంలో, లోకాన్ని అంతటిని భగవానుడు తన శ్రీచరణంతో స్పృశించి, రక్షించిన రీతి తెలుపబడుతున్నది.

(ఏష దేవః)– ఈ నిరుపాధిక దేవుడు– అని భావం. పరదైవం కాని తిరువిల్లా త్తేవర్ వలె కాకుండా, లక్ష్మిని కల్గినదేవుడు,

(విష్ణు:– రక్షకత్వానికి తగినట్లుగా అంతటా వ్యాపించి వెలిగే దేవుడు.

(శతర్చసమ్) – నూర్లసంఖ్యలో కిరణాలను కల భూదేవిని– అని అర్థం. నూర్లకొద్ది సంఖ్యలో కిరణాలను కల్గినది. (శతర్చసమ్) అని పల్కినందున భూదేవియొక్క తిరుమేని సౌందర్యం తెలుపబడింది. ఎన్నో ఎన్నో అందమైన రూపాలను కల్గి వెల్గుతున్నది, ఈ భూదేవి. అవి అన్నీ

ఇక్కడ సూచింపబడ్డాయి.

(ఏతాం పృథివీమ్)– తన పత్ని అయినందున భూదేవిని, ఆమె ఒడిలో ఉండే తన బిడ్డలను శ్రీచరణంతో స్వామి ప్రేమగా స్పృశించాడు.

కిడన్దిరున్దు నిన్ఱిరున్దు కే**ழ**లాయ్ క్కీ**ழ்** పుక్కు
ఇడన్దిడుమ్ తన్నుళ్ కరక్కుమ్ ఉమి**ழ**మ్
తడమ్ పెరుమ్ తోళార త**ழு**వుమ్ పారెన్నుమ్
మడన్తైయై మాల్ శెయ్ కిన్ఱ మాల్ ఆర్ కాణ్బారే (తిరువాయ్–2–8–7)

(భూమి అనే వధువును ఆశ్రిత వ్యామోహాన్ని కల స్వామి పరుండి, కూర్చుండి, నిలుచుని, వరాహమై నీటిలోపలకు ఉద్ధరిస్తాడు. తనలోపలకి గ్రహిస్తాడు, వ్యక్తం చేస్తాడు. విశాలమైన, గొప్పవైన తన బాహువులతో మనసార తడవుతాడు. ఆ స్వామి చూపే వ్యామోహాన్ని ఎవరు గమనించగలరు?) అని ఆళ్వార్లు పల్కినట్లుగా భూదేవిపై ఉండే వ్యామోహం వల్ల కదా ఆశ్రితవ్యామోహాన్ని కల స్వామి పలు లీలలను చేశాడు.

(విచక్రమే) కొలిచాడు.

(త్రిః విచక్రమే)– ఒక పాదంతో తృప్తి పడకుండా, మూడు అడుగులను పెట్టి స్పృశించాడు. మిక్కిలి పెద్దది అయిన పృథివిని మూడు అడుగులతో కొలువడం సాధ్యమా? అంటే,

(మహిత్వా) – చాలా పెద్దవాడైనందున ఇతని సాధ్యం కానిది ఏదీ లేదు. న తే మహిత్వ మన్వశ్నువంతి (నీ మహమను దర్శించేవారు ఎవరూ లేరు) అని, న తే విష్ణో జాయమానో న జాతో దేవ మహిమ్నః పరమంత మాప (ఓ విష్ణూ! ఇంతకు ముందు పుట్టినవాడు, పుట్టేవాడు ఎవడూ నీ మహిమయొక్క పరమావధిని చూడలేదు) అని, సో అంగ వేద యది వా న వేద (ఆ భగవానుడు తన గొప్పతనాన్ని తాను తెలిసికొన్నాడో, తెలియలేదో! ), తనక్కుమ్ తన్ తన్మై యఱివరియానై (తన గొప్పతనాన్ని తాను కూడా తెలియనివానిని), తామ్ తమ్ పెరుమై యఱియార్ (తాను,

తన గొప్పతనాన్ని తెలియలేడు) అని చెప్పబడే గొప్పతనాన్ని కలవాడు కనుక, మూడడుగులతో కొలిచాడు.

ఇక, ఉత్తరార్ధంలో,

**కరుణావానపి సువ్యక్తం శక్తః స్వామ్యపి దేహినామ్,**
**అప్రార్థితో న గోపాయేదితి తత్ ప్రార్థనామతిః,**
**గోపాయితా భవేద్యేవం గోప్తృత్వవరణం తథా**

(కరుణను కలవాడైనా, శక్తిని కలవాడుగా ప్రసిద్ధుడైనా, చేతనులకు స్వామి అయినా, ప్రార్థించకపోతే రక్షించడు –అనే భావంతో నాకు నీవు రక్షకుడవు కావాలి అని ప్రార్థించే బుద్ధియే గోప్తృత్వ వరణమనబడుతున్నది) అని చెప్పబడే గోప్తృత్వవరణం చేయబడుతున్నది.

(తవసః తవీయాన్)– అన్నిటిని పొందినవాడైనందున, అతివృద్ధుడైన బ్రహ్మ కంటే వృద్ధుడై ఉండేవాడు. మిక్కిలి వృద్ధుడై ఉండేవాడు– అని భావం.

దిశై నాన్ముకన్ తన్దైయై తేవతేవనై మూవరిల్ మున్నియ విరుత్తనై (పెరియ తిరు– 7–10–7) (చతుర్ముఖునకు తండ్రి, దేవదేవుడు, ముగ్గురిలో ముందువాడైన వృద్ధుడు) అని తిరుమంగై ఆళ్వార్ ఈ వేదవాక్యాన్ని వివరించారు. ఈ విధంగా మిక్కిలి వృద్ధుడైనందున, ఇతడే రక్షించవలసినవాడని భావం.

(విష్ణుః) – ఎవనినో ఒకనిని పట్టుకొనదలచి, ఊరును ముట్టడించినట్లుగా, రక్ష్యవస్తువును అన్వేషించి, అంతటా వ్యాపించి ఉండేవాడు.

(ప్ర అస్తు) మనకు రక్షకుడై ప్రకాశించేవాడు కావాలి– అని ఇక్కడ గోప్తృత్వవరణం చేయబడుతున్నది. ఇతడే సర్వరక్షకుడనేదానికి గుర్తు ఏదయినా ఉన్నదా? అంటే,

(స్థవిరస్య అస్య) – మిక్కిలి పెద్ద వృద్ధుడైన ఇతనియొక్క– అని అర్థం. ఇంత వయస్సు ఉన్నది– అని తెలియడానికి సాధ్యం కాని వయస్సును కల ఇతనియొక్క– అని భావం.

(నామ) – విష్ణుః అనే నామం. లేక, విలక్షణనామమైన నారాయణనామం కూడా కావచ్చు. లేక, ఏదయినా ఒక నామం కావచ్చు.

(త్వేషం హి) – (రక్షకత్వంలో) మిక్కిలి వెల్గుతున్నది కదా! ముద్దబంగారంవంటి అతని కంటే ముందుండేది కదా (గొప్పదికదా) బంగారు ఆభరణంవంటి అతని తిరునామం.

వాచ్యప్రభావమ్ పోలను వాచకప్రభావమ్, అదు దూరస్థనానాలుమ్ ఇదు కిట్టినిన్ఱు ఉదవుమ్. ద్రౌపదిక్కు ఆపత్తిలే పుడవై శురన్దదు తిరునామమితే. శొల్లుమ్ క్రమమొழிయ చ్చొన్నాలుమ్ తన్ స్వరూపమ్ కెడనిల్లాదు. అదుతాన్ కులన్దరుమ్ ఎన్గిఆపడియే. ఎలా అపేక్షితజ్గళైయుమ్ కొడుక్కుమ్. ఐశ్వర్య కైవల్యభగవల్లాభజ్గళై ఆశైప్పట్టవర్ కళుక్కు అవற்றை క్కొడుక్కుమ్. కర్మజ్ఞానభక్తికళిలే ఇழிన్దవర్ కళుక్కు విరోధియైప్పోక్కి, అవற்றை తలై క్కట్టిక్కొడుక్కుమ్. ప్రపత్తియిలే ఇழிన్దవర్ కళుక్కు స్వరూపజ్ఞానత్తై ప్పిఱప్పిత్తు, కాలక్షేపత్తుక్కుమ్, భోగత్తుక్కుమ్ హేతువాయిరుక్కుమ్. అనే ముముక్షుప్పడి శ్రీసూక్తులు ఇక్కడ అనుసంధేయాలు.

ఇటువంటి తిరునామవైభవాన్ని కల అతడే రక్షకుడుగా వరించదగినవాడు– అని భావం.

11. వి చక్రమే పృథివీ మేష ఏతాం క్షేత్రాయ విష్ణు ర్మను షే దశస్యన్ |
ధ్రువాసో అస్య కీరయో జనాస ఉరుక్షితిం సుజనిమా చకార ॥

ఏషః దేవః విష్ణుః= ఈ దేవుడైన విష్ణువు, ఏతాం పృథివీం = ఈ భూమిని, క్షేత్రాయ = నివసించడంకోసం, మను షే = స్తుతించే దేవతలకు, దశస్యన్ = (మహాబలి దగ్గరనుండి అపహరించి) ఇవ్వాలని తలచి, విచక్రమే = లోకాలను కొలిచాడు, అస్య = ఈ భగవంతుని, కీరయః= (తిరునామ) సంకీర్తనం చేసే, జనాసః= జనులు, ధ్రువాసః= స్థిరంగా ఉంటారు, సుజనిమా = దివ్యమైన జన్మను కల భగవంతుడు, ఉరుక్షితిం = పెద్దనివాస స్థలాలను, చకార = (తనను సంకీర్తనం చేసేవారికి) నిర్మించి ఇస్తున్నాడు.

ఇంతకు ముందు గల మూడు మంత్రాలలో ప్రపత్తి అనే ఉపాయం వివరింపబడింది. ఇక, మహావిశ్వాసపూర్వకం తదేకోపాయతా యాచ్ఞా ప్రపత్తిః శరణాగతిః (మహావిశ్వాసాన్ని పురస్కరించుకొని అతనిని ఒక్కని మాత్రమే ఉపాయంగా కావాలి అర్థించడమే ప్రపత్తి అనే శరణాగతి) అనే విధంగా ఈ ప్రపత్తిలో కూడా మహావిశ్వాసం తప్పక ఉండాలి. అది కల్గడం కొంతమందికి అరుదుగా ఉంటుంది. వారికికూడా రక్షకమై ఉండేది తిరునామసంకీర్తనమే. కలికాలంలో ఇటువంటి అధికారులే ఎక్కువ–అనే విషయం,

ధ్యాయన్ కృతే, యజన్ యజ్ఞైః త్రేతాయాం, ద్వాపరేఽర్చయన్,
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్ (విష్ణు పు- 6-2-17)

(కృతయుగంలో ధ్యానించడం వల్ల, త్రేతాయుగంలో యజ్ఞాలతో పూజించడంవల్ల, ద్వాపరయుగంలో అర్చించడం వల్ల పొందేఫలాన్ని కలియుగంలో కేశవుని సంకీర్తనం చేయడం ద్వారా పొందుతున్నాడు) అనే ప్రమాణంలో చెప్పబడింది.

భక్తియినుడైయ దుష్కరతైయోపాది, ప్రపత్తినిష్ఠాహేతువాన మహావిశ్వాసముమ్ శిలర్కు కిట్టుకై అరిదాకైయాలే ఇదిల్ ఇழియ క్కూశినవర్ కళుక్కు సర్వాధికారమాన యాదృచ్ఛికభగవన్నామ సంకీర్తనమే చేతనుడైయ పాపత్తై ప్పోక్కి, సుకృతానుకూలమాక కర్మయోగాదికళిలే మూట్టుదల్, ప్రపత్తియిలే మూట్టుదల్, విరోధియై ప్పోక్కి ప్రాప్యత్తై క్కొడుక్కైక్కు తానే నిర్వాహకమాదలామ్బడియాన వైభవత్తై ఉడైత్తాయత్తు, తిరునామత్తినుడైయ వైభవమిరుప్పదు అని పరమకారుణికులైన పెరియవాచ్చాన్పిళ్ళై తిరుమాలై వ్యాఖ్యానంలో పలికారు.

ఇటువంటి గొప్పతనాన్ని కల తిరునామసంకీర్తనం ఇక పై రాబోయే రెండు మంత్రాలలో ఉపదేశింపబడుతున్నది. అందులో, మొదటి మంత్రంలో

త్రివిక్రమావతారాన్ని ఎత్తి, లోకాలను కొలిచినది దేవతలు చేసిన తిరునామసంకీర్తన ఫలమే– అని వివరింపబడుతున్నది.

(విచక్రమే) –కొలిచాడు– అని అర్థం. దేనిని? అంటే,

(ఏతామ్ పృథివీమ్)– ఈ పృథివిని– అని చెప్పబడుతున్నది. పృథివీమ్ అనేది అన్ని లోకాలను లక్షిస్తుంది. ఎవరు? కొలిచారు? అంటే,

(ఏష విష్ణుః) – సర్వవ్యాపి అయిన ఈ విష్ణువే దీనిని చేయగల్గినవాడు– అని భావం. ఎందుకోసం? అంటే,

(క్షేత్రాయ) – నివాసార్థం. నివాసం ఉండడంకోసం. ఎవరికి? అంటే,

(మనుషే దశస్యన్)– తన తిరునామాలను సంకీర్తనం చేసే దేవతలకు ముల్లోకాలను ఇవ్వగోరి, వాటిని అపహరించిన మహాబలి దగ్గర నుండి తిరిగి గ్రహించడంకోసం లోకాలను కొలిచాడు– అని భావం.

ఇక, త్రివిక్రమావతార లీలవల్ల ఫలించిన అంశాన్ని తెల్పుతున్నారు.

(అస్య కీరయః జనాసః ధ్రువాసః) – ఇతనిని కీర్తించే జనులు స్థిరంగా నిలచి ఉంటారు.

**నాడు నకరముమ్ నన్గుడన్ కాణ నలనిడైయూర్ తి పణ్ణి,**
**వీడుమ్ పెఱుత్తి త్తన్ మూవులకుక్కుమ్ తరుమ్ ఒరునాయకమే** (తిరువాయ్– 3–10–11)

(పల్లెలు, పట్టణాలు చక్కగా చూచేటట్లుగా మంచిని కల్గించి, మోక్షాన్ని ఇచ్చి, ముల్లోకాలను అద్వితీయ ప్రభుత్వాన్ని అనుగ్రహిస్తాడు) అనే రీతిలో ఈ లోకంలో ఆ లోకంలో స్థిరమైన స్థానాన్ని పొందుతున్నారు. అస్య జానంతో నామ చిత్ వివక్తన అనే మంత్ర భాగానికి చేయబడిన వివరణంలో ప్రస్తావింపబడిన ప్రమాణాలు ఇక్కడకూడా అనుసంధేయాలు. కీరయః అంటే– కీర్తయి  రః (కీర్తించేవారు) అని అర్థం. ధ్రువాసః

అని అన్నందున తిరునామసంకీర్తనమనేది స్థిరమైన పురుషార్థమైన మోక్షస్థానాన్ని కూడా ఇవ్వగల్గినది– అనేది తెలుపబడుతున్నది. జనాసః– అని అన్నందున ఈ తిరునామసంకీర్తనానికి సర్వజనులు అధికారులే– అని తెలుపబడుతున్నది. బాధపడిన దేవతలకు మాత్రమే కాకుండా, వారిని బాధించిన మహాబలికి కూడా స్థిరమైన స్థానాన్ని అనుగ్రహించిన సౌలభ్యాన్ని గూర్చి ఇక, పల్కి ఆశ్చర్యపడుతున్నాడు, వేదపురుషుడు.

(ఉరుక్షితిమ్ చకార) – విస్తీర్ణమైన స్థానాన్ని మహాబలికి కూడా సంపాదించి ఇచ్చాడు. సంకీర్తనం చేసిన దేవతలకు నివసించడానికి స్థానాన్ని మహాబలి దగ్గరనుండి తిరిగి గ్రహించి ఇవ్వడమే కాకుండా, తనవద్ద కొద్దిపాటి ప్రేమను కలవాడు– అనే దానినే హేతువుగా గ్రహించి, మహాబలికి కూడా పెద్ద అద్వితీయమైన స్థానాన్ని, నశించని సంపదలను పాతాళంలో ఇచ్చి, తానే ఒక రూపాన్ని గ్రహించి, అతనికి రక్షకుడుగా కూడా నిలచాడు కదా! ఆ విషయం ఇక్కడ తెలుపబడుతున్నది. ఈ విధంగా అందరికీ హితాన్ని కల్గించడానికి కారణమేమి? అంటే,

(సుజనిమా)– ఆశాలేశాన్ని అనుగ్రహించడం కోసమే జన్మను పరిగ్రహించినవాడైనందున– అని భావం.

(సుజనిమా)– మంచి జన్మను కలవాడు– అని అర్థం. చూచినవారు, విన్నవారు, భావించినవారు, జన్మను పోగొట్టుకొని, గొప్ప స్థానం పాలించడానికే తగిన జన్మను కలవాడు.

జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః,
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున (గీత–4–9)

(నా జన్మను, లీలలను, ఎవడు యథాతథంగా తెలిసికొంటున్నాడో, అతడు ఆ దేహాన్ని విడచి తిరిగి జన్మను పొందడు. అర్జునా! అతడు నన్నే పొందుతున్నాడు) అని స్వయంగా ఉద్ఘోషించే రీతిలో గొప్ప జన్మను కలవాడు.

ఈ విధంగా ఈ మంత్రం ద్వారా తిరునామసంకీర్తనవైభవం చెప్పబడుతున్నది.

12. ప్ర తత్తే అద్య శిపివిష్ట నామార్యః శంసామి వయునాని విద్వాన్।
**తం త్వా గృణామి తవసమతవ్యాన్ క్షయంత మస్య రజసః పరాకే॥**

శిపివిష్ట = పరంజ్యోతిస్వరూపా! , తే = నీయొక్క, తత్ = ఆ సుప్రసిద్ధమైన, నామ = తిరునామాన్ని, అర్యః= (యమాదులకు) నాథుడనై, వయునాని = మోక్షోపాయాలను, విద్వాన్ = తెలిసినవాడనైన నేను, అద్య = ఇపుడు ఈ నాడు, ప్రశంసామి = మిక్కిలి స్తుతిస్తున్నాను, తవసమ్ మిక్కిలి వృద్ధుడై, అస్య రజసః పరాకే = ఈ ప్రకృతి మండలానికి ఆవలి వైపున, క్షయంతమ్ = వేంచేసి ఉండే, తమ్ = అటువంటి నిన్ను, త్వా అతవ్యాన్ = అతిబాలుడనైన నేను, కృణోమి = సంకీర్తనం చేస్తున్నాను.

వ్యాఖ్య: గడచిన మంత్రంలో చెప్పబడిన తిరునామసంకీర్తనాన్ని వేదపురుషుడు ఈ మంత్రంలో తానే అనుష్ఠించి చూపుతున్నాడు.

(శిపివిష్ట) – పరంజ్యోతిస్స్వరూపా! నారాయణపరో జ్యోతిః అని పరం జ్యోతిస్సుగా వేదంలో అధ్యయనం చేయబడేవాడా!

(తే నామ)– నీ తిరునామం– అని అర్థం. తిరునామానికి గల గొప్పతనం అతనికి చెందినది కావడమే.

ఓదువారోత్తెల్లామ్ ఎవ్వుకత్తెవ్వైయుమ్
శాదువాయ్ నిన్ పుక్కళిన్ తకైయల్లాల్ పిఱిదిల్లై

(అధ్యయనం చేసేవారి వేదం– విద్య– అంతా, ఏలోకంలో ఏది అయినా సాధువై, నీకీర్తిలో పర్యవసిస్తుంది తప్ప, వేఱుకాదు) అనేటట్లు ఉంటుంది. నీ తిరునామం. మిగిలినవారి నామాలు, ఒంటికన్నువానిని పుండరీకాక్షుడని పొగడేటట్లే, ఏమాత్రం పొసగనివై ఉంటాయి. ఇతనికి పొసగని మంచి పేరు ఏదీ లేదు.

శివాదినామాలు కూడా ఆ యా నామాలను కలవారికి – అ శివత్వాది అవస్థలు (స్థితులు) కూడా ఉంటాయి కనుక, వారి విషయంలో ఔపాధికాలై, ఇతని (భగవంతుని) వద్ద కదా సహజంగా పొసగి ఉంటాయి.

(తత్ నామ)– ఓరాయిరమాయ్ ఉలక్కేழ் అళిక్కుమ్ (వేయి సంఖ్యలో ఉన్న వై లోకాలను రక్షించే) తిరునామాన్ని సంకీర్తనం చేస్తున్నారు. మిగిలిన ఉపాయాలు ఎన్నో ఉండగా, తిరునామసంకీర్తనంలోనే వేదపురుషుడు యత్నిస్తున్నాడెందుకు? అంటే,

(వయునాని విద్వాన్)– ఉపాయాంతరాలను తెలిసినవాడైనందున, వాటి దోషాలను తెలిసి, నిర్దుష్టమైన తిరునామసంకీర్తనంలో ప్రవేశించారు–అని అంటున్నాడు. మాయా వయునం జ్ఞానమ్ అని వయునశబ్దం జ్ఞానవిశేషాలైన ఉపాయాలను తెల్పుతుంది. కర్మాద్యుపాయాలు చాలా శ్రమ సాధ్యమైనవి. కనుక, అవి కొందఱికి మాత్రమే ఆచరణసాధ్యాలు. అవి పలు అంగాలను అపేక్షిస్తాయి. ప్రపత్తికి ఈ దోషాలు ఏమీ లేకపోయినా, మహావిశ్వాసం కావాలి. తిరునామసంకీర్తనానికి ఈ కొఱతలు ఏమీ లేవు. మిక్కిలి సులభమైనది. సర్వాధికారమైనది. ఏ అంగం అక్కరలేనిది. దెబ్బతిని బాధపడేవాడు అమ్మా! అని అనేటపుడు ముందుగా ఏ క్రియాకలాపం చేయనక్కరలేదు కదా! ఆసీనా వా శయానా వా తిష్ఠంతో యత్ర కుత్ర వా ' (కూర్చున్నా, శయనించినా, నిలుచున్నా, ఎక్కడ ఉన్నా తిరునామ సంకీర్తనం చేయవచ్చు) అనే రీతిలో ఏ స్థితిలో అయినా తిరునామాన్ని చెప్పవచ్చు. అర్థం తెలియక పల్కినా, ఫలం కల్గుతుంది. దీనికి ఉదాహరణం. అజామిళోపాఖ్యానం. యదృచ్ఛయా విన్నవారుకూడా సద్గతిని పొందుతారు. నమనుమ్ ముఱ్కలనుమ్ పేశ నరకిల్ నిన్ఱార్ కళ్ కేట్క నరకమే శువర్ క్కమ్ (యముడు, ముద్గలుడు సంభాషిస్తూ ఉండగా, వారి సంభాషణలోని భగవన్నామాలను నరకంలోని వారు విన్నారు. వారికి నరకమే

స్వర్గమైనది) అయినది. మహాపాపులు సైతం ఉజ్జీవించినది తిరునామసంకీర్తనంతోనే. మొయిత్త వల్వినై యుళ్ నిన్ఱు మూన్ఱెழுత్తుడైయ పేరాల్ కత్తిరబన్ధుమన్ఱే పరాంగతి కణ్డుకొణ్డాన్. (చాలా పేరుకుపోయిన, దుష్కర్మలను కల క్షత్రబంధువు కూడా మూడక్షరాలను కల భగవన్నామ సంకీర్తనంతో పరమపదాన్ని పొందాడు). సాంకేత్యంగా కాని, పరిహాసంగా గాని, స్తోభంగా కాని, పరిహాసంగా గాని తిరునామాన్ని పల్కినా అది పాపహరం అవుతుంది – అని ప్రమాణవచనం. శిశుపాలుడు పరగతిని పొందడం దీనికి ఉదాహరణం. శుద్ధుడై ఉండనీ, అశుద్ధుడై ఉండనీ, తిరునామాన్ని పల్కడానికి అనర్హుడు కానివాడెవడూ లేడు.

నంజీయర్– అప్రయత నాయ్ క్కొణ్ణు తిరునామమ్ శొల్లలామో? ఆకాదో? ఎన్ఱు భట్టరై క్కేట్క గంగాస్నానమ్ పణ్ణప్పోమవనుక్కు ఉవర్కుழியిలే తోయ్ ఱ్ఱు పోకవేణుమో! మేలుద్ధాన నన్మైకళై ప్పణ్ణి క్కొడుక్కవఱ్ఱదు కీలుళ్ళ అశుద్ధియై ప్పోక్కాదో? ఎన్ఱు అరుళిచ్చెయ్ దార్, భట్టర్ (నంజీయర్– శారీరకశుద్ధి లేనివాడైనా తిరునామసంకీర్తనం చేయవచ్చునా? చేయకూడదా?– అని భట్టర్ ను ప్రశ్నించగా, గంగాస్నానం చేయాలని వెళ్ళేవాడు ఆ నదీ తీరంలో ఉండే ఉప్పుగుంటలో స్నానం చేయాలా? స్నానం చేసిన తరువాత మంచిని కల్గించే గంగ ముందున్న అపవిత్రతను పోగొట్టలేదా? అని భట్టర్ పలికారు).

నోటితో తిరునామం పల్కడానికి సాధ్యం కానిది ఏదీ లేదు. తల్లిని చంపేవానికైనా చేయినొప్పిపుడితే, అమ్మా అనే యోగ్యత ఉన్నదికదా! అని పెరియ వాచ్చాన్పిళ్ళై తిరుమాలై వ్యాఖ్యానంలో అనుగ్రహించారు. సర్వేశ్వరుని కంటే మించిన మహిమను అతని తిరునామం కల్గిన ఉన్నది. ముద్దబంగారంవలె, ఆభరణంగామార్చి కార్యాన్ని సాధించవలసినట్లుండేవాడు భగవానుడు. ఆభరణంగా తీర్చిదిద్దిన బంగారంవలె, చూడగానే ధరించడానికి వీలయేటట్లు ఉంటుంది– అతని తిరునామం.

అతడు ప్రళయాపదనుండి రక్షిస్తాడు. సంసారప్రళయం నుండి రక్షించడానికి ఈ తిరునామమే కావాలి.

మూవులకుణ్ణుమిழ்ంన్ద ముదల్వా
(ముల్లోకాలను గ్రసించి వెలువరించిన మూలకారణభూతుడా! )

నీళరవై చ్చుற்றி క్కడైన్దాన్ పెయరన్రే
తొల్ నరకై ప్పற்றி క్కడత్తుమ్ పడై (ముదల్ తిరు-81)

(పొడుగైన వాసుకి అనే సర్పాన్ని చుట్టి క్షీరాబ్ధిని చిలికినవాని నామమే కదా, అనాది అయిన నరకాన్ని తీర్చే ఆయుధం) అని ముదలాళ్వార్లు అన్నారు. రాగాదిభిరనిర్జితైః (విష్ణుధర్మమ్-1-43) అని జితేంద్రియులు కానివారికి కూడా భగవత్ప్రాప్త్యుపాయం ఏది? అని ప్రశ్నించగా, తిరునామసంకీర్తనాన్ని ఉపాయంగా పలికారు.

కావిల్ పులనైవైత్తు కలితన్నై క్కడక్క ప్పాయ్ న్ద

(ఇంద్రియాలను కావలిలో పెట్టి, కలి ప్రభావాన్ని వేగంగా దాటి) అని తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు అన్నారు. ఆక, ఇప్పడి చేతనన్ తాన్ మూలైయడియే తిరిన్దాలుమ్ అవన్ దోషఙ్గళై ప్పోక్కి, మేల్ శొల్లుకిఱ నన్మైకళై క్కొడుక్కుమ్బడి యాయ్ త్తు, తిరునామత్తినుడైయ ప్రభావమిరుప్పదు. ఒరువన్ విషదష్టనానాల్, విషవిద్యైయిల్ కుశలనాయిరుప్పానొరువన్, నీ సుఖమే ఎణ్ణెయ్ వార్ క్కవుమామ్, కుళిక్కవుమామ్, ఉఱఙ్గవుమామ్, స్వైరసంచారమ్ పణ్ణవుమామ్, నాన్ అழைకితాక ప్పోక్కిత్తరుకిఱేన్-ఎన్నుమిఱే. అప్పడియే యాయ్ త్తు, సంసారవిషదష్టనై క్కుఱిత్తు తిరునామప్రభావమిరుప్పదు అని పెరియవాచ్చాన్పిళ్ళై అనుగ్రహించారు. ఈ విధంగా సకలోపాయ విలక్షణమై ఉన్నందున అన్ని ఉపాయాలను తెలిసిన నేను తిరునామ సంకీర్తనాన్నే చేస్తున్నాను అని వేదపురుషుడు పల్కుతున్నాడు.

ఇక, తిరునామసంకీర్తనఫలంతో తనకు కల్గిన గొప్పతనాన్ని గూర్చి వేదపురుషుడు పల్కుతున్నాడు – అర్యః ఇత్యాదిగా.

(అర్యః శంసామి) నాయకుడనైన నేను సంకీర్తనం చేస్తున్నాను. సంకీర్తనం చేయబడగానే, పూర్వం తాను భయపడిన యమాదుల తలలపై కూడా కాలు పెట్టే రీతిలో వారికి నాథుడనవుతున్నాను.

కావలిల్ పులనై వైత్తు కలితన్నై క్కడక్క ప్పాయ్ న్దు
నావలిట్టు తరుకిన్టోమ్ నమన్టమర్ తలైకళ్ మీదే,
మూవులకుణ్డుమిழ்న్ద ముదల్వ! నిన్నామమ్ కற்ற,
ఆవలిప్పుడైమై కణ్డాయ్ అరజ్గమాన కరుళానే
అని తొణ్డరడిప్పొడి యాళ్వార్లు అన్నారు.

కమలనయన వాసుదేవ విష్ణో ధరణీ ధరాచ్యుత శంఖచక్రపాణే! ,
భవ శరణ మితీరయంతి యే వై త్యజ్య భట దూరతరేణ తానపాపాన్

(విష్ణుపు)(ఓ భటా! కమలాక్షా! వాసుదేవా! విష్ణూ! ధరణీధర! అచ్యుత! శంఖచక్రపాణీ! నాకు నీవు శరణం కావాలి– అని ఎవరు పల్కుతున్నారో, వారిని విడచి దూరంగా వెళ్ళు) అని యముడే స్వయంగా అన్నాడు. స్వపురుష మభివీక్ష్య ఇత్యాది శ్లోకం అనుసంధేయము,

తిఱమ్బేల్ మిన్ కణ్డీర్ తిరువడితన్నామమ్,
మఱన్దుమ్ పుఱమ్ తొழா మాన్దర్, ఇఱైంజియుమ్
శాదువరాయ్ పోదుమిన్ కళ్– ఎన్టాన్, నమనుమ్ తన్
తూదువరై క్కూవి చ్చెవిక్కు (నాన్ముకన్ తిరు)

(యముడు తన దూతలను దగ్గరకు పిలిచి వారి చెవిలో – భగవానుని నామానుసంధానాన్ని చేయడం మఱచినా, అన్యదైవాలను కొలువని వారికి

నమస్కరించి, వారిపట్ల సాధువులై వర్తించండి, వారిని బాధించకండి- అని అన్నాడు) అని అంటూ తిరుమళిశైప్పిరాన్ తిరునామసంకీర్తన ప్రభావంగానే వివరించారు.

ఈ తిరునామ సంకీర్తనం, సంకీర్తన రూపమై ఉన్నందున, స్వయంగా భోగ్యమై ఉన్నందున, మాటి మాటికి ఆవృత్తి చేయదగినదిఅనే విషయాన్ని మంత్రంలోని ఉత్తరపాదాలలో తెల్పుతున్నారు.

(తమ్)- అటువంటివాడు -అని చెప్పవచ్చు తప్ప, ఇదమిత్థంగా వివరించే అవకాశం లేదు.

(త్వా కృణోమి) - నిన్ను పల్కుతున్నాను. చెప్పదగిన నిన్ను గూర్చి పల్కుతున్నాను. శొల్లినాల్ తొడరిచ్చి నీ శొల్లప్పడుమ్ పొరుళ్ నీ (తిరుచ్చంద-11) (పలికే శబ్దసందర్భం నీవే, దాని అర్థం కూడా నీవే) అనబడే నిన్ను గూర్చి నేను పల్కుతున్నాను. ఏమి పల్కినా, నిన్ను గూర్చి పల్కినట్లుండే గొప్పతనాన్ని కల నిన్ను గూర్చి పల్కుతున్నాను. నిన్ను గూర్చి పలకాలంటే ఏ ప్రయత్నం అక్కరలేదు. నిన్ను గూర్చి పల్కుతున్నాను- అనే భావనతో దేనిని పల్కినా నిన్ను గూర్చి పల్కినట్లుగానే పర్యవసిస్తుంది. అటువంటి నిన్ను పల్కుతున్నాను. పల్కడానికి విషయమున్నదా? అనే ప్రశ్న రాగా, విషయపూర్తి (భగవానుడనే విషయంలోని పూర్తి) విశేషంగా ఉన్నది. అధికారి పూర్తి మాత్రం నాకు ఏమీ లేదు అని ఇక పల్కుతున్నాడు.

(తవసమ్)- అతివృద్ధుడై ఉండేవానిని- అని అర్థం. తనకు మందు ఏమీ లేదు- అనేటట్లు చాలా పెద్ద వృద్ధుడై ఉండేవానిని. విషయపూర్తి ఇతని వద్దనే పరిపూర్ణంగా ఉన్నది- అని దీని భావం.

(అతవ్యాన్)- అతిబాలకుడనై ఉండే నేను- అతివృద్ధుడైన నిన్ను గూర్చి పల్కడానికి జ్ఞానపూర్తి కొంచెం కూడా లేని నేను- అని అర్థం.

(తవస మతవ్యాన్)- విషయపూర్తి భగవంతునిలో విశేషంగా ఉన్నది. అధికారి పూర్తి నాలో అణువంతగా కూడా లేదు- అని పల్కుతున్నాడు,

వేదపురుషుడు. అంతటివాడు పడే పాట్లు ఇవి. అతని గొప్పతనాన్ని చూస్తే, ఎంతటి గొప్పజ్ఞానాన్ని కలవారైనా, సముద్రంలో పడిన కొండవలె మునిగిపోవలసిందే, అంతే. అతని మహిమలలో గొప్పదై ఉండే ఒక మహిమను గూర్చి ఇక పల్కుతున్నాడు.

(అస్య రజసః పరాకే క్షయంతమ్ త్వా కృణోమి)– ఈ సంసార మండలానికి ఆవలి వైపున వెలిగే నిన్ను ఇందులో పరిభ్రమించే నేను సంకీర్తనం చేస్తున్నాను. రజసః పరాకే అని ఇక్కడ అన్నారు. రజసః పరస్తాత్ అని పురుషసూక్తంలో అన్నాడు. రజస్సు, తమస్సు అనే గుణవాచిశబ్దాలు ఆ గుణాలను కల సంసారమండలాన్ని లక్షిస్తాయి. ఈ లోకం సత్వరజస్తమోగుణాలు మూడు కలసిదై ఉన్నా, రజస్తమస్సులు, వాటి కార్యాలే అధికంగా ఉంటాయి కనుక, రజసః పరాకే అని, తమసః పరాకే అని, తమసః పరస్తాత్ అని రజస్తమస్సులను పురస్కరించుకొని సంసారం ఉపలక్షింపబడుతున్నది. రజస్తమస్సులను తీర్చి, అవి ఏమాత్రం లేని దేశంలోకి చేర్చగల్గినవాడవు నీవే కనుక, నిన్ను సంకీర్తనం చేస్తున్నాను–అని భావం. ప్రశంసామి అని, కృణోమి అని వర్తమాన కాలంలో ప్రయోగింపబడినందున ఉపాయదశతో, ఫలదశతో తేడా లేకుండా, ఆత్మ ఉన్నంతవరకు (నిత్యంగా) తిరునామసంకీర్తనాన్ని చేయాలి– అని చూపబడింది. విపన్యవః (స్తుతించడమే స్వభావంగా కలవారు) అని, శూழ்న్దిరున్దేత్తువర్ (ప్రదక్షిణం చేస్తూ కీర్తిస్తారు) అని అక్కడికి వెళ్ళినా తిరునామసంకీర్తనమే కదా జీవనయాత్రగా ఉంటుంది.

ఈ విధంగా ఈ మంత్రం ద్వారా తిరునామసంకీర్తనమనే మోక్షోపాయాన్ని వేదపురుషుడు స్వానుష్ఠానంద్వారా దర్శింపజేశాడు.

13. కిమిత్తే విష్ణో! పరిచక్ష్యం భూత్ ప్ర యద్వవక్షే శిపివిష్టో అస్మి।
మా వర్పో అస్మదపగూహ ఏతత్ యదన్య రూపః సమిథే బభూథ॥

విష్ణో = ఓ విష్ణూ! , శిపివిష్టః అస్మి (ఇతి) యద్ ప్ర వవక్షే) = నేను శిపివిష్టుడను అని ఏ తిరునామాన్ని పలికాడో, తే ఇత్ కిమ్ పరిచక్ష్యం భూత్ = నీ ఆ

పేరును చెప్పాలా?, యదన్యరూపః= ఏవైష్ణవ రూపం కంటే వేరైన రూపాన్ని కలవాడవై, సమీ బభూథ = యుద్ధంలో సాక్షాత్కరించావో, ఏతత్ వరః= ఆ సహజరూపం, అస్మద్ = మాకు, మా అపగూహ = మఱుగుపరచవద్దు.

పరమపురుషుని సౌశీల్యసౌలభ్యవాత్సల్యాది గుణాలను వ్యక్తం చేసే ఒక వృత్తాంతాన్ని గూర్చి ఈ మంత్రం పల్కుతున్నది. నిరుక్తంలో తెలుపబడ్డ ఈ ఇతిహాసం ఈ మంత్రవిషయంగా కన్పిస్తున్నది.

పూర్వం ఒకానొక సమయంలో భగవంతుడైన విష్ణువు తన సహజరూపాన్ని మఱుగుపరచుకొని, వేఱొక రూపంలో వశిష్ఠునకు యుద్ధంలో సహాయపడ్డారు. నీవు ఎవరు? అని ప్రశ్నించగా, నేను శిపివిశిష్టుడను అని బదులు పలికాడు, భగవానుడు. విష్ణువే తన సౌశీల్యాది గుణాలతో తనను మఱుగుపరచుకొని, తనకు సహాయపడ్డాడని తెలిసికొన్న వశిష్ఠ భగవానుడు ఈ మంత్రంలో భగవంతుని సహజరూపాన్ని దర్శింపజేయమని అర్థిస్తున్నాడు.

(విష్ణో! ) ఓ విష్ణూ! నీ పరాక్రమ లీల నిన్ను గుర్తువచ్చేటట్లు చేసిందే! నీవు మఱుగుపడి ఉండాలని అనుకొన్నా, నీ వీరకృత్యం నిన్ను వ్యక్తపరచింది.

**మధ్యే విరించిగిరిశం ప్రథమావతారః**
**తత్ సామ్యతః స్థగయితుం తవ చేత్ స్వరూపమ్,**
**కిం తే పరత్వపిశునైరపి రంగధామన్!**
**సత్త్వప్రవర్తన కృపాపరిపాలనాద్యైః**
(శ్రీరంగరాజస్తవం– ఉత్తరశతకమ్)

(శ్రీరంగనాథా! బ్రహ్మకు, శివునకు మధ్యలో విష్ణువు అనే మొట్టమొదటి అవతారాన్ని ఎత్తి, వారితో సామ్యాన్ని ప్రదర్శించి, నీ స్వరూపాన్ని మఱుగుపరచుకొనేవాడవైనపుడు, నీ పరత్వాన్ని సూచించే సత్త్వ గుణప్రవర్తకుడవై

ఉండడం, దయతో అందటిని రక్షించడం మొదలైన లీలలను ఎందుకు చేస్తున్నావు?) అనే రీతిలో పల్కుతున్నారు.

(ప్ర యత్ వవక్షే శిపివిష్టో అస్మి) – శిపివిష్టుడనై ఉన్నాను అని ఏ తిరునామాన్ని పలికాడో – అని భావం. శిపివిష్టః – శిపిభిః రశ్మిభిః, ఆవిష్టః ఇత్యర్థః –చుట్టూ ప్రకాశాన్ని కల పరంజ్యోతి అని దీని అర్థం. నీ పేరు ఏమని వశిష్ఠుడడిగాడు. విష్ణువు అని గాని, నారాయణుడని గాని నేరుగా పలుకకుండా, కాంతిచే పరివేష్టింపబడినవాడు అని మఱుగుపరచే రీతిలో ఏ తిరునామాన్ని పలికావో– అని తాత్పర్యం.

(కిమిత్తే విష్ణో పరిచక్ష్యం భూత్)– ఆ పేరును నీవు చెప్పి తీరాలా!

నీవు, కాంతి పరివేష్ఠితుడవైన పరంజ్యోతివి, నారాయణుడవే– అనే దానిని చెప్పకుండానే మేము తెలిసికొనలేమా?

(మావర్పో అస్మద్ అపగూహ ఏతత్)– నీవు మఱుగుపరచినా, నా మనోనేత్రం ముందు సాక్షాత్కరించే ఈ నీ దివ్యమంగళ రూపాన్ని మావద్ద నుండి మఱుగుపరచవద్దు. వర్ప ఇతి రూపనామ, వృణోతీతి సతః అని నిరుక్తం. తన ఇచ్ఛతో స్వీకరింపబడుతున్నందున, వరః అని దివ్యమంగళవిగ్రహం చెప్పబడుతున్నది. ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః (విష్ణుపు– 6–5–84) (ఇచ్ఛతో స్వీకరింపబడిన భోగ్యమైన, గొప్ప తిరుమేనిని కలవాడు) అని చెప్పబడేవాడు కదా!

(మా అపగూహ)– మఱుగుపరచకు– అని అర్థం. గుహూ – సంవరణే అని ధాతువు. మఱుగుపరచవద్దు. అని అనడం ఎందుకు? అంటే

(యదన్యరూపః సమిధే బభూథ) –నీ అసాధారణరూపం కంటే వేఱయిన రూపాన్ని గ్రహించికదా, నాకు యుద్ధంలో ఉపకారం చేశావు. రాత్రివేళ మఠంలో కుమారునకు, తన ముఖాన్ని చూపకుండా సహాయపడే తల్లిదండ్రులవలె, నీ ముఖాన్ని చూపకుండా కదా సహాయం చేశావు. ఆ విధంగా ఉండకూడదు. నీ ముఖాన్ని నాకు

దర్శింపజేయాలి. చంటిబిడ్డకు తల్లిస్తన్యం వలె, నీ ముఖాన్ని దర్శించడమే మాకు ధారకం కనుక, దానిని మఱుగుపరచవద్దు.

ఈ ఇతిహాసాన్నిబట్టి విష్ణువుయొక్క శౌర్యవీర్యాది గుణాలు, గొప్పవాడై ఉన్నా, తక్కువవారితో ఒకే నీరువలె కలసి వర్తించే సౌశీల్యగుణం, సౌలభ్యాదిగుణాలు, అపేక్షానిరపేక్షంగా, ఖ్యాతి మొదలైనవానిని కోరకుండా మంచివారికి సహాయపడే కృప, ఔదార్యం మొదలైన గుణాలు వ్యక్తమయ్యాయి.

14) **వషట్ తే విష్ణవాస ఆ కృణోమి తన్మే జుషస్వ శిపివిష్ట హవ్యమ్।**
**వర్థంతు త్వా సుష్టుతయో గిరో మే యూయం పాత స్వస్తిభి స్సదా నః ॥**

ఋగ్వేదంలోని అయిదవ అష్టకం, ఆఱవ అధ్యాయంలోని కొన్ని మంత్రాలకు ముందు వివరింపబడిన మంత్రం ఇది. మఙ్గళాశాసనత్తిల్ పొఙ్గుమ్ పరివాలే (మంగళాశాసనంలోని పొంగిపొర్లే ప్రేమతో) వర్థంతు త్వా సుష్టుతయో గిరో మే (నీవు నా మంచి స్తుతివాక్కులను వర్థిల్లజేయాలి) అని భగవానునకు మంగళాశాసనం చేస్తున్నాడు. యూయం పాత స్వస్తిభిః సదా నః అని తమకు మంగళాన్ని కోరడం కూడా అడియోమోడుమ్ నిన్నోడుమ్ పిరివిన్ఱి ఆయిరమ్ పల్లాణ్డు (భక్తులమైన మాకు నీతో విశ్లేషం లేని రీతిలో వేలాది ఏండ్లు మంగళం కలగాలి) అనే పెరియాళ్వార్ల వలె మంగళాశాసనానికి తగినట్లుగా ప్రార్థింపబడుతున్నదని భావించాలి. ఈ మంత్రంతో ఋగ్వేదంలోని విష్ణుసూక్తాలు పూర్తి అయ్యాయి.

ఇక, యజుర్వేదంలోని విష్ణుసూక్తాలను గమనిస్తే, ప్రాయికంగా ఋగ్వేదంలో ఇంతకు ముందు వివరించిన మంత్రాలే అక్కడక్కడ కన్పిస్తున్నాయి. ఋగ్వేదంలోని ఏ యే మంత్రాలు యజుర్వేదంలో ఎక్కడ ఎక్కడ కన్పిస్తున్నాయి?– అనే దానిని ముందు చూపించి, తరువాత, యజుర్వేదంలో అధికంగా కన్పించే కొన్ని మంత్రాలను వివరించి, విష్ణుసూక్త వ్యాఖ్యానం పూర్తిచేయబడుతున్నది.

ఋగ్వేదమంత్రం యజుర్వేదంలో.

1)ఇదం విష్ణుః కాండం–1, ప్ర–2

2) త్రీణి పదా. అష్టక–2,ప్ర–4

3)విష్ణోః కర్మాణి. కాండం–1,ప్రశ్న–3

4)తద్విష్ణోః పరమం పదం. కాండం–1,ప్రశ్న–3

5)తద్విప్రాసో. కాండం–1,ప్రశ్న–3

6)విష్ణోర్నుకమ్. కాండం–1,ప్రశ్న–2

7)ప్రతద్విష్ణో స్తవతే. అష్టక–2,ప్రశ్న–4

8) తదస్య ప్రియమభి పాథో. అష్టక–2,ప్రశ్న–4

9) తా వాం వాస్తూని. కాండం–1,ప్రశ్న–3

10) భవా మిత్రో. అష్టకం–2,ప్రశ్న–4

11)యః పూర్వ్యాయ. అష్టకం–2,ప్రశ్న–4

12) తము స్తోతార. అష్టకం–2,ప్రశ్న–4

13) తమస్య రాజా. అష్టకం–2,ప్రశ్న–4

14) అయో వియాయ. అష్టకం–2,ప్రశ్న–8

15) ఇరావతి ధేనుమతీ ఆర–1, ప్ర–8, కాండం–1, ప్ర–2

16) నూ మర్త్యో దయతే అష్ట–2, ప్ర– 4

17) త్రిర్దేవ పృథివీమేష. అష్ట–2, ప్ర– 4

18) విచక్రమే పృథివీమ్. అష్ట–2, ప్ర– 4

ఇక, ఋగ్వేదంలో కన్పించని, యజుర్వేదంలో కన్పించే కొన్ని మంత్రాలు వివరింపబడుతున్నాయి. మొదట తైత్తిరీయ ఆరణ్యకంలోని ఎనిమిదవ ప్రశ్నలో పరమపురుషుని మహిమను వివరించే కొన్ని మంత్రాలు వివరింపబడుతున్నాయి.

1) అనవర్ణే ఇమే భూమీ ఇయం చాసా చ రోదసీ।
కిం స్విదత్రాంతరాభూతం యేనేమే విధృథే ఉభే।
విష్ణునా విధృతే భూమీ ఇతి వత్సస్య వేదనా॥

ఇయం చ అసౌ ఇమే భూమీరోదసీ = భూమి- అని, రోదస్- అని చెప్పబడే ఇక్కడ ఉండే పృథివి, అక్కడ ఉండే దేవలోకం, అనవర్ణే= మిక్కిలి అందమైనవి, ఇమే ఉభే యేన విధృతే = ఇవి రెండు ఎవనిచే ధరింపబడుతున్నాయో, అత్ర అంతరాభూతం కిం స్విత్ = వీటి మధ్యలో (ఆ విధంగా ధరించి ఉండే) వస్తువు ఏదో, భూమీ =ద్యావాపృథివులు, విష్ణునా = విష్ణువుచే, విధృతే= ధరింపబడ్డాయి, ఇతి = అని, వత్సస్య = వత్సుడనే ఋషియొక్క, వేదనా = జ్ఞానవిషయక సాక్షాత్కారం.

లోకాలను ధరించి ఉండేవాడు- పరమపురుషుడనే విషయాన్ని ప్రశ్న- ప్రతివచనరూపంగా ఈ మంత్రంలో తెలుపబడుతున్నది.

(అనవర్ణే ఇమే భూమీ)- అన్ అనే నిపాతం, అనేకమ్ అనే అర్థాన్ని కల్గినది. అనేక వర్ణాలను కల్గినవి, ఈ భూములు రెండు అనే అర్థాన్ని దీనికి గ్రహించవచ్చు. ఇయం వై రజతా, అసౌ హరిణీ (బ్రాహ్మణమ్-1-8-9) (ఇది తెల్లని వర్ణాన్ని కల్గినది, ఇది. అది పచ్చని వర్ణాన్ని కల్గినది) అని చెప్పబడింది కదా! లేక, అవర్ణ శబ్దం వర్ణం లేనిదానిని తెలుపుతుంది కనుక, అనవర్ణ శబ్దం పలు వర్ణాలను కల్గినదానిని తెల్పుతున్నదని కూడా గ్రహించవచ్చు. లేక, నవర్ణ శబ్దం వర్ణాలు లేనిదానిని తెల్పుతున్నదిగా గ్రహించి, అనవర్ణ శబ్దం పలు వర్ణాలను కల్గిన దానిని తెల్పుతున్నదిగా కూడా గ్రహించవచ్చు. లేక, అవర్ణమంటే- అనేది అరూపమై, దోషాన్ని తెలుపుతుంది అంటే, అప్పుడు అనవర్ణ శబ్దం దోషరహితమైన స్వభావాన్ని తెల్పుతున్నది.

(ఇమే భూమీ)– ఈ రెండు భూములు– అని అర్థం. అవి ఏవి? అంటే,

(ఇయం చా సౌ చ రోదసీ) – రోదస్ అని చెప్పబడే ఇక్కడ ఉండే ఈ భూమి, అక్కడ ఉండే దేవభూమి. రోదశ్శబ్దవాచ్యే రోదనాధారభూతే ప్రజాపతేః (బ్రహ్మయొక్క కన్నీటి తుంపురులు పడిన చోట్లు కనుక, రోదస్ అనబడుతున్నది) అని భట్టభాస్కర భాష్యం. భూమి ర్భూమ్నాద్యౌర్వరిణా (భూసూక్తమ్), ద్యోవీతీ యస్యాం తృతీయస్యామ్ అని ద్యావాపృథువులలో ఒకదానిని చెప్పే శబ్దం ఇంకొక దానికి వాచకంగా కన్పిస్తున్నందున, భూమిశబ్దం రెండిటిని తెల్పుతున్నదని అనడంలో లోటు లేదు. లేక, భూమిపదాన్ని యౌగికంగా గ్రహించి, రోదశ్శబ్దంచే చెప్పబడే ఈ ద్యావాపృథివులు అన్నీ జీవులకు స్థానంగాను, దోషరహితంగా ఉన్నాయి– అని కూడా చెప్పవచ్చు. ఇక్కడ ద్యావాపృథివులను పల్కడం సకలలోకాలకు ఉపలక్షణం.

(కింస్విదత్రాంతరాభూతం యేనేమే విధృతే) – ప్రత్యేక ప్రత్యేకంగా ఉండే ఈ రెండు, ఒకదానితో ఇంకొకటి తాకకుండా, దూరంగా విడచి వెళ్ళిపోకుండా ఒకే నియతస్థానంలో ఉన్నందున, వీటి మధ్యలో ఏదో ఒకటి ఉండి, వీటిని ధరించి నిలచి ఉన్నది– అనేది స్పష్టపడుతుంది. ఆ వస్తువు ఏది? అని సాధారణమైన ప్రశ్న చేయబడుతున్నది. ఒక దేవతను నిర్దేశించి, దాని గొప్పతనాన్ని ప్రశ్నించే సందర్భం అయితే, దానికి లేని మహిమలను కూడా ఆరోపించి పలికే సందర్భాలు శాస్త్రాలలో కూడా కన్పిస్తాయి. శివలింగ మహిమను తెలుపాలి అని అడుగగా, దానిని గూర్చి చాలా గొప్పగా పల్కింది శివపురాణం. ఇలిఙ్గత్తిట్ట పురాణత్తీరుమ్ అని అన్నారు కదా దీనిని నమ్మాళ్వార్లు.

సోఽహ మిచ్ఛామి ధర్మజ్ఞ! శ్రోతుం త్వత్తో యథా! జగత్,  
బభూవ భూయ శ్చ యథా మహాభాగ! భవిష్యతి,  
యన్మయం చ జగద్బ్రహ్మన్! యత శ్చైతచ్చరాచరమ్,  
లీనమాసీత్ యథా యత్ర లయమేష్యతి యత్ర చ (విష్ణు పు–1–1–4,5)

(ధర్మాన్ని తెలిసిన మహానుభావా! చరాచరాత్మకమైన ఈ జగత్తు పూర్వం ఏ విధంగా ఉన్నది? అని, తర్వాత ఏమి కాబోతున్నది? అని, దేనితో నిండి ఉన్నది? అని, దేనినుండి ఉద్భవించినది? ఎందులో ఏ విధంగా లీనం కాబోతున్నది? మీ నుండి వినగోరుతున్నాను) అని మైత్రేయుడు సాధారణంగా జగత్కారణాన్ని గూర్చిన ప్రశ్నను చేయగా, వశిష్ఠ-పులస్త్య వరప్రసాదంతో పరమాత్మ జ్ఞానాన్ని పొందిన పరాశరమహర్షి-

విష్ణోః స్సకాశాదుద్భూతం జగత్ తత్రైవ చ స్థితమ్,
స్థితిసంయమకర్తాఽసౌ జగతోఽస్య జగచ్చ సః

(లోకం విష్ణువు నుండి జనించింది. అతనిలోనే నిలచి ఉన్నది. దానిని నిలిపేవాడు, నియమించేవాడు ఆ విష్ణువే. ఈ జగత్తు అతడే) అని ఆరంభించి బదులు పల్కినందున విష్ణుపురాణాదులు నిష్పక్షపాతాలైన గ్రంథాలు. ఆ విధంగానే, ఇక్కడ కూడా ద్యావా పృథివి అనేవానిని ధరించేది ఏది? అని సామాన్యంగా ప్రశ్నించినందున, దీనికి లభించే బదులు నిష్పక్షపాతమైనదే- అనేది నిశ్చయం. ఆ బదులు ఇకపై తెలుపబడుతున్నవి.

(విష్ణునా విధృతే భూమీ)- విష్ణువుచే విశేషంగా ధరింపబడినవి ద్యావాపృథివులు. విశేషంగా ధరింపబడడం అంటే - లోపల ప్రవేశించి, వ్యాపించి, ధరింపబడడమే. దీనిని తెలిసికొన్నది ఎవరు? అంటే,

(ఇతి వత్సస్య వేదనా)- ఈ విధంగా వత్సుడనే మహర్షి దర్శించాడు.

(వేదనా)- ఇది ఊహించి పల్కిన అర్థం కాదు. జ్ఞానసాక్షాత్కారం ద్వారా శ్రీవత్సమహర్షి గ్రహించి తెలిసికొన్నాడు. వత్సో హి స్మృతికర్తా, స చ విష్ణుమేవ ద్యావాపృథివ్యోః విధారకం స్మరతి (వత్సుడనబడే మహర్షి స్మృతికర్త. వారు, విష్ణువునే ద్యావాపృథివులను విశేషంగా ధరించే వానినిగా తమ స్మృతిలో వివరించారు) అనేది సాయణ భాష్యం. ఇదే వేదపురుషుని నిశ్చయమని దీనివల్ల తెలుస్తున్నది.

భట్టభాస్కరులు ఇక్కడ విష్ణుశబ్దం సూర్యుని తెల్పుతున్నదని వ్యాఖ్యానించారు. ఇది కిం స్విదత్రేతి పంచవైష్ణవీః (కిం స్విత్ అత్ర అని ఆరంభమవుతున్న అయిదు మంత్రాలు విష్ణుదేవతాకాలు) అనే కల్పసూత్రంతో పొసగదు. విష్ణుశబ్దానికి సూర్యుడు ముఖ్యార్థభూతుడు కాబోడు. ఋగ్వేద విష్ణుసూక్తంలో ఉండే మంత్రమే అనంతరమంత్రమైనందున ఇది కూడా విష్ణువును తెల్పుతున్నదనేది స్పష్టం. లోకాధారత్వమనే పరమాత్మలింగం భీషోదేతి సూర్యః అనబడేది. సూర్యునకు లేదు– అనే విషయం వందలాది శ్రుతిస్మృతి ప్రమాణాలవల్ల సిద్ధం. అందువల్ల, ఇక్కడ విష్ణువు అనబడేవాడు సర్వవ్యాపి అయిన నారాయణుడే అనేది స్పష్టం. సాయణులు ఇక్కడ భగవానుడు విష్ణువే– అనే అర్థాన్ని గ్రహించారు. భట్టభాస్కరులు కూడా, సూర్యుడనే అర్థంలో ఉండే లోపాలను భావిస్తూ, యద్వా, సూర్యస్థో విష్ణురేవ ఇహ విష్ణుః (లేక, సూర్యమండలం మధ్యలో వేంచేసి ఉండే నారాయణుడే ఇక్కడ చెప్పబడే విష్ణువు) అని ఇంకొక అర్థాన్ని తెలిపారు.

ఇక్కడ, వేద భాష్యాలను అనుసరించి, ఒక సాధారణమైన ఒక విషయం తెలుపబడుతున్నది. శొన్నాల్ విరోదమిదు ఆకిలుమ్ శొల్లువన్ కేణ్మినో (దీనిని పల్కితే విరోధం వస్తుంది. అయినా పల్కుతాను; వినండి) సాయణులు, భట్టభాస్కరులు– అనే ఇద్దరు విష్ణుశబ్దవాచ్యుడైన నారాయణుడే పరవస్తువు– అని వేదాలలో పలు చోట్ల స్పష్టంగా పల్కినా, దానిని మనసారా ఒప్పుకోలేదు. అయినా, పలుచోట్ల వారికి విష్ణువే పరవస్తువు– అనే దానిని మఱుగుపరచడం సాధ్యం కాలేదు. సాధ్యమైన సందర్భాలలో అపార్థాన్ని ప్రతిపాదించడం ద్వారా తమ విష్ణుద్వేషాన్ని వ్యక్తం చేశారు. అటువంటి సందర్భాలలో ఇది ఒకటి. ఇంకా కొన్నిటిని ముందు ముందు చూపిస్తాము. అస్తు.

ఈ విధంగా ఈ మంత్రంలో ద్యావాపృథివుల చేత ఉపలక్షింపబడ్డ సర్వలోకాలను ధరించి, నిలచే విలక్షణుడైన పరదైవం విష్ణువే– అని నిశ్చయింపబడింది.

2. ఇరావతీ ధేనుమతీ హి భూతం సూయవసినీ మనుషే దశస్యే।
వ్యష్టభ్నాద్రోదసీ విష్ణవే తే దాధర్థ పృథివీ మభితో మయూఖైః॥

ఈ మంత్రం ద్వారా ఈ విధంగా విష్ణువు ధరించి నిలచినందువల్లనే ఈ లోకాలు ఓఙ్గు పెరుమ్ శెన్నెల్, పెరుమ్ పశుక్కళ్ (ఉన్నతంగా పెరిగే ఎఱ్ఱని ధాన్యం, గొప్ప పశువులు) మొదలైన సంపదలను పొంది వెల్గుతున్నాయి– అని వ్యాఖ్యానింపబడింది. ఈ మంత్రం ఋగ్వేద విష్ణుసూక్తాలలో వివరింపబడింది. అక్కడ వివరం గమనించవచ్చు.

3. కిం తద్విష్ణోర్బలమాహుః కా దీప్తిః కిం పరాయణమ్।
ఏకో యద్ధారయద్దేవః రేజతీ రోదసీ ఉభే॥

దేవః= దేవుడైన విష్ణువు, ఏకః = ఒక్కడుగానే, రేజతీ = వెల్గుతూ ఉండే, ఉభే రోదసీ = ద్యావాపృథివులు రెండిటిని, యత్ ధారయత్= దేనితో ధరించి ఉన్నాడో, విష్ణోః= విష్ణువు యొక్క, తత్ బలం = ఆ బలం, కిం ఆహుః= ఎంత? అని, (జ్ఞానులు) పల్కుతున్నారు?, కా దీప్తిః = అతని కాంతి ఎంతటిది?, కిం పరాయణమ్ = అతనికి ఏది గొప్పదైన స్థానం?

ఈ మంత్రంలో లోకాలను ధరించి ఉండే విష్ణువుయొక్క బలం మొదలైనవి ఎంతటివి? అని ప్రశ్నింపబడుతున్నది.

(కిం తద్విష్ణోః బలమాహుః) ద్యావాపృథివులను ధరించి నిలువదగిన విష్ణువుయొక్క బలం ఎంతటిది– అని చెబుతున్నారు? మిమ్ములను అందటిని ధరించి నిలచి ఉన్నట్లయితే, మహాబలశాలి అయి ఉండాలి కదా! దానిని లోకంలో కన్పించే బలశాలుల బలంతో పోల్చి, ఇంతటిది అని పరిచ్ఛేదించి పల్కడం సాధ్యమా? అని భావం. స్వరసంగా ఈ విధమైన అర్థాన్ని గ్రహించే అవకాశం ఉండగా, భట్టభాస్కరులు కిమ్ ఆహుః– కిం నిబంధన మాహుః (విష్ణువుయొక్క బలం) దేని కారణంగా కల్గినది?)

అని శబ్దాన్ని పీడించి అర్థాన్ని చెప్పారు. వేదభాష్యకారులిద్దరు ఈ మంత్రానికి సమాధానరూపమైన తర్వాత మంత్రానికి కూడా అపార్థాన్నే గ్రహించారు.

(కిం తద్విష్ణోర్బలమాహుః?)– జ్ఞానులు విష్ణువు యొక్క బలాన్ని ఎంతటిది? ఎటువంటిది?– అని పల్కుతున్నారు.

(కా దీప్తిః?)– అతని తేజస్సు ఎటువంటిది?

(కిం పరాయణమ్?) – అతనికి గొప్ప స్థానం ఏది? కిం బలమ్? అనేచోట కా దీప్తిః అనే చోట కిం నిబంధనమ్ అనే అర్థాన్ని గ్రహించిన భట్టభాస్కరులకు కిం పరాయణమ్ అనే చోట అటువంటి అర్థాన్ని గ్రహించడం సాధ్యం కాకపోయింది. వైరూప్యమనే ఒక దోషం వారి అర్థానికి ఉన్నది. ఇతని బలం మొదలైనవానిని విచారించడానికి ఏమి కారణం? అంటే,

(ఏకో యత్ ధారయద్దేవః)– ఒక్కడుగానే జగత్తును ధరించి ఉన్నాడుకదా, ఈ దేవుడు. లోకాలను ధరించి ఉండేటపుడు ఏదయినా సహాయం ఉన్నదా? ధరించి ఉండేటపుడు కూడా, దేవుడై– కాంతి నిండినవాడై కదా ఉన్నాడు. లోకంలో ఒక మూటను మోయాలంటే ముగ్గురు కావలసి వస్తున్నది. మోసిన తరువాత కలిగే అలసటకు అంతు లేదు. లోకాలను అన్నిటిని ఒక్కడుగా ధరించి, ధరించిన తరువాత కూడా కాంతిని పొంది శోభిల్లుతున్నాడంటే అతని బలం, కాంతి మొదలైనవానిని తెలియడంలో ఆశ కలుగదా? ఆ విధంగా అతడు ధరించి ఉండేవి ఏవి ? అని అంటే,

(రేజతీ రోదసీ ఉభే)– వెల్గుతూ ఉండే ద్యావాపృథువులను రెండిటిని కదా ధరించి ఉన్నాడు. ద్యావాపృథివులను పల్కడం ఇంకా క్రింద ఉండే లోకాలకు అన్నిటికి ఉపలక్షణం.

ఈ విధంగా ఈ మంత్రంలో లోకాన్ని అంతటిని ధరించి, కాంతి అతిశయించినవాడై ఉండే విష్ణువుయొక్క బలం, కాంతి, గొప్ప స్థానం ఏవి? అని ప్రశ్నింపబడింది.

4. వాతాద్విష్ణోర్బల మాహుః అక్షరాద్దీప్తిరుచ్యతే
త్రిపదాద్ధారయేద్దేవః యద్విష్ణో రేక ముత్తమమ్।
అగ్నయో వాయవ శ్చైవ ఏతదస్య పరాయణమ్॥

వాతాత్ = వాయువుకంటే అధికమైనదిగా, విష్ణోః= విష్ణువుయొక్క బలాన్ని, ఆహుః= పల్కుతున్నారు, అక్ష రాత్ = అగ్ని కంటే గొప్పదిగా, దీప్తిః= (విష్ణువుయొక్క) కాంతి, ఉచ్యతే = చెప్పబడుతున్నది, ఉత్తమమ్ = చాలా గొప్ప, విష్ణోః ఏకమ్ యత్ = విష్ణువుయొక్క, ఏకపాద్ విభూతి అయిన లీలావిభూతి ఏది ఉన్నదో, (అది కూడా) (దానిలో ఉండే), అగ్నయః= అగ్నులు, వాయవః చ ఏవ = వాయువులు (మొదలైనవానిని), త్రిపాత్ = త్రిపాద్విభూతి అయిన పరమపదంలో ఉండి, దేవః= విష్ణువు, ధారయత్ = (సంకల్పమాత్రంతోనే) ధరించి ఉన్నాడు.

గడచిన (ముందు) మంత్రంలో ప్రశ్నింపబడిన మూడు ప్రశ్నలకు ఈ రెండు మంత్రాలలో బదులు తెలుపబడుతున్నది. బలంలోను, కాంతిలోను గొప్పవిగా ఈ లోకంలో కన్పించే కొన్ని పదార్థాలను ప్రస్తావించి, వాటి కంటే బలంలో, కాంతిలో మించినవాడని పల్కి, ఇతనికి పరమపదమే గొప్ప నివాసస్థానమని ఈ రెండు మంత్రాలు పల్కుతున్నాయి.

(వాతాత్ విష్ణోః బలమాహుః) – వాయువు కంటే మించినదిగా విష్ణువుయొక్క బలాన్ని పల్కుతున్నారు. లోకంలో వాయువే గొప్ప బలం కల్గినదని చూస్తున్నాము. సుడిగాలి బలాన్ని చూడనివారెవరూ ఉండరు. వాయుర్వై క్షేపిష్ఠా దేవతా (వాయువే మిక్కిలి బలాన్ని కల దేవత) అని వేదం పల్కుతున్నది.

కరవిశుమ్బేరి ఒళి నీరి నిలమ్ ఇవైమిశై
వరనవిల్ తిఱల్ వలి అళిపొఱైయాయ్ నిన్ఱ (తిరువాయ్–1–1–11)

అని, వన్ కాగ్రై అత్తైయ ఒరున్గే మఱిన్దు కిడన్దు (తిరువిరుత్తమ్–42) (బలమైన వాయువు వీచగా, ఒక ప్రక్కకు ఒరిగి ఉండి) అని ద్రావిడవేదం వాయువునకు బలం అనేది విలక్షణగుణంగా పల్కింది.

అపీదమ్ సర్వమాదదీయం యదిదం పృథివ్యామ్ (కేనోపనిషత్)

(లోకంలో ఉండే అన్నిటిని గ్రహించి విసరివేయగలను) అని వాయువుయొక్క వార్త. ఈ కారణాలవల్లనే వేదం కూడా నమస్తే వాయో! త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి (వాయూ! నీకు నమస్కారం. నీవే ప్రత్యక్షమైన పరబ్రహ్మావై ఉన్నావు) అని ప్రత్యక్ష బ్రహ్మముగా పల్కింది. అటువంటి వాయువు కంటే విష్ణువుయొక్క బలం మించినది– అని ఇక్కడ తెలుపబడుతున్నది.

(అక్షరాద్దీప్తిరుచ్యతే)– అగ్నికంటే మించినదిగా విష్ణువుయొక్క తేజస్సు చెప్పబడుతున్నది. మిగిలినవానిని మండించి, నాశం చేస్తూ, తాను ఇంకా ఇంకా వృద్ధిని పొంది, నాశం పొందకుండా ఉండేది కనుక, అగ్ని అక్షరమ్ (నశించనిది) అనబడింది. తరువాత మంత్రంలో అగ్నయో వాయవ శ్చైవ అని వాయువుతో కూడ అగ్ని విష్ణువుచే ధరింపబడుతున్నదని ప్రస్తావించిన అగ్నియే ఇక్కడ వాయువునకు తరువాత ప్రస్తావింపబడిన అక్షరశబ్దానికి వాచ్యుడు– అని గ్రహించడం యుక్తమైనది. లేక, అక్షరమ్ అని నశించని లోకమైన పరమపదాన్ని తెల్పుతున్నదని కూడా చెప్పవచ్చు. తద్విష్ణోః పరమం పదమ్. దివీవ చక్షురాతతమ్ (విష్ణువుయొక్క ఆపరమపదం ఆకాశంలో ప్రకాశించే లోకచక్షుస్సు అయిన సూర్యునివలె తేజస్సును కల్గినది) అని,

అత్కార్కానలదీప్తం తత్ స్థానం విష్ణోర్మహాత్మనః,
స్వయైవ ప్రభయా రాజన్! దుష్ప్రేక్ష్యం దేవదానవైః

(మహాపురుషుడైన విష్ణువు యొక్క ఆ స్థానం సూర్యుడు, అగ్నిమొదలైనవాని కాంతిని మించిన కాంతిని కల్గినది. రాజా! కాంతిచేతనే అది దేవాసురులకు చూడడానికి సాధ్యం కానిది)

అని చెప్పబడిన పరమపదంలో కూడా అతని తేజస్సు అధికమైనది.

ఈ విధమైన అర్థాన్ని గ్రహించడమే అడిగిన ప్రశ్నకు పొసగుతుంది. లోకాలను అన్నిటిని ఒక్కడై నిలచి ధరించి, మించిన తేజస్సుతో ఉండే విష్ణువుయొక్క బలం, తేజస్సు ఏది? అనేది ప్రశ్న. దీనికి బదులుగా విష్ణువు బలంయొక్క, జ్యోతిస్సుయొక్క గొప్ప తనాన్ని తెలుపాలే తప్ప, వానికి తక్కువదనాన్ని పలుకకూడదు.

యుక్తమైన పద్ధతి ఈ విధంగా ఉండగా, వేదభాష్యకారులిద్దరు వాయువువల్ల విష్ణువునకు బలం కల్గుతున్నది, అక్షరంనుండి కాంతి కల్గుతున్నది– అనే అపార్థాన్ని గ్రహించారు. ఇది ప్రశ్నకు ఏకో యద్ధారయత్ (ఒక్కడై ధరించాడు) మొదలైన ప్రయోగాలకు, మిగిలిన వేదవాక్యాలకు ఎంతమాత్రం పొసగదు. "ఔపనిషద పరమ పురుష వరణీయతా విరహిణాం" పరమపురుషునకు వరణీయుడు కావడంలో హేతుభూతాలైన గుణవిశేషాలు లేనందువల్లనే, ఈ విధంగా కొందఱు వేదాలకు అపార్థాలను పల్కుతున్నారని శ్రీభాష్యకారులు పల్కిన సూక్తి అనుసంధేయం.

కిం తత్ విష్ణోః బలమాహుః ? కా దీప్తిః అనే రెండు ప్రశ్నలకు ఇంతవరకు సమాధానం తెలుపబడింది. ఇక, కిం పరాయణమ్ (విష్ణువునకు గొప్ప స్థానమేది?) అని అడిగిన ప్రశ్నకు బదులివ్వబడుతున్నది.

అంతరాదిత్యే అని ఆదిత్యుని, హృదయం విశ్వస్యాయతనమ్ అని హృదయాన్ని, అంతరక్షిణీ అని శ్రీకృష్ణుని, అంభస్య పారే అని క్షీరాబ్ధిని, నాకస్య పృష్ఠే, పరమే వ్యోమన్, విష్ణోః పరమం పదమ్ అని పరమపదాన్ని విష్ణువునకు స్థానంగా వేదాలు పల్కుతున్నాయి. అంతర్బహిశ్చ తత్ సర్వం వ్యాప్య నారాయణః స్థితః (ఈ జగత్తు అంతట లోపల బయట వ్యాపించి నారాయణుడున్నాడు) ఇత్యాది వాక్యాలు లోకాలను

అన్నిటిని అతని కోవెలగా పఠిస్తున్నాయి. ఈ విధంగా లోకం అంతా విష్ణువునకు నివాసస్థానమైనందున, వాటిలో గొప్ప స్థానం ఏది? అని ఈ ప్రశ్నలోని భావం.

(త్రిపదాద్ధారయద్దేవః) త్రిపాదస్యామృతం దివి (పురుషసూక్తమ్)

(ఈ పరమపురుషుని విభూతిలో మూడు భాగాలు పరమపదంలో ఉన్నది) అని చెప్పబడిన త్రిపాద్విభూతిలో ఉండి అతిశయించిన కాంతిని కలవాడైన విష్ణువు ధరిస్తున్నాడు. దేనిని ధరిస్తున్నాడు? అంటే,

(యద్విష్ణో రేక ముత్తమమ్)– విష్ణువు అనే తనయొక్క లీలలకు, గుణావిష్కారాలకు విషయమైనందున మిక్కిలి గొప్పదై వెలిగేది,

పాదోఽస్య విశ్వా భూతాని (పురుషసూక్తమ్)

(ఈలోకంలో ఉండే అన్ని భూతాలు ఇతని విభూతిలో నాల్గవ వంతు) అని ఏకపాద్విభూతిగా చెప్పబడేది అయిన ఈ లీలావిభూతిని ధరించి ఉన్నాడు.

(విష్ణోః)– వామనన్ మణ్ (తిరువాయ్) (ఇది వామనుని భూమి) అన్నట్లు విష్ణువుయొక్క భూమియే ఇది కూడా– అని అర్థం.

(ఏకమ్) – ఏకపాద్విభూతిగా పేరు పొందినది– అని అర్థం. ఈ లోకాన్ని అంతటిని విష్ణువుకు ధార్యంగా చెప్పినందున, ద్యావాపృథివులను ధార్యంగా ప్రస్తావించడం కూడా లోపలకు అన్నిటికీ ఉపలక్షణం– అని తెలుపబడుతున్నది.

(ఉత్తమమ్)– ఇన్బుఱుమ్ ఇవ్విళైయాట్టుడైయాన్ (తిరువాయ్) (ఆనందాన్ని కల్గించే ఈ లీలను కలవాడు) అని,

మలరున్ది వీట్టె ప్పణ్ణి విళైయాడుమ్ (నాచ్చియార్ తిరు)

(నాభీకమలాన్ని వాసస్థానంగా చేసికొని క్రీడిస్తాడు),

లోకవత్తు లీలాకైవల్యమ్ (బ్రహ్మసూత్రాలు)

(జగత్సృష్ట్యాదులు, లోకం వలె, పరమాత్మకు కేవలం లీల),

అఖిలభువనజన్మ హేమభంగాదిలీలే (శ్రీభాష్యమంగళశ్లోకం)

(సమస్త భువనాల జన్మ, స్థితి, లయాదులు లీలగా కలవాడు)

అనేవిధంగా అతని లీలకు విషయమైనందున, పగటి దీపం వలె ఉండే పరమపదంవలె కాకుండా, చీకటిలో ప్రకాశించే దీపంవలె, ఈ లోకంలోనే గుణాలు గొప్పగా ప్రకాశిస్తాయి కనుక, ఉత్తమమ్ (చాలా గొప్ప లోకం) అని చెప్పబడుతున్నది.

(త్రిపదాద్ధారయద్దేవః యద్విష్ణో రేకముత్తమమ్) –

వీற்றிరున్దేழுలకుమ్ తనిక్కోల్ శెల్ల (తిరువాయ్–4–5–1)

(వేంచేసి ఉండి, ఏడులోకాలలో తన, అద్వితీయమైన అధికారం చెల్లుబాటు కాగా) అని నమ్మాళ్వార్లు పలికారు. వాతాత్ విష్ణోర్బలమ్ అని, అక్షరాత్ దీప్తి అని ఈ లోకంలో బలంలో, కాంతిలో మించినవిగా ప్రస్తావింపబడిన వాయువు, అగ్ని ఇతనిచే ధరింపబడేవానిలో అంతర్భవించినవే కదా! బాహ్యాలా? అని అంటే,

(అగ్నయో వాయవ శైవ)– అగ్ని, వాయువు– అనే వీనినికూడా పరమాత్మ ధరిస్తున్నాడు. అగ్నయః అని బహువచనంలో ప్రయోగించినందున సూర్యుడు, నక్షత్రాలు మొదలైన తేజఃపదార్థాలు అన్నీ లక్షింపబడుతున్నవి. వాయవః అనే బహువచన ప్రయోగంవల్ల ప్రాణాపానాది రూపంతో పలు విధాలుగా ఉండే వాయువులన్నీ సూచింపబడుతున్నాయి. ఇక్కడ, అగ్ని, వాయువు ధార్యవస్తువులుగా ప్రస్తావింపబడినందున, వాతాత్ విష్ణో అనేదానికి వాయువు వల్ల విష్ణువునకు బలం అనే అర్థాన్ని గ్రహించడం సరి కాదనేది స్పష్టం.

(ఏతదస్య పరాయణమ్)– ఈ త్రిపాద్విభూతియే ఇతనికి గొప్ప స్థానం. ఏతత్ అని ప్రశస్తమైన త్రిపదాన్ని ప్రస్తావిస్తున్నది. అగ్నయః వాయవః అనేవి ఏతత్ పదంలో సూచింపబడుతున్నాయని వేదభాష్యకారులు భావించారు. అది, శబ్దంలోను, అర్థంలోను అస్వారస్యాన్ని కల్గిన అర్థమే కాగలదు.

ఈ విధంగా ఈ మంత్రం ద్వారా– విష్ణువు అంతు లేని బలాన్ని, కాంతిని కలవాడని, పరమపదాన్ని పరాయణంగా కల్గినవాడని, సర్వాధారభూతుడని నిరూపింపబడింది.

6. పృచ్ఛామి త్వా పరం మృత్యుమ్ ।అవమం మధ్యమం చతుమ్।
లోకం చ పుణ్యపాపానామ్। ఏతత్ పృచ్ఛామి సంప్రతి॥

పరం మృత్యుం = నాశం చేసేవారిలో గొప్పవానిని, అవమమ్= అధముని, మధ్యమం = మధ్యస్థుని, చతుం = నాల్గవవానిని, పుణ్యపాపానాం = పుణ్యపాపాలకు తగిన, లోకం చ = లోకాలను, త్వా = మిమ్ములను, పృచ్ఛామి = ప్రశ్నిస్తున్నాను, సంప్రతి= ఇపుడు, ఏతత్ పృచ్ఛామి = దీనిని ప్రశ్నిస్తున్నాను.

ఈ లోకంలో సంహర్తలుగా ఉండేవారిని నాల్గు విధాలుగా వర్గీకరించి పలికే రీతిలో, పుణ్యపాపలోకాలను గూర్చిన ప్రశ్న ఈ మంత్రంలో చేయబడుతున్నది.

(పృచ్ఛామి త్వా పరమం మృత్యుమ్)– సంహరించేవారిలో గొప్పవాడెవడు? అని మిమ్ములను అడుగుతున్నాను.

(అవమమ్)– నీచుడైనవాడెవడు? అని ప్రశ్నిస్తున్నాను.

(మధ్యమమ్)– ఇంతేకాక, ఉన్నతుడు, అథముడు కాక, మధ్యలో ఉండేవానినిగూర్చి ప్రశ్నిస్తున్నాను.

(చతుమ్)– నాల్గవవానినిగూర్చి ప్రశ్నిస్తున్నాను.

(సంప్రతి) – ముందు ప్రశ్నకు తరువాత, ఇపుడు,

(పుణ్యపాపానాం లోకమ్ చ ఏతత్ పృచ్ఛామి) పుణ్యపాపాలను గూర్చి మిమ్ములను ప్రశ్నిస్తున్నాను. పుణ్యపాపాలను చేసినవారు ఏ లోకాలకు వెడుతున్నారు– అనేదానిని కూడా ప్రశ్నిస్తున్నాను– అని భావం.

7. అము మాహుః పరం మృత్యుమ్! పవమానం తు మధ్యమమ్।
అగ్ని రేవావమో మృత్యుః ।చంద్రమా శ్చతురుచ్యతే ॥

అముమ్ = ఈ విష్ణువునే, పరమం మృత్యుమ్ ఆహుః= గొప్ప సంహారకునిగా పల్కుతున్నారు, పవమానం తు = వాయువునే, మధ్యమమ్ (ఆహుః)= మధ్యలో ఉన్న వానినిగా పల్కుతున్నారు, అగ్నిః ఏవ = అగ్నియే, అవమో మృత్యుః= అధముడైన సంహారకుడు, చంద్రమాః= చంద్రుడే, చతుః ఉచ్యతే = నాల్గవవానినిగా పల్కుతున్నారు.

ఈ మంత్రంలో నల్గురు మృత్యువులు తెలుపబడుతున్నారు.

(అముమాహుః పరమం మృత్యుమ్)- పూర్వ మంత్రంలో ప్రస్తుతింపబడిన విష్ణువే గొప్ప మృత్యువుగా చెప్పబడుతున్నాడు. మిగిలినవారంతా ఇతనికి సహకారులు అవుతున్నందున, ఇతడు ఒక్కడే మరణం పొందాలి అని సంకల్పించినవాడైతే, దానిని మిగిలిన ఎవరికి దానిని మార్చడానికి సాధ్యం కాదు. కనుక, ఇతడు గొప్ప మృత్యువు అనబడుతున్నాడు. స్థాతుమ్నశక్తాః యధిరామవధ్యమ్ (శ్రీరామాయణం)

యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః,
మృత్యుర్యస్యోపసేచనమ్ (కఠోపనిషత్)

(ఎవనికి లోకం అంతా అన్నంగా, యముడు ఊరగాయగా అవుతున్నారో) అని మృత్యుమృత్యువు అయినవాడు కదా, ఇతడు.

(పవమానం తు మధ్యమమ్)- గడచిన మంత్రంలో వాతాత్ అని, వాయవః అని ప్రస్తుతింపబడిన వాయువే మధ్యముడైన మృత్యువు -అని అంటున్నారు. ప్రాణవాయువే ప్రాణం తీయడానికి కారణమైనందున, ఆ వాయువు నాడులలో విపరీతంగా సంచరించడం ఆరంభిస్తే, మరణం కల్గుతుంది కనుక, వాయువు అనేవాడు పరమపురుషునకు తరువాతివాడైన మృత్యువుగా చెప్పబడుతున్నాడు.

(అగ్నిరేవావమో శత్రుః)– అగ్నియే అధముడైన మృత్యువు. జఠరాగ్ని మందం అయితే, వ్యాధిని కల్గించడంద్వారా మరణానికి కారణమవుతున్నది. అందువల్ల, ఇది సద్వైద్యులచే స్వల్పప్రయత్నంతోనే ప్రజ్వరిల్లచేసి, మరణం కలుగకుండా నిరోధింపబడుతున్నది. అందువల్ల ఈ అగ్ని అథమమైన మృత్యువు –అనబడుతున్నాడు.

(చంద్రమాః చతురుచ్యతే) – చంద్రుడు నాల్గవ మృత్యువుగా చెప్పబడుతున్నాడు. చంద్రుడు సస్యాధిపతి. ఇతడు అనుగ్రహించకపోతే, అన్నం లేకుండా పోతుంది. కనుక, దానివల్ల మరణం కల్గుతుంది. అందువల్ల ఇతడు నాల్గవ మృత్యువుగా చెప్పబడుతున్నాడు.

ఈ విధంగా ఈ మంత్రంలో సర్వసంహర్తలలో గొప్పవాడై, ఉన్నతుడై ఉండే సంహారకుడు విష్ణువే అని స్థిరీకరింపబడింది.

8. అనా భోగాః పరం మృత్యుమ్। పాపాః సంయంతి సర్వదా।
అభోగాస్త్వేవ సంయంతి ।యత్ర పుణ్యకృతో జనాః |
తతో మధ్యమ మాయాంతి ।చతుమగ్నిం చ సంప్రతి ॥

అనా భోగాః= (స్వర్గ) భోగాలు లేని, పాపాః= పాపులు, పరమం మృత్యుం = గొప్ప మృత్యువును, సర్వదా = ఎల్లప్పుడు, సంయంతి= పొందుతున్నారు, అభోగాః తు = స్వర్గభోగాలు కల పుణ్యాశాలురైతే, యత్ర పుణ్యాకృతః జనాః (తత్ర) ఏవ = ఎక్కడ పుణ్యాశాలురైన జనులున్నారో, అక్కడే, సంయంతి వెడుతున్నారు, (పొందుతున్నారు), తతః= ఈ ఇద్దరికంటే అన్యులైన, పుణ్యపాపాలను రెండిటిని నిండినవారు, సంప్రతి = ఈ లోకంలో, మధ్యమమ్= మధ్యమ మృత్యువైన వాయువును, అగ్నిమ్ = అధమమృత్యువైన అగ్నిని, చతుం = నాల్గవవాడైన చంద్రుని, ఆయాంతి = పొందుతున్నారు.

ఈ మంత్రాలలో లోకం చ పుణ్యపాపానాం పృచ్ఛామి (పుణ్యపాపాలను చేసినవారు పొందే లోకాన్ని గూర్చి అడుగుతున్నాను) అనే ప్రశ్నకు బదులు తెలుపబడుతున్నది.

(అనాభోగా పాపాః)- ఆభోగాలని పూర్ణభోగాలైన స్వర్గభోగాలు చెప్పబడుతున్నవి. వాటిని పొందలేనివారు అనాభోగాః అనబడతారు. వీరు పాపమే నిండినవారనే విషయం పాపాః అనే పదంతో చెప్పబడుతున్నది. కృమికీటాదులుగా జన్మించేవారు, వీరు.

(సర్వదా పరం మృత్యుం సంయంతి)- జాయస్వ, మ్రియస్వ అని శ్రుతిలో చెప్పబడిన రీతిలోనే జాయస్వ మ్రియస్వ అని పరమమృత్యువైన పరమాత్మ సంకల్పానికి ఎల్లప్పుడు వీరు విషయమవుతున్నారు. మహాపాపులైన వీరికి పోవడమనేది ఏదీ లేదు. ఇక్కడే పరమాత్మ సంకల్పానికి విషయమై, ఎల్లప్పుడు జన్మించి, మరణించడమే వీరికి ఏర్పడుతున్నది.

(ఆభోగాః తు ఏవ)- స్వర్గభోగాలుండే పుణ్యశాలురే – అని అర్థం. తు అనే పదంతో పూర్వం ప్రస్తావింపబడిన పాపులకంటే అన్యులైన పుణ్యశాలురు, వీరు– అని తెలుపబడుతున్నది. ఏవ అనే అవధారణంతో పుణ్యశాలురకే తగినవి, స్వర్గాదిలోకాలు– అని తెలుపబడుతున్నది.

(యత్ర పుణ్యకృతో జనాః తత్ర సంయంతి) – జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత (స్వర్గాన్ని పొందగోరేవాడు జ్యోతిష్టోమ యాగాన్ని చేయాలి) అని విధింపబడిన పుణ్యకర్మలను చేసేవారు ఎక్కడ ఉంటారో, అక్కడకు వెడుతున్నారు.

(తతః)– తతోన్యే అని అర్థం. పూర్వం పల్కిన ఇద్దటి కంటే వేఱయినవారు. మిక్కిలి పాపాన్ని చేసి, సదా పుట్టి, మరణించేవారి కంటే, మిక్కిలి పుణ్యాన్ని చేసి స్వర్గాదిలోకాలను పొందేవారి కంటే వేఱయినవారు–అని అర్థం. పుణ్య, పాపం– అనే రెండిటిని కలవారు.

(సంప్రతి)- ఈ మనుష్యజన్మలో,

(మధ్యమ మాయాంతి)- మధ్యమమృత్యువైన వాయువును పొందుతున్నారు.

(చతుమగ్నిం చ)- అథమమృత్యువైన అగ్నిని, నాల్గవ మృత్యువైన చంద్రుని పొందుతున్నారు. వారిచే ఇక్కడ మృత్యువును పొందుతున్నారు—అని భావం. తతః అని పల్కినందువల్ల మూడవ ప్రకారమైన అధికారులను గూర్చి పల్కుతున్నట్లుగా గ్రహించకుండా, స్వర్గభోగాదుల అనంతరం, ముందు చెప్పబడిన పుణ్యశాలులకు ఏర్పడే గతిని పొందుతున్నట్లుగా గ్రహించవచ్చు.

**తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం**
**క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి** (గీత-9-21)

(వారు విశాలమైన స్వర్గలోకాన్ని అనుభవించి, పుణ్యం తీరిన తర్వాత మానవలోకాన్ని చేరుతున్నారు) అని ఇక్కడకు వచ్చిన తరువాత వారికి కలిగే గతి చెప్పబడుతున్నది.

ఈ మంత్రంలో కూడా పరమమృత్యువైనవాడు పరమపురుషుడే—అని స్థిరీకరింపబడింది.

ఇక, కృష్ణయజుర్వేద సంహితాభాగంలో ఉండే కొన్ని విష్ణుసూక్తాలు పరిశీలింపబడుతున్నాయి.

ప్రథమకాండం- ద్వితీయ ప్రశ్నలోవిష్ణోర్నుకమ్ అని ఆరంభమయే మంత్రం, దానికి ముందు దివో వా అని ప్రారంభమయే మంత్రం ఉన్నాయి. విష్ణోర్నుకమ్ అనే మంత్రం ఇంతకు ముందే వ్యాఖ్యానింపబడింది కనుక, దివో వా అనే మంత్రం ఇపుడు వివరింపబడుతున్నది.

**దివో వా విష్ణ వుత వా పృథివ్యాః మహో వా విష్ణ వుత వాంతరిక్షాత్।**
**హస్తౌ పృణస్వ బహుభి ర్వసవ్యై రాప్రయచ్ఛ దక్షిణాదోత సవ్యాత్ ॥**

విష్ణో! =ఓవిష్ణూ! , దివః వా= దేవలోకంనుండి అయినా, ఉత పృథివ్యాః వా = లేక, భూమినుండి గాని, మహః వా= మహర్లోకంనుండి గాని, ఉత అంతరిక్షాత్ వా = లేే, ఆ అంతరిక్షలోకంనుండి గాని (తీసికొనిరాబడిన), బహుభిః= పలురీతులలోని, వసవ్యైః= ధనాలతో, హస్తౌ = (నా) హస్తాలను, పృణస్వ= నిండినదిగా, (విష్ణో) = ఓవిష్ణూ! , దక్షిణాత్ = నీ కుడిచేతిలోనుండి, ఉత సవ్యాత్ = ఎడమచేతినుండి, ఆప్రయచ్ఛ= (సకల ఫలాలలను) ఇవ్వాలి.

ఈ మంత్రంలో సకలప్రదుడైన విష్ణువు వద్ద సకల పురుషార్థాలను వేదపురుషుడు ప్రార్థిస్తున్నాడు.

ధనం లేనివారికి ఈ లోకం శూన్యం కనుక, మొదట ధనం అర్థింపబడుతున్నది.

(విష్ణో! ) – సర్వలోకవ్యాపీ! ఈ లోకానికి నేను వెళ్ళలేను– అని నీవు అనలేవు కదా! అంతటా, ఎప్పుడూ నిండి ఉండేవాడవైనందున, సమస్తసంపద నీ హస్తగతమై ఉన్నదికదా! ఏ సంపద నీకు కావాలి? అంటే, అన్ని లోకాలలో ఉండే సమస్త సంపద కావాలి– అని తరువాత పల్కుతున్నాడు.

(దివో వా)– దేవలోకంనుండి తీసికొనిరావాలి.

(ఉత వా పృథివ్యాః)– భూమినుండి తీసికొనిరావాలి.

(మహో వా)– మహర్లోకంనుండి తీసికొనిరావాలి.

(ఉత వాంతరిక్షాత్)– అంతరిక్ష లోకంనుండి తీసికొని రావాలి. ఉత, వా అనే శబ్దాలు సముచ్చయార్థంలో కూడా ప్రయోగింపబడతాయి. కనుక, ఈ విధమైన అర్థం గ్రహింపబడింది. లేక, వికల్పార్థంలో కూడా కావచ్చు. ఏ లోకంలో అయినా వ్యాపించి ఉండే నీవు, ఏ లోకం నుండి తీసికొనివచ్చినా సరే. నా చేయి నీవిచ్చే సంపదతో నిండిపోవాలి; అంతే! అనేదే అభిప్రాయం.

(హస్తౌ పృణస్వ) - నా రెండు చేతులను నిండించాలి. ఏ సంపద కావాలి? అంటే,

(బహుభి ర్వసవ్యైః) – పలు విధాలైన సంపదలతో నిండించాలి. ధనం, ధాన్యం, పశువులు, గృహాలు, పొలాలు మొదలైన సంపదలలో ఒకటి ఉండి, ఇంకొకటి లేకుండా పోతే, ధనవంతుడుగా చెప్పబడడు కదా! ఇవి అన్ని రీతులలోను పరిపూర్ణంగా అనుగ్రహించాలి- అని భావం. ఇక, ఇతరపురుషార్థాలను కూడా ఇవ్వాలి- అని అర్థిస్తున్నాడు.

(విష్ణో! )- పరమపురుషా!

(ఆప్రయచ్ఛ దక్షిణాదోత సవ్యాత్) – నీ కుడివైపు, ఎడమవైపు ఉండే నాల్గు చేతులతో నాల్గు విధాలైన పురుషార్థాలను ఇవ్వాలి.

చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవ శ్చతుర్భుజః
(చతుర్భుజుడైన దేవుడు నాల్గు పురుషార్థాలను నాల్గు చేతులతో ఇస్తాడు) అన్నారు, ఆలంకారికులు.

కొళ్ళుమ్ పయనిల్లై కుప్పై కిళర్ త్తన్న శెల్వత్తై
వళ్ళల్ పుకழ்న్దు నుమ్ వాయ్ మై యిழக్కుమ్ పులవీర్ కాళ్ |
కొళ్ళ క్కుఱై విలన్ వేణ్డాற்றెల్లామ్ తరుమ్ కోదిల్,
ఎన్ వళ్ళల్ మణివణ్ణన్దన్నై క్కవిశొల్ల వమ్మినో (తిరువాయ్-3-9-5)

అని అన్నారు నమ్మాళ్వార్లు.

దేవేంద్ర స్త్రిభువన మర్థమేకపింగః ,
సర్వర్థిం త్రిభువనగాం చ కార్తవీర్యః,
వైదేహః పరమపదం ప్రసాద్య విష్ణుం.
సంప్రాప్తః, సకలఫలప్రదో హి విష్ణుః (విష్ణుధర్మమ్-43-46)

(విష్ణువును ఆరాధించి దేవేంద్రుడు ముల్లోకాలను, కుబేరుడు సంపదను, కార్తవీర్యుడు ముల్లోకాలలో వ్యాపించిన అన్ని మహిమలను, జనకమహారాజు పరమపదాన్ని పొందారు. విష్ణువు భక్తులు అడిగిన అన్ని ఫలాలను ఇచ్చేవాడు కదా) అన్నారు ఋషులు. వాటికన్నిటికి మూలం మంత్రమే. ఈ విధంగా ఈ మంత్రం ద్వారా భగవానుడైన విష్ణువు సకలఫలప్రదుడు– అని చెప్పబడింది.

యజుర్వేదం– ప్రథమకాండం– సప్తమప్రశ్నలో ఈ క్రింది విధంగా అధ్యయనం చేయబడుతున్నది.

యజ్ఞో వై విష్ణుః ।యజ్ఞ ఏవాంతతః ప్రతితిష్ఠతి॥

యజ్ఞః= యజ్ఞమనేది, విష్ణుఃవై = విష్ణువే కదా, యజ్ఞ ఏవ=అయ యజ్ఞపురుషుడైన విష్ణువే, అంతతః= చివరలో, ప్రతితిష్ఠతి = నిలచి ఉంటాడు.

యజుర్వేదం ఆఱవ కాండం– మొదటి ప్రశ్నలో ఈ విధంగా అధ్యయనం చేయబడుతున్నది.

**వైష్ణవీ మృచ మనుబ్రూయాత్ |**
**యజ్ఞో వై విష్ణుర్యజ్ఞేనైవ యజ్ఞం సంతనోతి ॥**

వైష్ణవమ్ ఋచమ్ = విష్ణువునకు చెందినది అయిన, ఋక్కును, అనుబ్రూయాత్ = చెప్పాలి, యజ్ఞో వై విష్ణుః= యజ్ఞం విష్ణువే కదా, యజ్ఞేన ఏవ = యజ్ఞంతోనే, యజ్ఞమ్ = విష్ణువును, సంతనోతి = చక్కగా ఆరాధిస్తున్నాడు.

యజ్ఞస్వరూపుడైన సర్వేశ్వరునిగూర్చి పలికే ఈ మంత్రాలు వివరింపబడుతున్నాయి.

(యజ్ఞో వై విష్ణు:)– యాగం విష్ణువే కదా! వై అనే పదం ప్రసిద్ధిని తెల్పుతున్నది. వాస్తవానికి ఈ అర్థం లెక్క పెట్టలేనన్ని శ్రుతిస్మృతీతిహాస పురాణవచనాలలో ప్రసిద్ధమైనది కదా! అచేతన క్రియాకలాపరూపమై ఉండే యాగాన్ని పరమచేతనుడైన విష్ణువుతో ఐక్యం చేసి పలికే ఈ వాక్యం ఏ విధంగా పొసగుతుంది? అంటే, ఇక్కడ స్వరూపైక్యం చెప్పబడడం లేదు.

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ (గీత-9-24)

(నేనే అన్ని యజ్ఞాలను అనుభవించేవాడను, వాటికి ఫలాన్ని ఇచ్చేవాడను కూడా నేనే) అని,

యజ్ఞ ఇజ్యో మహేజ్య శ్చ క్రతు స్సత్రం సతాం గతిః

(యజ్ఞం, దాని సాధనం, దాని ఫలం – మొదలైనవానికి ఎల్లయ్యై ఉండేవాడు కనుక, యజ్ఞమనబడేవాడు, కామాధికారులచే యాగం ద్వారా ఆరాధింపబడేవాడు, నిష్కాములచే పెద్ద యాగంతో ఆరాధింపబడేవాడు, పంచమహాయజ్ఞాలతో ఆరాధింపబడేవాడు, దీర్ఘసత్రాలతో ఆరాధింపబడేవాడు, సత్పురుషులకు గతి) అని,

యజ్ఞో యజ్ఞపతి ర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః,<br>
యజ్ఞభృత్ యజ్ఞకృత్ యజ్ఞీ యజ్ఞభుక్ యజ్ఞసాధనః,<br>
యజ్ఞాంతకృత్ యజ్ఞగుహ్య మన్న మన్నాద ఏవ చ (విష్ణుసహస్రనామమ్)

(శక్తి లేనివారికి తానే యజ్ఞమై ఉండేవాడు, యజ్ఞఫలాన్ని ఇచ్చేవాడు, అశక్తులకు తానే యజమానియై ఉండేవాడు, యజ్ఞాన్ని అంగంగా– శేషంగా– కలవాడు, యజ్ఞాన్ని నడపించేవాడు, యజ్ఞాన్ని పోషించేవాడు, యజ్ఞాన్ని సృష్టించేవాడు, యజ్ఞాలకు స్వామియై ఉండేవాడు, యజ్ఞభోక్తగా, యజ్ఞరక్షకుడుగా ఉండేవాడు, యజ్ఞాన్ని తనను పొందడంలో సాధనమై ఉండేవాడు. యజ్ఞఫలమైన జ్ఞానాన్ని ఇచ్చేవాడు, యాగరహస్యమై ఉండేవాడు, అన్నమై, అన్నాన్ని భుజించేవాడై ఉండేవాడు) అని,

యే యజంతి పితౄన్ దేవాన్ బ్రాహ్మణాన్ సహుతాశనాన్,<br>
సర్వభూతాంతరాత్మానం విష్ణుమేవ యజంతి తే (దక్షస్మృతి)

(పితృదేవతలను, దేవతలను, బ్రాహ్మణులను, అగ్నిని, యాగంతో ఆరాధించే వారందఱు సర్వభూతాంతరాత్మ అయిన విష్ణువునే ఆరాధిస్తున్నారు) అని,

యేఽప్యన్య దేవతాభక్తాః యజంతే శ్రద్ధయాన్వితాః,<br>
తేపి మామేవ కౌంతేయ! యజంత్యవిధిపూర్వకమ్

(అర్జునా! అన్యదేవతలకు భక్తులై, ఎవరు శ్రద్ధతో పూజిస్తున్నారో, వారుకూడా నన్నే దారికానిదారిలో పూజిస్తున్నారు) అని,

వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్,
విష్ణురారాధ్యతే పంథా నాన్య స్తత్తోషకారకః (విష్ణు-పు-38-9)

(బ్రాహ్మణాది వర్ణాలను, బ్రహ్మచర్యాది ఆశ్రమాలను కల మానవునిచేతనే పరమపురుషుడైన విష్ణువు ఆరాధింపబడుతున్నాడు. అతనిని ఆరాధించే దారి ఇంకొకటి లేదు) అని,

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్య (అన్ని కర్మలను నావద్ద సమర్పించి) అని,

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః,
తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసారసాగరాత్

(ఎవరు, కర్మలన్నిటిని నావద్ద సమర్పించి, నా విషయంలో అభినివేశాన్ని కలవారవుతారో, వారిని మృత్యువు వంటి సంసారసాగరంనుండి ఉద్ధరించేవాడను కాగలను)అని,

ప్రమాదాత్ కుర్వతాం కర్మ ప్రచ్యవత్యధ్వరేషు యత్,
స్మరణాదేవ తద్విష్ణోః సంపూర్ణం స్యాదితి శ్రుతిః

(యజ్ఞాలలో తెలియక ఏర్పడే లోపాలు విష్ణుస్మరణ చేతనే తొలగి, ఆ యజ్ఞం పూర్తి అవుతున్నదని వేదం పల్కింది) అని,

సర్వే వేదాః సర్వవేద్యాః సశాస్త్రాః, సర్వే యజ్ఞాః సర్వ ఇజ్యాశ్చ కృష్ణః,
విదుః కృష్ణం బ్రాహ్మణా స్తత్త్వతో యే తేషాం రాజన్! సర్వయజ్ఞాః సమాప్తాః

(అన్ని వేదాలు, వేదాలవల్ల తెలియదగిన అన్ని అర్థాలు, అన్ని ఉపబృంహణాలు, అన్ని యజ్ఞాలు, యాగంలో ఆరాధింపబడే అందఱు దేవతలు

శ్రీకృష్ణుడే. రాజా! ఏ బ్రాహ్మణుడు శ్రీకృష్ణుని యథాతథంగా తెలిసికొన్నారో, వారికి అన్ని యజ్ఞాలు పూర్తి అయినట్లే) అని,

జ్యోతీంషి శుక్లాని చ యాని లోకే త్రయో లోకా లోకపాలా స్త్రయీ చ,
త్రయోఽగ్నయ శ్చాహుతయశ్చ పంచ సర్వే వేదా దేవకీపుత్ర ఏవ (భారతమ్)

(లోకంలో ఉండే తెల్లని కాంతులను కల జ్యోతిస్సులు, ముల్లోకాలు, లోకపాలకులు, వేదాలు, మూడగ్నులు, అయిదు ఆహుతులు, అన్ని వేదాలు- దేవకీ పుత్రుడే) ఇత్యాది పరశ్శత ప్రమాణాలతో యజ్ఞాన్ని సృష్టించేవాడు, రక్షించేవాడు, ముగించేవాడు, యజ్ఞానికి ఫలభోక్త, ఫలప్రదుడు, ఆరాధ్యుడు, నిర్వాహకుడు, అన్నీ అతడే అయినందున, అతడు యజ్ఞశబ్దంచేత వ్యవహరింపబడుతున్నాడు. ఇటువంటి మహిమ ఇతనికి ఒక్కనికే ఉన్నదనే విషయాన్ని, ఇక వేఱు ఏ దైవానికి లేదనే విషయాన్ని వేదంలో అంతటా కానవచ్చు. మంత్రంలోని వై అనే ప్రసిద్ధిని తెలిపే శబ్దం దీనినే తెల్పుతున్నది.

దీనినిబట్టి యజ్ఞశబ్దం ప్రయోగింపబడిన సందర్భాలలో అంతటా విష్ణువే- అర్థమని గ్రహించరాదు- అనేది కూడా గుర్తించదగినది. ఎందుకంటే- యాగాన్ని, యజమానిని కూడా నిర్దేశించే సందర్భాలున్నాయి. యజ్ఞశబ్దార్థం ఆ యా ప్రకరణాలను బట్టి నిర్ణయించాలి.

యజ్ఞశబ్దంచేత విష్ణువుకు సూచించడానికి ముఖ్యమైన కారణం ఒకటి ఇకపై ఉపపాదింపబడుతున్నది.

(యజ్ఞ ఏవాంతతః ప్రతితిష్ఠతి) - యజ్ఞశబ్దవాచ్యుడైన విష్ణువేకదా, చివరివరకు నిలచి ఉండి, యజ్ఞఫలాన్ని అనుగ్రహిస్తున్నాడు. అచేతనమై, క్షణధ్వంసియైన క్రియాకలాపరూపమై ఉండే యాగరూపమైన కార్యం ఫలాన్ని ఇవ్వలేదు

కదా! – ఆ కార్యంతో సంతోషించిన పరమపురుషుడైన ఇతడే కదా ఫలాన్ని ఇచ్చేవాడు. అందువల్ల, వాస్తవంగా యజ్ఞఫలప్రదుడు ఇతడే– అని భావం.

(వైష్ణవీ మృచ మనుబ్రూయాత్)– అనే రెండవ మంత్రంలో ఇది విష్ణువునే దేవతగా కల్గిన మంత్రం– అని తెలుపబడుతున్నది.

విష్ణుపదప్రయోగం మంత్రంలో చేయబడినందున, ఆదిత్యపరంగా కొందఱు అర్థాన్ని చెప్పవచ్చునని కొందఱు భావించి, ఇది వైష్ణవమంత్రమే–అని వేదం ఉద్ఘోషిస్తున్నది. యజ్ఞశబ్దవాచ్యుడు విష్ణువే – అని పల్కి, దానిని ఇంకొక హేతువుతో ఉపపాదిస్తున్నది, ఈ మంత్రం.

(యజ్ఞేనైవ యజ్ఞం సంతనోతి) –యజ్ఞం ద్వారానే మానవుడు యజ్ఞస్వరూపియైన విష్ణువును ఆరాధిస్తున్నాడు. ఆరాధ్య– ఆరాధక భావాన్ని పురస్కరించుకొని భగవానునకు యజ్ఞశబ్దవాచ్యత్వమున్నది– అని భావం. వర్ణాశ్రమాచారవతా ఇత్యాదిగా పూర్వం ప్రస్తావించిన ప్రమాణాలు ఇక్కడ అనుసంధేయాలు. లేక, యజ్ఞశబ్దవాచ్యుడైన పరమపురుషుడు రక్షకుడై ఉన్నందువల్లనే, యజ్ఞాన్ని భావ్యంగా యజమాని ముగిస్తున్నాడు–అని కూడా దీనికి అర్థం చెప్పవచ్చు. యజ్ఞో వై విష్ణుః అనే సామానాధికరణ్యం రక్ష్యరక్షకభావనిబంధనం (విష్ణువు యజ్ఞసంరక్షకుడుగా, యాగం అతనిచే రక్షింపబడేదిగా ఉండడమనే కారణాన్ని పురస్కరించుకొన్నది) అని భావం.

ఈ విధంగా ఈ రెండు మంత్రాలద్వారా యజ్ఞస్వరూపి అయినందున, యజ్ఞశబ్దవాచ్యుడు విష్ణువే– అని నిరూపింపబడింది.

ఇక, యజుస్సంహితలోని అయిదవ కాండం, అయిదవ ప్రశ్నలో, విష్ణుపారమ్యాన్ని ప్రకటించే ఒక మంత్రాన్ని, యజుర్బ్రాహ్మణంలో రెండవ అష్టకం

నాల్గవ ప్రశ్నలో ముందు మంత్రంతో సమానార్థకమై ఉండే ఇంకొక మంత్రాన్ని గమనిద్దాం.

అగ్ని రవమో విష్ణు ర్దేవానాం పరమః (యజుస్సంహిత–5–5)

దేవానాం = దేవతలలో, అగ్నిః = అగ్ని, అవమః= తక్కువ, విష్ణుః =విష్ణువు, పరమః = ఉన్నతుడు.

అగ్నిరగ్రే ప్రథమో దేవానాం సంయాతానా ముత్తమో విష్ణురాసీత్॥

దేవానాం = దేవతలలో, అగ్నిః= అగ్ని, అగ్రే ప్రథమః= ఆరంభంలో ముందువాడు (తక్కువవాడని భావం), విష్ణుః= విష్ణువు, సంయాతానాం = ఈ సంసారమండలంనుండి విడివడిన ముక్తులకు కూడా, ఉత్తమః ఆసీత్ = ఉత్తముడై ఉన్నాడు.

దేవతలలో అగ్రస్థానాన్ని, అథమస్థానాన్ని చూపే మంత్రాలివి.

(అగ్ని రవమో దేవానామ్)– అగ్ని అందఱు దేవతలకు ముఖస్థానీయుడై, వారికి శేషభూతుడై ఉన్నందున అగ్నియే దేవతలలో అథమస్థానీయుడు. అగ్ని రగ్రే ప్రథమో దేవానామ్ అనే సూక్తికూడా ఇదే అర్థాన్ని ఇస్తుంది. పూర్వమంత్రంలో వలె నేరుగా పలుకకుండా, క్రిందనుండి లెక్కించినపుడు అగ్నియే మొదటివాడని మఱుగుపరచి వేదం పల్కుతున్నది. అగ్ని స్సర్వా దేవతాః (బ్రాహ్మణమ్–కాండమ్–1, ప్రశ్న6, అధ్యాయం–2) (అగ్నియే దేవతలందఱు) అని చెప్పబడినందున, అతనిని అధముడుగా చెప్పవచ్చునా? అని అంటే,

తే దేవా అగ్నౌ తనూః సన్న్యదత్త తస్మాదాహుః అగ్ని స్సర్వా దేవతాః

(ఆ దేవతలు అగ్నివద్ద తమ శరీరాలను సమర్పించారు. అందువల్ల అగ్ని అందఱు దేవతలుగా చెప్పబడుతున్నాడు) అని,

తే దేవా బిభ్యతో అగ్నిం ప్రవిశం తస్తస్మాదాహు రగ్ని స్సర్వా దేవతాః

(ఆ దేవతలు అసురులవలన భయపడినవారై, అగ్నిలో ప్రవేశించిన వారయ్యారు. అందువల్ల అగ్ని అందఱు దేవతలుగా చెప్పబడుతున్నాడు) అని వేదంలోని స్థలాంతరాలలో అగ్ని సర్వదేవతలుగా పఠింపబడడానికి కారణం వివరింపబడినది. కనుక అగ్నిని అథమదేవతగా పల్కడంలో లోటు లేదు.

(విష్ణుః పరమః)- పరో మా యస్మాత్ స పరమః - విష్ణువే నిస్సమాభ్యధికుడైన దేవత. నారాయణపరం బ్రహ్మ,

న తే విష్ణో జాయమానో న జాతో దేవ మహిమ్నః పరమంతమాప

(విష్ణూ! పుట్టేవాడుకాని, పుట్టినవాడుకాని నీ మహిమయొక్క అంతాన్ని చూడలేడు),

న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే

(అతడే తనకు సమానుడు, మించినవాడు ఎవడూ లేనివాడు) మొదలైన వేదవాక్యాలలోను,

సత్యం సత్యం పునస్సత్య ముద్ధృత్య భుజ ముచ్యతే,
వేదశాస్త్రాత్ పరం నాస్తి న దైవం కేశవాత్పరమ్

(ముమ్మారు శపథం చేసి, చేతులను ఎత్తి, పల్కుతున్నాను. వేదంకంటే గొప్ప శాస్త్రం లేదు. కేశవుని కంటే గొప్ప దైవం లేదు) అని,

నారాయణ సమో దేవో న భూతో న భవిష్యతి

(నారాయణునితో సాటి వచ్చే, లేక, మించిన దైవం ఇంతకు ముందు లేడు, ఇకపై ఉండబోడు) అని,

అధికం మేనిరే విష్ణుం దేవా స్సర్షిగణా స్తదా (రామా-బాల-75-19)

(ఋషులతో కూడిన దేవతలు విష్ణువును హరునికంటే గొప్పవానిగా గ్రహించారు) అని,

న త్వత్సమోఽభ్యధికః కుతోఽన్యః లోకత్రయేఽ ప్యప్రతిమప్రభావ

(సాటిలేని మహిమను కలవాడా! ముల్లోకాలలో నీతో సాటి వచ్చేవారు లేరు, మించినవాడెవడూ లేడు) అని మొదలైన వందలాది ఇతిహాసపురాణ వచనాలలో ఈ వేదవాక్యం ఉపబృంహితమైనది కదా.

(సంయాతానామ్ ఉత్తమో విష్ణు రాసీత్) – అని రెండవ మంత్రంలో పఠింపబడింది. పునారవృత్తిని కల ఈ దేవతలు ఒకవైపు ఉండనివ్వండి. ఈ సంసారమండలంనుండి పూర్తిగా విడుదలను పొందిన ముక్తులకు కూడా ఉత్తముడు కదా విష్ణువు అనే అర్థం ఇందులో ధ్వనిస్తున్నది. లేక, సంయాతాః అని కర్మభూమినుండి భోగభూమిని పొందించే దేవతలనే నిర్దేశిస్తున్నదని భావించినా లోటు లేదు.

ఈ విధంగా ఈ మంత్రాలద్వారా దేవతలలో మిక్కిలి ఉన్నతుడైన దైవం విష్ణువే- అని ఉద్ఘోషింపబడింది.

ఇక, యజుర్వేదంలో, ప్రథమకాండం సప్తమప్రశ్నలోను, పంచమకాండం ద్వితీయప్రశ్న ఆరంభంలోను అధ్యయనం చేయబడే ఒక మంత్రాన్ని, దానితో సంబంధం కల్గినది, నాల్గవ కాండం- రెండవ ప్రశ్న ఆరంభంలో అధ్యయనం చేయబడే ఒక మంత్రాన్ని గమనిద్దాం.

1. విష్ణు ముఖా వై దేవా శ్ఛందోభి రిమాన్ లోకాన్ అనపజయ్య మభ్య జయన్।

యద్విష్ణుక్రమాన్ క్రమతే విష్ణు రేవ భూత్వా యజమాన శ్ఛందో భిరిమాన్ లోకాన్ అనపజయ్య మభిజయతి।

విష్ణోః క్రమోస్యభిమాతి హేత్యాహ గాయత్రీ వై పృథివీ త్రైష్టుభ మంతరిక్షం జగతీద్యౌ రనుష్టుభీర్దిశ శ్ఛందోభిరేవేమాన్ లోకాన్ యథా పూర్వ మభిజయతి.

2. విష్ణోః క్రమోస్యభిమాతిహా। గాయత్రం ఛంద ఆరోహ। పృథివీ మనువిక్రమస్వ. నిర్భక్తః స యం ద్విష్మః। విష్ణోః క్రమోస్యభిశస్తిహా। త్రైష్టుభం ఛంద ఆరోహ। అంతరిక్ష మనువిక్రమస్వ.। నిర్భక్తః సయం ద్విష్మః । విష్ణోః

క్రమోస్యరాతీయతోహంతా। జాగతం ఛంద ఆరోహ। దివ మను విక్రమస్వ। నిర్భక్తః నయం ద్విష్మః। విష్ణోః క్రమోసి శత్రూయతో హంతా। ఆనుష్టుభం ఛంద ఆరోహ।దిశోను విక్రమస్వ। నిర్భక్తః స వయం ద్విష్మః.॥

1. విష్ణుముఖాః = విష్ణువును నాయకునిగా కల్గిన, దేవాః= దేవతలు, ఛందోభిః= ఛందస్సులతో, ఇమాన్ లోకాన్ = ఈ లోకాలను, అనపజయ్యం = ఇతరులచే జయింపబడడానికి సాధ్యం కాని రీతిలో, అభ్యజయన్ =జయించారు, యత్ యజమానః విష్ణుక్రమాన్ క్రమతే = యజమానుడు యాగవిశేషంలో విష్ణుక్రమాలను చేసినవాడైతే, విష్ణుః ఏవభూత్వా = విష్ణువు వలె అయి, ఛందోభిః= ఛందస్సులతో, ఇమాన్ లోకాన్ = ఈ లోకాలను, అనపజయ్యం = జయించడానికి వీలు కాని రీతిలో, అభిజయతి = జయిస్తున్నాడు, విష్ణోః క్రమః అసి అభిమాతిహా ఇతి ఆహ = (ఈ విష్ణుక్రమాన్ని) విష్ణుక్రమోసి అని ఆరంభమవుతున్న మంత్రం చెబుతున్నది, గాయత్రీ ఏవ పృథివీ = గాయత్రియే పృథివి, త్రైష్టుభమ్ అంతరిక్షమ్ = త్రిష్టుభ్ఛందస్సు అంతరిక్షం, జగతీ ద్యౌః = జగతీ ఛందస్సు ద్యులోకం, ఆనుష్టుభీర్దిశః = అనుష్టుభ్ ఛందస్సు దిక్కులు, ఛందోభిః ఏవ = ఛందస్సులతోనే, ఇమాన్ లోకాన్ = పృథివి మొదలైన లోకాలను, యథాపూర్వం = పూర్వం విష్ణువును జయించినట్లే, అభిజయతి = జయిస్తున్నాడు.

2. అభిమాతిహా = పాపాన్ని హరించే, విష్ణోః క్రమః అసి = విష్ణువు యొక్క పాదస్థానమవుతున్నావు, గాయత్రం ఛందః ఆరోహ = గాయత్రీ ఛందస్సుపై అధిరోహించు, పృథివీమ్ అనువిక్రమస్వ భూమిని జయిస్తావు, యం ద్విష్మః సః నిర్భక్తః= ఏ పాపాన్ని మనం గర్హిస్తున్నామో, అది నశించింది, అభిశక్తిహా = అసత్యమైన అపవాదును హరించే, విష్ణోః క్రమః అసి = విష్ణువు యొక్క పాదన్యాస మవుతున్నావు, త్రైష్టుభం ఛందః ఆరోహ = త్రిష్టుభ్ ఛందస్సుపై ఆరోహించు, అంతరిక్షమ్

అనువిక్రమస్వ అంతరిక్షాన్ని జయిస్తావు, యం ద్విష్మః సః నిర్భక్తః= ఏ అసత్యమైన అపవాదులను మేము ద్వేషిస్తున్నామో, అది నశించింది. అరాతీయ మతో హంతా = లోభగుణాన్ని హరించే, విష్ణోః క్రమః అసి = విష్ణువు యొక్క పాదన్యాసమై ఉన్నావు, జాగతం ఛందః ఆరోహ= జగతీ ఛందస్సుపై అధిరోహించు, దివమ్ అనువిక్రమస్వ = ద్యులోకాన్ని = జయిస్తావు, యం ద్విష్మః సః నిర్భక్తః= ఏ లోభగుణాన్ని మేము గర్హిస్తున్నామో, అది తొలగిపోయింది, శత్రూయతో హంతా = క్రోధగుణాన్ని హరించే, విష్ణోః క్రమః అసి = విష్ణువు యొక్క పాదన్యామవుతున్నావు, ఆనుష్టుభం ఛందః ఆరోహ అనుష్టుభ్ ఛందస్సుపై ఆరోహించు, దిశః అనువిక్రమస్వ = దిక్కులను జయిస్తావు, యం ద్విష్మః నః నిర్భక్తః = ఏ క్రోధగుణాన్ని మనం గర్హిస్తున్నామో, అది నశించింది.

ఈ రెండు మంత్రాలలో, మొదటి మంత్రం భగవానుని పురస్కరించుకొన్న దేవతలు జగత్తు అంతటిని జయించిన వృత్తాంతాన్ని తెల్పుతున్నది.

(విష్ణుముఖా వై దేవాః)– విష్ణువును నాయకునిగా కల్గిన దేవతలు—అని అర్థం. విష్ణుః పరమః అని అధ్యయనం చేయబడుతున్నందున ఇతడే నాయకుడుగా ఉండడానికి తగినవాడై ఉన్నాడు కదా!

(ఛందోభిః ఇమాన్ లోకాన్ అనపజయ్య మభ్యజయత్)ఛందస్సులతో ఈ లోకాలను ఇతరులు జయించడానికి వీలు లేని రీతిలో జయించారు.

(ఛందోభిః) – ఛందస్సులకు అభిమాని దేవతలైనందున, వారిని కూడా సహాయంగా చేసికొని– అని అర్థం.

(అనపజయ్యమ్)– వీరు అసురులదగ్గరనుండి జయించినట్లే, వీరి దగ్గరనుండి ఎవరూ వీటిని జయించరానట్లుగా.

(ఇమాన్ లోకాన్ అభ్యజయన్)– ఈ లోకాలను జయించారు.

(య విష్ణుక్రమాన్ క్రమతే యజమానః)– యాగవిశేషంలో యజమాని విష్ణుక్రమాలను చేసినట్లయితే,

(విష్ణురేవ భూత్వా ఛందోభి రిమాన్ లోకాన్ అనపజయ్యె మభియజతి)– విష్ణువుగానే అయి, ఛందస్సులతో ఈ లోకాలను ఇతరులు ఇక జయించరాని రీతిలో జయిస్తాడు.

(విష్ణురేవ భూత్వా)– ఇక్కడ 'ఏవ'శబ్దం ఇవార్థకం. విష్ణువువలె వీర్యాన్ని కలవాడై– అని అర్థం. విష్ణుక్రమక్రమణాన్ని వివరించే మంత్రాన్ని, విష్ణుముఖులైన దేవతలు ఏ లోకాలను జయించారు? అనే విషయాన్ని, ఛందోభిమానదేవతలను సహాయంగా చేసికొనడానికి కారణమేది? అనే విషయాన్ని ఇక వివరించడం జరుగుతున్నది.

(విష్ణోః క్రమోస్యభిమాతి హేత్యాహ)– విష్ణుక్రమోస్యభిమాతిహా అని విష్ణుక్రమప్రమాణాన్ని వేదమంత్రం పల్కుతున్నది. యజమానుడు చెప్పాడని కూడా భావం. ఈ మంత్రం, తరువాత వివరింపబడుతుంది.

(గాయత్రీ వై పృథివీ) – గాయత్రియే పృథివి. అంటే,గాయత్రీదేవతయే పృథివికి అభిమానదేవత. (పృథివిని అభిమానించే దేవత) అందువల్ల, ఆ దేవతను పృథివిని జయించడానికి సహాయంగా దేవతలు చేసికొన్నారు.

(త్రైష్టుభ మంతరిక్షమ్)– త్రిష్టుభ్ దేవత అంతరిక్షాన్ని అభిమానిస్తుంది.

(జగతీ ద్యౌః)– జగతీదేవత ద్యులోకాన్ని అభిమానిస్తుంది.

(ఆనుష్టుభీర్దిశః)– అనుష్టుభ్ దేవత దిక్కులను అభిమానిస్తుంది.

(ఛందోభిరేవ ఇమాన్ లోకాన్ యథాపూర్వ మభిజయతి)– ఈ కారణం వల్లనే ఛందోదేవతలను పురస్కరించుకొని, ఈ లోకాలను విష్ణువు మొదలైన దేవతలు

జయించారు. యాగంలో విష్ణుక్రమాలను చేసే యజమాని ఛందోభిమానదేవతల సహాయాలతో ఈ లోకాలను విష్ణువు వలె జయిస్తున్నాడు – అని భావం.

ఎవరి దగ్గర నుండి, ఎపుడు ఈ లోకాలను విష్ణుముఖులైన దేవతలు జయించారు? అని పరిశీలిస్తే,

**అతో దేవా అవంతు నో యతో విష్ణుర్విచక్రమే,**
**పృథివ్యాః సప్త ధామభిః (ఋగ్వేదం – అష్టకం–1–3–7, ముండక–1–5–22)**

(ఏ భూమినుండి విష్ణువు ఏడు ఛందస్సులను సాధనాలుగా గ్రహించి కొలిచాడో, ఆ భూమిలోనుండి దేవతలు మనలను కాపాడుదురు గాక! )

అని అధ్యయనం చేయబడే రీతిలోనే త్రివిక్రమావతార కాలంలో మహాబలిదగ్గరనుండి పరమపురుషుడు ఈ లోకాలను తిరిగి సంపాదించి ఇచ్చిన విషయమే ప్రకృతంలో ప్రస్తావింపబడినది– అని తెలుస్తున్నది.

అతో దేవా అనే ఈ ఋగ్వేదమంత్రం విష్ణుసూక్తవ్యాఖ్యానారంభంలో వ్యాఖ్యానింపబడింది.

**దేవాః స్వస్థాన మాయాంతి నిహతా దైత్యదానవాః,**
**న భయం విద్యతే కించిత్ జితం భగవతా జగత్**

(దేవతలు తమ నివాసాలకు తిరిగి వస్తున్నారు, అసురులు, దైత్యులు నశించారు. ఇక భయంలేదు. భగవానునిచే లోకం జయింపబడింది) అని ఋషులచే ఈ జయం చెప్పబడింది. ఈ విధంగా గ్రహించినపుడు ఛందస్సులు ఏ రీతిలో సహాయం చేశారు? అంటే, వేదాన్ని అధ్యయనం చేసే బ్రహ్మచారియై, మహాబలిని వంచించి, లోకాలను జయించినందున, ఛందస్సులతో అతడు జయించాడని అనబడుతున్నది. దేవతలు జయించారు అనేది –దేవప్రేరితుడై, వారికోసం జయించాడు కనుక, ఇతని జయం వారి జయమే అవుతుంది కనుక, ఆ విధంగా చెప్పబడింది–అని భావించాలి.

ఈ విధంగా కాకుండా, కాలాంతరంలో విష్ణువు దేవతలతో ఛందో దేవతలతో కూడి లోకాలను జయించడాన్ని తెల్పుతున్నట్లుగా కూడా చెప్పవచ్చు. తరువాత మంత్రంలో ఛంద ఆరోహ (ఛందస్సులపై ఆరోహించు) అని పలుమార్లు పఠింపబడడాన్ని గమనిస్తే, ఛందస్సులు విష్ణువునకు సాధనాలై, సహాయపడ్డాయి– అని తెలుస్తున్నది. వేదస్వరూపి అయిన గరుడునిపై అధిరోహించి, లోకాలను జయించడమే వేదం ఈ రీతిలో మఱుగుపరచి పల్కుతున్నదని భావించడంలో కూడా తప్పు లేదు.

ఈ విధంగా, విష్ణుక్రమాలను విధించే ఈ మంత్రంలో పరమపురుషుడే సర్వలోకాలను జయించినవాడు– అని చూపబడింది.

ఇక, విష్ణుక్రమాలకు వివరించే విష్ణోః క్రమోస్యభిమాతిహా ఇత్యాది మంత్రం వివరింపబడుతున్నది.

(విష్ణోః క్రమోసి అభిమాతిహా)– పాపాన్ని హరించే విష్ణువుయొక్క పాదన్యాసమై ఉన్నావు– అని అర్థం. పాప్మా వై అభిమాతిః (పాపమే అభిమాతి అనబడుతున్నది)– అని వేరొక మంత్రం పల్కుతున్నందున, అభిమాతిహా అనేది– పాపాన్ని హరించేది– అనే అర్థాన్ని ఇస్తుంది. విష్ణురేవ భూత్వా అని గడచిన మంత్రం యజమానుడు విష్ణుక్రమక్రమణం ద్వారా విష్ణుశబ్దంతో నిర్దేశింపబడుతున్నాడు. విష్ణువు శ్రీచరణానికే పాపాన్ని పోగొట్టే స్వభావం ఉన్నది కనుక, యజమానుని వేదం విష్ణువుగా నిర్దేశిస్తున్నది.

యచ్ఛౌచనిఃసృతసరిత్ప్రవరోదకేన
తీర్థేన మూర్ధ్ని విధృతేన శివ శ్శివోఽభూత్ (భాగవతమ్)

(ఎవని శ్రీచరణాన్ని అభిషేకించినందున వెలువడిన గంగాజలాన్ని తలపై ధరించి, శివుడు శివుడుగా అయ్యాడో) అని శ్రీభాగవతంలో భగవచ్చరణపావనత్వం చెప్పబడింది.

(గాయత్రం ఛందః ఆరోహ)– గాయత్రీ ఛందస్సుపై అధిరోహించు,

(పృథివీ మనువిక్రమస్వ)- గాయత్రీదేవతచే అభిమానింపబడిన భూమిని జయిస్తావు.

(నిర్భక్తః సవయం ద్విష్మః) - మనం గర్హించే పాపం విష్ణుక్రమవైభవంతో తీరిపోయింది.

(విష్ణోః క్రమోస్యభిశస్తిహా) - అభిశస్తి అంటే- నింద. అసత్యమైన-అని అర్థం. దానిని పోగొట్టే విష్ణువుయొక్క పాదన్యాసమవుతున్నావు.

(త్రైష్టుభం ఛందః ఆరోహ అంతరిక్షమనువిక్రమస్వ) త్రైష్టుభ ఛందస్సును అధిరోహించు. ఆ ఛందోదేవతచేత అభిమానింపబడిన అంతరిక్షాన్ని జయిస్తావు.

(నిర్భక్తః స వయం ద్విష్మః)- మేము గర్హించే మిథ్యాపవాదం విష్ణుక్రమవైభవంతో తీరిపోయింది.

(విష్ణోః క్రమోస్యరాతీయతో హంతా)- రా-దానే అనే ధాతువైనందున, రాతిః అనేది దానాన్ని చెబుతున్నది. అరాతిః అని దానరాహిత్యం తెలుపబడుత్నుది. అరాతీయత్ అని దానరాహిత్యాన్ని కోరే లోభగుణం తెలుపబడుతున్నది. దానిని పోగొట్టేది విష్ణువుయొక్క శ్రీపాదన్యాసమే.

(జాగతం ఛందః ఆరోహ దివ మనువిక్రమస్వ) - జగతీచ్ఛందస్సుపై అధిరోహించి, ఆఛందోదేవతచే అభిమానింపబడిన ద్యులోకాన్ని జయించు.

(నిర్భక్తః సయం ద్విష్మః) - మేము గర్హించే లోభగుణం తీరిపోయింది.

(విష్ణోః క్రమోపి శత్రూయతో హంతా)- శత్రూయత్ అని తాను వర్థిల్లే కొద్దీ శత్రువులను ఇంకా ఇంకా అభిలషించే పగ అయిన క్రోధగుణాన్ని తెల్పుతుంది.

కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః,
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్

(ఈ కామమే క్రోధంగా పరిణమిస్తుంది. ఇది రజోగుణం వల్ల కల్గుతున్నది. ఇది మిక్కిలి ఆహారాన్ని కోరేదిగా, మిక్కిలి పాపాన్ని చేసేదిగా ఉన్నది. దీనిని లోపల

ఉండే శత్రువుగా గ్రహించు) అని గీతలో చెప్పబడింది కదా. దానిని హరించే విష్ణువుయొక్క పాదన్యాసం కాగలవు– అని అర్థం.

(ఆనుష్టుభమ్ ఛంద ఆరోహ దిశ నువిక్రమస్వ)– అనుష్టుభ్ ఛందస్సుపై అధిరోహించు. ఆ ఛందోదేవతచేత అభిమానింపబడిన దిక్కులను జయిస్తావు.

(నిర్భక్తః స వయం ద్విష్మః) మేము ద్వేషించే క్రోధగుణం తీరిపోయింది.

ఈ విధంగా ఈ మంత్రంతో విష్ణువు శ్రీచరణాలు పాపాన్ని, దానికి కార్యంగా, కారణంగా పరిభ్రమిస్తూ వచ్చే దుర్గుణాలను హరిస్తుందని, లోకాన్ని అంతటినీ జయిస్తుందని చెప్పబడుతున్నది.

ఈ విధంగా, ఇంతవరకు ఋగ్వేదంలో, యజుర్వేదంలో పఠింపబడే ముఖ్యమైన కొన్ని విష్ణుసూక్తాలు వివరింపబడ్డాయి. మిగిలిన వేదాలలో కూడా ఇవి పఠింపబడుతున్నాయి.

వేదంలో వేఱు ఏ దేవతకు ఇంతటి మహిమలు పఠింపబడలేదు– అనేది నిష్పక్షపాతంగా చూచేవారికి చక్కగా స్ఫురిస్తుంది.

రుద్రాది అన్యదైవాలకు వేదంలో సూక్తాలున్నాయి. అయితే, వాటిలో విష్ణుసూక్తాలలో వలె పరమాత్మకు అసాధారణాలైన చిహ్నాలు లభించవు. రుద్రో వై క్రూరః అని వేదమే పల్కినట్లుగా, రుద్రుడు క్రూరస్వభావాన్ని కలవాడైనందున రుద్రనమకాదులలో నమశ్శబ్దం అధికంగా ఉండడం గమనిస్తాం. పరమాత్మ ధర్మమైన సర్వాత్మకత్వ సర్వసంహారకత్వమోక్షప్రదత్వాది చిహ్నాలు వాటిలో లేవు– అనేది స్పష్టం. ఉపనిషద్భాగాలలో వలె వేదంలోని పూర్వభాగాలలో కూడా సర్వవ్యాపకుడైన విష్ణువే సర్వేశ్వరుడుగా ఘోషింపబడుతున్నాడు– అనేది ఈ విష్ణుసూక్తాలను పఠించేవారికి విపర్యయరహితంగా వ్యక్తమవుతుంది.

ఇక, ఈ విష్ణుసూక్తాలలో చెప్పబడిన పరమపురుషుని మహిమలను (ఇందులో వివరింపబడిన వరుసలలో) గణనం చేసి, విష్ణుసూక్త వ్యాఖ్యానం ముగింపబడుతున్నది.

(1) లోకాలను అన్నిటిని కొలిచినవాడు, విష్ణువు, (2) ఇతని మూడడుగులలో లోకం అంతా ఆవరింపబడింది. (3) విష్ణువే సర్వరక్షకుడుగా, ఎవరికి జయింపరానివాడుగా, ధర్మసంస్థాపనార్థంగా అవతరించేవాడై ఉన్నాడు. (4) విష్ణువుయొక్క లీలలు ధర్మసంస్థాపనం కోసమే సంభవించినవి, (5) విష్ణువుయొక్క స్థానమే పరమపదం అనబడుతున్నది. దానిని నిత్యసూరులు సదా దర్శిస్తారు, (6) ముక్తులచే స్తుతింపబడే వాడితడే, (7) స్తుతించదగిన వీరకృత్యాలను కలవాడతడే. సర్వలోకాలను సృష్టించినవాడు, కొలిచినవాడితడే. గొప్పవారిచే మిక్కిలిగా స్తుతింపబడేవాడితడే. (8) నృసింహునిగా, త్రివిక్రమునిగా అవతరించి, అతిపరాక్రమ లీలలను చేసినవాడు, ఈ స్వామియే. (9) ఒక్కడుగా ఈ లోకాలను అన్నిటిన మూడు పాదాలతో కొలిచినవాడే మనోరథాలను అన్నిటిని వర్షించేవాడుగా, అవధి లేని కీర్తిని కలవాడుగాను, మంగళాశాసన చేయదగినవాడుగాను ఇతడు ఉన్నాడు. (10) త్రివిక్రముడే సమస్త జగత్తును ఒక్కడుగా ధరించి నిలిచాడు (11) మకరందం ఒలికే శ్రీచరణాలను కల అతడే సర్వవిధబంధువు (12) సర్వకామాలను వర్షించే అతని పరమపదమే మిక్కిలి మహిమను పొంది వెల్గుతున్నది. (13) స్తుతించదగినవాడు, పెద్దవాడు, శూరుడు, సమారాధ్యుడు అయినవాడతడే (14) యజ్ఞఫలప్రదుడతడే, (15) ప్రజాసృష్టిని చేసేవాడితడే, (16) సర్వస్వామిగా, సర్వరక్షకుడుగా, పరమదయాళువుగా, నిత్యయౌవనాన్ని కలవాడుగా ఉండే అతడే ముల్లోకాలను కొలువడమనే వీరకృత్యాన్ని చేశాడు, (17) ఇతని రెండు పాదన్యాసాలనుగూర్చి జగత్తు అంతా తెలిసి భజిస్తున్నారు. మూడవ పాదన్యాసాన్నిగూర్చి ఎవరూ తెలియరు, (18) కాలచక్రాన్ని

పరిభ్రమింపజేసేవాడు, యువా కుమారుడైన తిరుమేనితో భక్తులకోసం పోరాడే వీరుడతడే, (19) స్తుతింపదగినవాడు, యజ్ఞారాధ్యుడు, ఇతడే. (20) సర్వశరణ్యుడు లక్ష్మీనాథుడు, పూజింపదగిన అప్రాకృతమైన జన్మను కలవాడు ఇతడే, (21) స్తుతించదగినవాడు, సంకీర్తనం చేయదగినవాడు, పూజింపదగినవాడితడే, (22) సర్వరక్షకుడు, సర్వకర్మఫలప్రదుడు ఇతడే, (23) పరమపదంలో ఉండే ఇతడే తనకు మిత్రుడైన ఇంద్రునకు హితాన్ని చేయగోరి ఉపేంద్రుడుగా అవతరించాడు, (24) ఇతని మహిమను ఎవరూ తెలియలేరు, ఇతని మూడవ పాదన్యాసాన్ని గూర్చి ఇతడే తెలియగలడు, (25) ఉభయవిభూతి నాథుడైన ఇతని గొప్పతనం యొక్క పరమావధిని మూడు కాలాలలో ఎవరూ తెలియలేరు, (26) ఇతని స్పర్శతో లోకం అంతా గొప్పతనాన్ని పొందింది. లోకాలను విశేషకటాక్షాలతో ధరించి నిలచేవాడితడే, (27) వృషశిప్రుడనే అసురుని మాయలను నాశం చేసి స్వర్గం, సూర్యుడు మొదలైనవానిని సృష్టించినవాడు విష్ణువే, (28) శంబరాసురుని తొంభై తొమ్మిది పురాలను కూల్చి, అతని నూఱువేల మంది వీరులను సంహరించినవాడితడే, (29) మహనీయుడు, మహాపరాక్రమశాలి అయిన ఇతడే అన్నాన్ని ఇచ్చేవాడు. (30) వషట్కరింపబడిన హవ్యాలను భుజించే ఇతడే సర్వశుభాలను అనుగ్రహించి కాపాడతాడు, (31) ఆత్మా-ఆత్మీయభరసమర్పణం చేసేవారికి మోక్షాన్ని అనుగ్రహించేవాడితడే, (32) మంచి జ్ఞానాన్ని ఇచ్చేవాడితడే, (33) త్రివిక్రముడైన ఇతడే అందటి కంటే వృద్ధుడై, పూర్వుడై-ఉండేవాడు, ఇతని తిరునామమే రక్షకత్వంలో మిక్కిలి ప్రకాశిస్తున్నది, (34) ఇతనిని స్తుతించేవారు స్థిరంగా నిలుస్తారు, అప్రాకృతమైన జన్మను కల అతడే భక్తులకు అరుదైన లీలలను చేసి, నివాసస్థానాన్ని ఇస్తాడు, (35) అతని స్థానం మూడు గుణాలకు అతీతమైనది, నామసంకీర్తనం చేసేవారికి మోక్షాన్ని ఇచ్చేవాడితడే, (36) శౌర్యవీర్య సౌశీల్యసౌలభ్య వాత్సల్య ఔదార్యదయాదిగుణాలను కలవాడితడే, (37) విష్ణువుచేతనే ద్యావాపృథివులు ధరింపబడుతున్నాయి, (38) మిక్కిలి గొప్ప బలాన్ని, కాంతిని కల

అతడు పరమపదం నుండి ఈ లోకాన్ని రక్షిస్తున్నాడు, (39) గొప్ప సంహారకుడు ఇతడే, (40) సకలలోకాలలో ఉండే సర్వఫలాలను సంపూర్ణంగా ఇచ్చేవాడితడే, (41) యజ్ఞస్వరూపియై, యజ్ఞఫలప్రదుడై, యజ్ఞరక్షకుడై, యజ్ఞసమారాధ్యుడై ఉండేవాడితడే, (42) దేవతలలో మిక్కిలి గొప్పవాడై ఉండేవాడు విష్ణువే, (43) విష్ణువును నాయకునిగా కల దేవతలు ఈ లోకాలను జయించారు, (44) విష్ణువు యొక్క శ్రీపాదన్యాసం పాపాన్ని, దుర్గుణాలను పోగొట్టేది ఈ మహిమలవల్ల విష్ణువే సర్వరక్షకుడు, సర్వేశ్వరుడు– అనేది వజ్రలేపాయితంగా సిద్ధించింది.

ఇత్థం శ్రీమాన్ ప్రథితవిభవశ్రీనివాసార్య సూనుః
శ్రీభూనీళాసహితభగవత్పుండరీకాక్షభక్తః।
కృష్ణస్వామీ మధురమధురా వైష్ణవాగ్ర్యార్యతుష్ట్యై
విష్ణోః సూక్తాన్యమితవిభవాన్యాదరా ద్వ్యాచకార॥

(కైంకర్య సంపదను కలవారు, లోకం అంతా వ్యాపించిన కీర్తిని కలవారైన శ్రీనివాసాచార్యులవారి కుమారుడు, శ్రీభూనీళాదేవులతో కూడిన భగవంతుడు, పుండరీకాక్షుని పట్ల భక్తిని కలవారైన శ్రీకృష్ణస్వామి అయ్యంగార్ అనేవారు గొప్ప వైష్ణవ మహనీయుల ప్రీతికోసం, అంతు లేని గొప్పతనాన్ని కల విష్ణుసూక్తాలను చాలా భోగ్యమైన రీతిలో ఈ విధంగా ఆదరంతో వ్యాఖ్యానించారు.)

శ్రీకృష్ణస్వామిభిః ప్రోక్తాం వివృతిం ద్రావిడాత్మికామ్।
శింగరార్యో విదాం ప్రీత్యై గిరాంఽఽఽంధ్ర్యా వ్యలిఖన్ముదా॥

శ్రీకృష్ణస్వామి అయ్యంగార్ అనే మహనీయులు ద్రావిడభాషలో అనుగ్రహించిన ఈ వ్యాఖ్యానాన్ని తత్త్వవిదువైనవారి ప్రీతికై శ్రీ ఈయుణ్ణి అళహ శింగరాచార్యులు ముదముతో ఆంధ్రానువాదమును చేసినారు.

శ్రీ విష్ణుసూక్త వ్యాఖ్యానం సంపూర్ణము.

